

పత్రికా రచయిత, వక్త
మహిళోద్యమ కార్యకర్త
హేతువాద ప్రచారకులు
హ్యూమనిస్టు ఉద్యమ సంచాలకులు

మల్లాది సుబ్బమ్మ

ఇతర రచనలు :-

| | |
|---|---|
| మనం దేనికి బానిసలం ? | (వ్యాస సంపుటి) |
| తల్లే పిల్లను చంపితే ! | ,, |
| విముక్తి ఉద్యమాలు, మహనీయులు | ,, |
| ఆధునిక స్త్రీ | ,, |
| ఓ మహిళా ! ముందుకు సాగిపో | ,, |
| మారుతున్న సమాజం : మహిళలు | ,, |
| పద్మవ్యూహం | (నవల) |

# వెలిగిన జ్యోతి

మల్లాది సుబ్బమ్మ




ప్రజాస్వామ్య ప్రచురణలు (ప్రై) లిమిటెడ్
౪, ఎం.ఐ.జి. హెచ్. కాలనీ, మెహిదీపట్నం, హైదరాబాద్-28

ప్రజాస్వామ్య ప్రచురణలు 13

# వెలిగిన జ్యోతి

మల్లాది సుబ్బమ్మ

ప్రథమ ముద్రణ : 1982

ప్రతులు : 1500



పబ్లిషర్సు :—

ప్రజాస్వామ్య ప్రచురణలు (ప్రై) లిమిటెడ్.,
9, ఎం. ఐ. జి. హెచ్. కాలనీ,
మెహిదీపట్నం, హైదరాబాద్-500 028.

సోల్ డిస్ట్రిబ్యూటర్స్ :

వి కా స ం
9, ఎం. ఐ. జి. హెచ్. కాలనీ,
మెహిదీపట్నం, హైదరాబాద్ - 500 028

వెల రు. **12/-**

ముద్రణ:
లిబర్టీ ప్రింటర్స్
చీరాల-523 155.

# విజ్ఞప్తి

కథ చెప్పాలనిపించింది. ఎవరికథ? విన్నది, కన్నది, చూచింది, జరుగుతున్న కథనే బహిర్గతం చెయ్యాలని పించింది. మరి కథ చెప్పగల గుండె ధైర్యం వుందా? అంతటి శక్తి సామర్ధ్యా లున్నయ్యా? అది సాధ్యమా? తటపటాయించాల్సి వచ్చింది. గుండె నిబ్బరంతో అడుగు ముందుకేశాను. కాగితం, కలం పుచ్చుకున్నాను. ఏం రాయాలి? ఎలా రాయాలి? మళ్ళీ బోనులో పడ్డ ఎలుకలా తికమక పడ్డాను. పుట్టెడాలోచనలతో ఊపిరి సలపడంలేదు. కథాంశం వుంది. భావం వుంది. ఆవేదన వుంది. ఏదో చెప్పలేని మూగబాధ, భరించలేని అసంతృప్తి నాలో చోటు చేసుకున్నాయి. అది నన్నే దహించేలా వుంది. మరి ఏం చెయ్యాలి?

ఎన్ని కథలొస్తున్నాయి? ఎన్ని భావ పరంపరలు దొర్లి పోతున్నాయి? పుంఖాను పుంఖాలుగా నవలలొస్తున్న ఈ రోజుల్లో నా ప్రత్యేకత ఏమిటి? భావంలో నూతనత్వం, ఆధునికత వుందా? మరి వ్రాయటం అవసరమా? జిజ్ఞాసతో సతమతమయినాను. ఏదయినా ఇక నా ఉద్వేగాన్ని ఆపలేని పరిస్థితిలో పడ్డాను.

ఇదొక నూతన ప్రక్రియగా భావించాను. నవలలు వ్రాయటంలో ఇది నా ప్రథమ ప్రయత్నం. బహుముఖ భాషా పాండిత్యం లేని నాకు ఇదొక సాహస కార్యమేనని అనిపించింది. ఈ నవలలో లోపాలు, పొరపాట్లు దొర్లవచ్చు. భాషలో పాండిత్యం, శిల్పంలో పరిపూర్ణత్వం, రచనా విధానంలో

అనుభవం నాకు లేవని సవినయంగా మనవి చేస్తున్నాను. భాషా పరిజ్ఞానం, ప్రతిభా సంపన్నతలు నాలో అత్యల్పం అనక తప్పదు. కాని ఉత్సాహం, ఉద్వేగం, ఆర్తి, సంవేదన, భావం మాత్రమే నా నవలకు ప్రాతిపదికలు. అసలు భాష ముఖ్యమా? భావం ముఖ్యమా? అనే విషయంలో తర్జన భర్జనలు జరుగుతున్నాయి. భావానికే విలువ హెచ్చని కొందరూ, రెంటిలో భాషకు, శిల్పానికే ప్రాధాన్యత అని మరి కొందరూ వాదిస్తున్నారు. రెంటికీ సమాన స్థాయి, విలువ వుందనే దానికి అధిక సంఖ్యాకుల ఆమోదముద్ర వుంది. దీని విషయంలో విజ్ఞులే పరిష్కర్తలు.

అసలు నవల రాయటానికి భావం కావాలి. భాషా సౌలభ్యం కావాలి. శిల్పం కావాలి. చెప్పేరీతిలో నూతనత్వం, పొందిక వుండాలి. రచయిత హృదయ కుహరాలనుండి ఆవేదన రావాలి. సందేశంలో సామాజిక న్యాయం ధ్వనించాలి. చదువరులను ఉత్తేజ పరచాలి. సమ సమాజ ఆవిర్భావానికి నాందీ పలకాలి. ఈ అంశాలను గమనిస్తే ఈ నవలను చదవాలా లేక అదే చదివిస్తుందా అనే ప్రశ్నకు చదువరులే సమాధానం చెప్తారు.

వెలిగిందే కదా జ్యోతి? ఇక 'వెలిగిన జ్యోతి' అని నవల పేరేమిటి? అనే మీమాంస రావచ్చు. స్త్రీలలో జాగృతి నివురు గప్పిన నిప్పులా వుందని, అది ప్రజ్వరిల్లటమే ప్రకాశించే జ్యోతి అని ఒక అర్థం. కంటికీ, కంటిచూపుకూ జ్యోతి అని పదం వాడ్తాము. కంటి చూపు వ్యక్తి పై ఖరిని సూచిస్తుంది కదా? ఎలా ఆలోచించినా పేరు సమంజసమేనని తోచింది.

ఈ నవల గురించి అనేక ఊహలు నా మనస్సులో రేకెత్తినయి. నాకు పురుష ద్వేషం లేదు. పురుష నాశనం

అంతకన్నా కోరను. పురుషులంతా సాడిస్టులనీ, స్త్రీలంతా సాధ్వీమ తల్లులనీ అనే సాహసం నాకు లేదు. కాని పురుష దురహంకారానికి, చిత్రహింసలకు బలి అవుతున్న స్త్రీల గురించి మన వైఖరి ఏమిటి? స్త్రీ పురుషు లిద్దరూ బొమ్మా బొరుసూ లాంటి వారని, వారిద్దరిలో సమానత్వం లేనిదే సామాజిక ప్రగతి అసాధ్యమని నా వాదన. ఆ ప్రచారమే నా ధ్యేయం. మరి తరతరాలుగా స్త్రీ జీవిత విధానం ఎలా ముగుస్తోంది? బానిసత్వాన్ని భరిస్తూ, ఆమె ఎన్ని రకాల సుడిగుండాల పాలౌతోంది? సమాజం, కుటుంబం, శాసనాలు— స్త్రీకి వి మో చ న కావాలి అంటూనే – ఆమెను నల్లిలా నలిపి పారేస్తున్నాయా, లేదా? ఎన్ని కట్టుబాట్లు, మరెన్ని విధులు, ఆమెను దహించివేస్తున్నాయి! కార్యేషు దాసీ.... శయనేషురంభా, క్షమయా ధరిత్రీ...........అంటూ కుల ధర్మపత్ని లక్షణాలు నిర్దేశించారు. కాని 'కులపతి' కి మాత్రం హక్కులు, స్త్రీపై రక్షణా ధికారాలు, ఆధిపత్యం నిర్ణయించారు. 'నస్త్రీ స్వాతంత్ర్య మర్హతి' రీతిలో ఆమెను చదరంగపు పావులా నెడుతూ ఆమె మనుగడకే ముప్పు తెచ్చినప్పుడు ఎందరు 'అ బ ల లు' ఆత్మార్పణం చేసుకుంటున్నారో! ఎంత కాలం పురుష దురహంకారానికి ఆమె బలికావాలి? సాడిస్టు భర్తలకు గుణపాఠం ఎలా చెప్పాలి! వారిని జీవితాంతం మన్నించాలా? వారి మనః ప్రవృత్తి మార్చగలమా? అది అసాధ్య మయినప్పుడు గత్యంతర మేమిటి? సామ దాన భేధోపాయాలకు లొంగని నరరూప రాక్షసుని పట్ల దండోపాయం నేరమా? స్పందన లేని మూర్ఖుడిని ఏం చెయ్యాలి? నరమాంస భక్షకులైన భర్తల ఘాతుకాలనుండి నారీమణులకు విముక్తి లేదా? ఎదుర్కొంటే తప్పా? ఆత్మాహుతి చేసుకుంటే పవిత్రతా? ఎన్నాళ్ళు ఈ నీతులు బోధిస్తారు?

హిట్లరును మనం 'నాయనా! బాబూ!' అంటూ సహృదయుణ్ణి చేయగలమా? అతనిలో స్పందన అవిర్భవిస్తుందా? 18 అక్షౌహిణీల సైన్యాన్ని చంపించిన ధర్మరాజు హంతకుడా? ధర్మదేవతా? లేక మహా సాధువా? దుష్టులకు దుర్మరణమే శరణ్యమని ప్రబోధించిన మహాభారతం స్త్రీల విషయంలో ద్వంద్వ నీతి ప్రతిపాదిస్తోంది కదా!

అలాగే నారీలోకం తాము సర్వనాశనమయ్యే దశలో తిరగబడాలా? లేక లొంగిపోయి వ్యక్తిత్వాన్ని చంపుకోవాలా? లేక ప్రాణత్యాగమే మార్గమని నిరూపించాలా? అలా చచ్చిన వారిని మీరు మనసారా అభినందించగలరా? ఆ తీర్పుకోసమే ఈ నవల.

నా రచనా వ్యాసంగానికి అండదండలు అందించిన నా జీవిత సహచరులు ఎం. వి. రామమూర్తిగారిని ఈ సందర్భంలో పేర్కొనక తప్పదు. పరిచయ వాక్యాలు వ్రాసి నాకు కొండంత ధైర్యాన్ని కల్గించిన సుప్రసిద్ధ రచయిత వాసిరెడ్డి సీతాదేవిగారికి నా ధన్యవాదాలు. ప్రచురణ సందర్భంగా సహాయ సహకారాలు సమకూర్చిన మిత్రులు రావిపూడి వెంకటాద్రిగారికి నా కృతజ్ఞతలు. సకాలంలో పుస్తకాన్ని అచ్చువేసిన చీరాల లిబర్టీ ప్రింటర్స్‌వారిని, ముఖచిత్రం గీచిన బి. వి. సత్యమూర్తిగారిని విస్మరించలేము. తమ పుస్తకాల పట్టీలో చేర్చుకున్న ప్రజాస్వామ్య ప్రచురణల [ప్రై] లిమిటెడ్‌వారికి ఋణపడి ఉన్నాను.

వల్లూరి సుబ్బమ్మ

# ఒక్క క్షణం

మానవుడు తన అనుభూతిని మరొకరికి పంచి ఇవ్వాలనే ఆరాటమే అభివ్యక్తికి మూలాధారం. అభివ్యక్తియే సర్వ కళలకూ మూలం. కాని ప్రతి ఒక్కరి అభివ్యక్తీ కళ కాలేదు.

అనుభూతి తీవ్రమైనపుడు అభివ్యక్తి ప్రతిభావంతంగా ఉంటుంది. కాని కొందరికి మాత్రమే ఆ అనుభూతిని కళాత్మకంగా చెప్పే శక్తి వుంటుంది.

పాశ్చాత్యులనుంచి మనకు లభించిన సాహితీ ప్రక్రియల్లో నవల ఒకటి. ఈనాడు నవలా సాహిత్యం సాహిత్య సామ్రాజ్యాన్నే ఏలుతున్నదంటే అతిశయోక్తి కాదు. పుంఖాను పుంఖాలుగా నవలలు వెలువడుతున్న ఈ రోజుల్లో కొన్ని మంచివి, నిలబడేవి వస్తూనే ఉన్నై. అందువల్ల "అయ్య బాబోయ్! ప్రతివారూ నవలలు వ్రాసిపారేస్తున్నారు!" అని గుండె బాదుకోనక్కరలేదు.

ఏవి నిలుస్తాయో? ఏవి నిలవవో కాలమే నిర్ణయిస్తుంది. కొందరు తమ అనుభూతుల్ని చెప్పకుండా ఉండలేక తపించి మనస్సులో మధిస్తున్న విషయాలను సాహిత్య రూపంలో వెలువరిస్తారు. ఇలా చెప్పేవారి రచనలలో నిజాయితీ ఎక్కువగానే ఉంటుంది. ఇది రచయితకు ముఖ్యం. కొందరు చెప్పగలరు. కాని చెప్పకుండా ఉండలేక కాక, పేరుకోసం, డబ్బుకోసం ఈమధ్య చాలామంది చెబుతున్నారు. ఇలాంటివారు, ఇతర భాషల నవలలనుండి కొన్ని ముక్కలు తీసి, సినిమాలలోని కొన్ని సన్నివేశాలను జోడించి నవలలుగా వ్రాసి పాపులారిటీ సంపాదించుకుంటున్నారు.

సారీ! అసలు విషయం మానేసి ఏదో చెప్తున్నాను కదూ!

శ్రీమతి మల్లాది సుబ్బమ్మగారు మంచి వక్త అనీ, అభ్యుదయ భావాలుగల సంఘ సేవకురాలనీ నాకు తెలుసు. వారి కలంనుండి విభిన్న విషయాలమీద మంచి వ్యాస సంపుటాలు ఆరు వెలువడినై.

ఆమె తన నవలకు నన్ను పరిచయం రాయమన్నప్పుడు ముందు కొంచెం ఆశ్చర్యపోయాను. ఆమె నవలలు కూడా రాయడం ప్రారంభించారని తెలియక పోవటమే నా ఆశ్చర్యానికి కారణం. ఆమె ఏపని చేసినా నిజాయితీతో చేస్తారు. ఈ నవలా ప్రక్రియ కూడా ఆమె తన భావాలను సమాజానికి అందించటానికి చేసిన ప్రయోజనకరమైన ప్రయత్నం అని భావిస్తున్నాను.

"వెలిగిన జ్యోతి" అన్న నవలను చదివాను. నవలకు ప్రధాన గుణం చదివించడం. ఆ గుణం ఈ నవలలో పుష్కలంగా వుంది. ఈ కథలోని ఇతివృత్తం నేటి సమాజంలో స్త్రీల పట్ల జరుగుతున్న అత్యాచారాలు, అన్యాయాలు ఎత్తి చూపిస్తున్నది. ఈ అన్యాయాల యెడల రచయిత్రి మనస్సు ఎంత ఘోషిస్తుందో ఈ నవల చదివితే తెలుస్తుంది.

అయితే—

నవలా ప్రక్రియ గురించిన పరిజ్ఞానం వారికి అంతగా ఉనట్లు కన్పించదు. అందుచేత "నేను" అని ప్రారంభింపచేసి మధ్యలో అకస్మాత్తుగా రచయిత్రి కథను చెప్పటం జరిగింది. ఇందులోని పాత్రలన్నీ ఐదు సంవత్సరాల వయస్సునుండి అరవై సంవత్సరాల వయస్సు వరకూ ఒకే భాష మాట్లాడతాయి.

ఇలాంటివి కొన్ని చిన్న చిన్న లోపాలు ఉన్నప్పటికీ ముందు ముందు వీరి కలం నుండి ప్రయోజనాత్మకమైన మంచి నవలలు వెలువడతాయని ఆశిస్తున్నాను.

వాసిరెడ్డి సీతాదేవి
హైదరాబాదు.

# ముందు మాట



ధనహీనుడైన, కడు దు
ర్జనుడైన, కురూపియైన, జారుండైనన్
విను పాపియైన నెప్పుడు
తన పతియే తనకు దైవతంబు కుమారీ!

(కుమారీ శతకం)

జారుడైనసూ, దుర్జనుడైననూ హిందూ స్త్రీకి పతియే దైవమని ఉగ్గుపాలతో రంగరించి పోసింది హిందూ సంఘం.

అంతటితో ఆగలేదు,

పతి పాపపుపని చెప్పిన
బతిమాలి మరల్చవలయు; పతి వినకున్నన్
హితమనుచు ఆచరింపుము;
మతిలోపల సంశయంబు మాని కుమారీ!

(కుమారీ శతకం)

భర్త చెప్పిన చెడు కార్యాన్ని కిమిన్నాస్తి అనకుండా చేయడం పతివ్రతా ధర్మంగా పేర్కొన బడింది.

వీటిన్నింటికంటె మరో మెట్టులో,

తానమ్ముడు వడియైనన్
దీనుండగు ధవుని ఆర్తి దీర్చుట సతికిన్
మానము; చంద్రమతీ జల
జానన దలపోయు వలయు నాత్మకుమారీ!

(కుమారీ శతకం)

తన భర్తను ఋణ విముక్తునిచేసే నిమిత్తం అమ్ముడుబోయిన చంద్రమతి పతివ్రతా తిలకం. భర్త జారత్వ స్వభావానికి ఉపశమనం కలుగజేసిన సుమతి పతివ్రతా శిరోమణి. యుగయుగాలుగా తరతరాలుగా భారతనారీలోకానికి ప్రబోధింపబడిన నీతిపదాలు ఇవి.

అనురాగ బంధంచేత కట్టివేయబడిన ఇద్దరు వ్యక్తులుగా సతీ పతులను ఊహించలేదు హిందూ సమాజం. 'దాంపత్య మనే బండికి ఇద్దరూ రెండు చక్రాలు' అని పైకి చెప్తున్నా ఆబండికి ఒకే చక్రం తిరుగుతోంది. అదే పురుషుడు. స్త్రీయైన రెండో చక్రం తిరగదు. దానిని మొదటి చక్రం ఈడ్చుకొని పోతుంది. ఇది అనుభవం.

భర్త ఎవరు? పతి ఎవరు? తనను మభ్యపెట్టి, మోసపుచ్చి, తను మైకంలో వుండగా, తను నిద్రావస్థలో ఉన్నపుడు, తను భయకంపితమై ప్రక్కన 'నా' అన్నవారు లేక అలమటిస్తున్న సమయంలో పది రూకలకు అమ్ముడు పోయే పురోహితుడు మంత్రాలు చదువుతుంటే, మరో పది రూకలు పుచ్చుకున్న భజంత్రీలు మేళతాళాల రొదచేస్తుంటే పెద్దమనుషుల రూపంలో తుచ్ఛులు, నీచులు, మోసగాండ్రు, దొంగలు పరివేష్టించి ఉంటే- వీరందరి సాయంతో, మద్దతుతో తాళికట్టిన పురుషుడు మగడౌతాడా? అతడే ఆమె మగడని ఈనాడు (అంటే 20 వ శతాబ్దపు ఉత్తరార్ధంలో) సినిమాల ద్వారా ప్రచారం చేస్తున్న ప్రబుద్ధులు లక్షలు ఆర్జిస్తూ నీతి

పంతులుగా చలామణీ అవుతున్నారీ సంఘంలో. ఆ సినిమాలను బహిష్కరించక, వాటిని ప్రదర్శించే సినిమాహాళ్ళను కూలద్రోయక, అశేష సంఖ్యలో తరలి వెళ్ళి వాటిని తిలకిస్తూ, ఆ కథల అసామాన్య ప్రతిభను మెచ్చుకునే అమాయక ప్రజానీకం కోట్ల సంఖ్యలో ఉంది ఈ భారతదేశంలో.

అణగారిన జాతి సంపూర్ణంగా తన సమ్మతినీ - ఆమోదాన్నీ ఇస్తే తప్ప జైళ్ళు, కోర్టులూ, ప్రభుత్వాలూ, రాజ్యాలూ ఇలా దుర్మార్గంగా సాగవు; స్వప్రయోజనపరులూ, కుహనా పండితులూ, ఒక నీతి పలికే జడదారులూ, పొట్టకూటి కోసం పాటుపడే పూజారులూ, నిరంతరం దోపిడి చేస్తున్న భూస్వాములూ, పెట్టుబడిదారులూ, వడ్డీ వ్యాపారస్తులూ మనగలరా ప్రజానీకం మరోవిధంగా ఆలోచిస్తే? అందుకే ఈ నీతులు, ఈ మెత్తని తియ్యని మాయమాటలు. పెత్తందారులు తమరిని రక్షించుకొనే నిమిత్తం ప్రజానీకానికి పరిధులు నిర్ణయిస్తారు. ఆ హద్దు దాటితే అక్రమమంటారు; పాపకృత్యమంటారు. ఇహలోకంలో శిక్షలు వేస్తారు; పరలోకంలో సలసలకాగే నూనెలో మగ్గిపోతావని బెదరిస్తారు. ఇలా లాలనతో బుజ్జగింపుతో, మందలింపుతో, బెదరింపులతో, శిక్షలతో తమ పాపకార్యాలను కొనసాగించుకుంటూ పబ్బం

గడుపుకుంటారు. ఈ 'హద్దు' దాటిన స్త్రీకి, ఎదిరించిన స్త్రీకి, 'కులట' అని పేరు పెడతారు; ఆలా ప్రచారం చేస్తారు. ఆమెను హేళన చేస్తారు; అవమానపరుస్తారు. అలాంటి స్థితిలో ఆమె ఏం చేయాలి? ఏమి చేయగలదు? పరిస్థితులు ఆమెకు అనుకూలిస్తయ్యా? చివరకు ఆమెగతి ఏమవుతుంది? ఈ ప్రశ్నలకు సమాధానం ఈ నవలయొక్క ఇతివృత్తంలో దొరుకుతుంది.

ఎం. వి. రామమూర్తి

# వెలిగిన జ్యోతి

ప్రసవ వేదన ప్రారంభమైంది కాంచనకు. నొప్పులు క్రమంగా పెరుగుతున్నై. మేనా తెప్పించింది చంద్రి. కాంచనను ఎక్కించి తాను ప్రక్కనకూర్చుంది. ధర్మయ్య మేనా ముందు నడుస్తున్నాడు. కాంచన మనస్సులో భూగోళమంత అశాంతి సుళ్ళు తిరుగుతుంది. క్రొత్త అలజడి మొదలయింది. అనుకున్న రోజు రానేవచ్చింది. అదే ఆఖరిరోజు. తిరిగి తన భర్తను బిడ్డల్ని చేరవచ్చు. ఎన్నాళ్ళయిందో వార్ని చూచి! ఎలావున్నారో! వార్తయినా తెలియదు. బిడ్డల్ని తలచుకుంటూ కన్నీరు తుడుచుకుంది. సరిగ్గా సంవత్సరం క్రిందట ఇదే మేనాలో మహలు లాంటి ఆ భవంతిలో అడుగుపెట్టింది. అది స్వర్గతుల్యం. కష్టాలు, ఆకలి బాధలు లేని మరోప్రపంచం. కాని అది మానవత్వం, దయా దాక్షిణ్యాలు లేని సంపన్నుల గృహం. ఇది మానవ ప్రపంచం. ఇక్కడ ఆకలి, వర్ణం, వర్గం, హెచ్చుతగ్గులు, భేదాలు, బాధలు అన్నీ వున్నై. పేవుమెంట్లమీద పుట్టి రోడ్లమీద పెరిగి సైడు కాలవలప్రక్క కాలధర్మం చెందేవారూ, దొంగలూ, దొరలూ, సహృదయులూ, నికృష్టులూ, నానా జాతివారూ వుంటారు. అలా రకరకాల ఆలోచనలూ, భావాలూ పొర్లుతున్నై తనకు. సంతోషం, దుఃఖం ముంచివేస్తున్నై. నా జీవితంలో ఎన్ని సుడిగుండాలు! ఎక్కడ పుట్టాను! ఎలా పెరిగాను! ఎవరి పాలయ్యాను. ఎలాంటి దుర్గతి పట్టింది. ఇన్ని మార్పులకు నిర్లిప్తంగా రాజీపడటం తప్ప....నా జీవిత చరమాంకం ఎలా ముగుస్తుందో?....అని ఆవేదన.

పెద్ద గేటుదాటి లోనికి ప్రవేశించింది బండి. వేపచెట్టు గాలి, మందుల వాసన కలిసి ఘాటుగా ఒక్కసారి గుప్పున వచ్చింది. పోయిపోయి పెద్ద గది ముందు వరండాలో దింపారు. కాంచనని లోపలి కాహ్వానించింది నర్సు. చంద్రి లోనికి తీసుకెళ్ళింది. ఆ గది అతి శుభ్రంగా వుంది. చుట్టూ రంగు రంగుల కర్టెన్లు వ్రేలాడుతున్నై. సెంటెట్ ఫినైల్ వాసన గదంతా వ్యాపించి హాయినిస్తుంది. ఖరీదైన కుషన్లతో కుట్టబడ్డ కుర్చీలున్నై. ఒక అందమైన బీరువానిండా కత్తులు, పటకార్లు తళతళ మెరిసిపోతున్నై. ఫీటోస్కోపు, ఫోర్సెప్సు, బేబీవేయింగ్ మెషీన్ ఎదురుగా కనపడినై. ఒకప్రక్క ష్టూలుపై మందులూ, ఇంజక్షన్లూ, మరోప్రక్క పింగాణి ట్రేలో దూది, గాజువుంచబడినై. డన్‌లపు పరుపుపై అతి తెల్లని దుప్పటి హంసరెక్కలా పరచి వుంది. మృదువైన పట్టుదిండ్లు చూడముచ్చటగావున్నై. ఆమెను ఆ స్ప్రింగు కాట్‌పై కూర్చోబెట్టారు. ఎయిర్ కండిషన్‌వల్ల గదంతా చల్లగా హాయిగా వుంది. అబ్బా! ధనవంతు లెంత భోగ పురుషులో! వారికి ఇంటా బైటా సర్వసౌఖ్యాలు అమరుతై గదా!

* *

మెడికల్ కిట్టుతో నర్సు మళ్ళీ వచ్చింది. ఏపరాన్ ధరించి స్టెత్ చేత్తో పట్టుకొని లేడీ డాక్టరు ఆమె వెంటనే ప్రవేశించింది. నర్సు కాంచనని పడుకోబెట్టింది. డాక్టరు బి. పి. చూచింది. పల్సు, బేబీ హార్టు బీట్ శ్రద్ధగా పరిశీలించిన తర్వాత పి. వి. చేసింది. "ఎవ్విరి థింగ్ ఈజ్ ఓకే" అంటూ ఆమెను ఎగాదిగా చూచింది. మళ్ళీమళ్ళీ చూచింది. "ఆ!" అంటూ నోరుతెరిచింది. తీర్చి దిద్దినట్లుంది ఆమె విగ్రహం. వయస్సు 25 సం॥ కన్నా లేదు.

ఆ శరీరంలోని వొంపులు యెవరో మహాశిల్పి చెక్కినట్లున్నాయి. లేత గులాబిరంగు చాయ, నిటారైన ముక్కు, ముత్యాల్లాంటి పలువరుస, నల్లగా నిగనిగలాడుతూ ఒంపులు తిరిగిన జుట్టు- ఆహా! అందమంతా రంగరించి సృష్టించినట్లుంది బొమ్మ. ఏమి సౌకుమార్యం! ఆపాదమస్తకం మెరిసిపోతుంది. చూడటానికి రెండు కళ్ళు చాలవు. అసలే నిండుచూలాలు; పైగా పాలు, పండ్లు మంచి పోషకాహారం, మందులతో శరీరానికి నిండుదనం వచ్చింది. అందం ఇనుమడిస్తోంది. స్త్రీలను సైతం మోహింపజేసే సహజ సౌందర్యంగల ఈ అందాలరాశి కనుమరుగైతే భరించటం కష్టం ఇలా తలపోస్తూ అచ్చటే కూర్చొని రెప్పార్పక చూస్తుంది డాక్టరమ్మ. నర్సును కనుసౌజ్ఞ చేసి బొమ్మని తానక్కడే కూర్చుందా జవ్వనిని చూస్తూ. నర్సు ఆశ్చర్యపడింది. 'మామూలుగా తానుండి అవసరమైతేనే డాక్టర్ని పిలవడం ఆచారం. అటువంటి దీమార్పేమిటో? అయినా తనకెందుకూ! తాను చిన్న ఉద్యోగి. ఏమో! ఆ ఇల్లాలి కుటుంబానికి డాక్టరుకి ఏమి సంబంధమో నాకెందుకులే నే పోతా' అనుకుంది నర్సు. అయినా ఆమెకు కాళ్ళాడలా. ఆ సౌందర్య దేవతని తనివితీరా చూడాలని పించింది. 'ఈమెను కన్నతల్లిదండ్రులు, కట్టుకున్న భర్త, కన్నబిడ్డ అదృష్టవంతులు. సర్వమూ మరచి ఆనందంగా ఈ ముగ్ధమోహినిని చూస్తూ జీవించొచ్చు' అనుకుంటూ గది దాటిపోయింది నర్సు.

మనోవేదన, శరీరబాధ తెల్లవార్లూ పడ్డది కాంచన. పెద్దపెద్ద నొప్పులొస్తున్నై! పెద్ద ప్రాణానికి ప్రమాదమైనా సరే, ఆపరేషన్ చేసైనా పిల్లను బతికించాలని డాక్టరుకు హెచ్చరిక

వుంది. ఈ అందాల రాశికన్నా ఆ బిడ్డ అంత ముఖ్యమా! చాలా ఆశ్చర్యంగా వుందే! మళ్ళీ ఇప్పుడే ఫోనులో ఆమాటే చెప్పారు. సమాజంలో సంపన్నులదే తుది తీర్పు. వారెంతటి అఘాయిత్యానికైనా పాల్పడ గలరుగదా! సిజేరియన్‌కై పరికరాలన్నీ స్టెరిలైజ్ చేయించింది డాక్టరమ్మ. అంతా రెడీగావుంది. ఒకేఒక ఇంజక్షనిచ్చింది. ఇంకో పావుగంటలో కనాలి. లేదా కత్తులు రెడీ!! ఒకే ఒక పెద్ద గర్జనతో కూడిన కేక; వెంటనే 'క్యావు' 'క్యావు' మనే ఏడుపు. అంతే; కాంచన కేమి జరిగిందో ఆమెకు తెలియదు. కళ్ళు మూతలు పడిసై.

ఎన్ని ఘోరాలు జరిగినా, ఎంత దోపిడీ జరిగినా సూర్యోదయంలో మార్పుండదు గదా! సూర్యుడుదయించాడు మామూలుగా. అలా తెల్లవారిందా రాత్రి. ఎవరి కార్యక్రమాలు వారివి; అందరి కాలకృత్యాలు మామూలే.

మత్తు వదలి కళ్ళువిప్పి ప్రక్కలో చూచుకుంది కాంచన. ప్రక్కన ఖాళీ........బెంబేలెత్తింది. కంగారు పడింది. శరీరమంతా చెమట పోసింది. నోట మాట రావడంలేదు. గది మారింది. ప్రక్క మారింది. తనున్నది చాలా చిన్నగది. ఏ హంగులూ లేవు. చీకటితో గదంతా శూన్యంగా వుంది. శోష వస్తుంది. దుఃఖం పొంగి పొర్లుతుంది. ఏం చెయ్యాలి! ఎక్కడో దూరంగా తానుంచబడింది. తల, కళ్ళు తిరుగుతున్నై. అంతా అగమ్యగోచరంగావుంది! మగతతో కళ్ళు మళ్ళీ మూతలుపడిసై. ఆమె దుఃఖమంతా అరణ్యరోదనమైంది. ఆమె మొర వినేదెవ్వరు? ఆమె బాధ ఈడేర్చేవారెవ్వరు? ఇంత అందమైన గులాబీ పుష్పం క్రింద ఎన్ని ముళ్ళో!

పగలు రెండు ఝామలకు మళ్ళీ స్పృహ వచ్చింది కాంచనకు. నీరసంతో తల తిరుగుతోంది. కడుపులో కాలి శోష వస్తోంది. దాహం వేసింది. మనిషి జాడలేదు. దుఃఖం కట్టలు తెగింది. పెద్దగా ఏడ్చింది. ఎవరూ పలుకలేదు; ఉలకలేదు. వెళ్ళి చూద్దామంటే లేచే శక్తిలేదు. తహ తహ లాడుతుంది. తలుపుబైట తాళంవేసి వున్నట్లు అర్థమయింది. ఏం చేయగలదు? ఒడ్డునపడ్డ చేపలా కొట్టు కుంటుంది. అలా ఎంతసేపయిందో? బాధనుండి కాపాడేవీ హస్పటల్సే, కాని నరకానికి ప్రతిరూపం కూడా అచ్చటి వాతావరణమే! సిబ్బందిని యమ కింకరులతో పోల్చవచ్చు. వారు మన ప్రాణాల్ని ధనంతో తూస్తారు. దిక్కులేనివారిపై సానుభూతి వుండదు. ధనం, అధికారం కలవారిదే భోగం. గర్భ దరిద్రుల కక్కడ స్థానం వుండదు.

సాయంత్రం 5 గంటలకు తలుపుతీసిన శబ్దమైంది. లోని కొచ్చింది నిన్నటి నర్సు. చేతిలో 20 రూపాయలున్నై. అవి బల్ల మీదపెట్టి "ఎలావున్నావమ్మా? అన్నం కాని రొట్టెగాని తిన్నావా? ఉదయం వెళ్ళినదాన్ని ఇప్పుడే డ్యూటీకొచ్చా. అదయినా ముందుగా నీ కోసమే. నా మనస్సంతా నీమీదేవుంది. ఆదుర్దా పడుతూ వచ్చానమ్మా" అదేం అనుబంధమో! ఆప్యాయంగా కాంచనభుజంమీద చెయ్యేసింది నర్సు. పల్సు చూచింది "చాలా బలహీనంగా వున్నావమ్మా." నర్సు ఊరడింపుతో నడిసముద్రంలో నావ దొరికినట్లయి, పోయినప్రాణం లేచివచ్చింది కాంచనకు.

'నా పాపను చూపవా? ఒక్కసారి చూడాలి. పది నెలలు మోసి కన్నానమ్మా! పాప ఏమయింది? ఎలావుంది?' ఆదుర్దాగా,

అర్థిస్తూ అడిగింది. ఆమెగొంతు గాద్గదిక మవటంచూచి చలించింది నర్సు. నర్సు మాట్లాడలేదు. తలదించేసుకుంది. 'నర్సమ్మా! పాప ఏమయింది? చెప్పవా తల్లీ?' మౌనం వహించింది నర్సు.

'ఎన్ని పురుళ్ళుపోశావో? ఎందరి పాపల్ని తల్లుల కప్ప గించావో! ప్రసవ వేదనపడి పిల్లని కనటానికి తల్లి ఎంత బాధ పడుతుందో నీకు తెల్సుగదమ్మా! కాని బిడ్డను చూడగానే తల్లి తన శ్రమంతా మరిచి తన్మయురాలౌతుంది. మాతృప్రేమ ఎంత ధృఢ మైందో! ఆమె కళ్ళు ముందుగా తన పిల్లకై తపిస్తాయి. బిడ్డను చూడాలని నామనస్సు తహతహలాడుతోంది. నా కెందుకు చూపవు? ఏమిటీ మౌనం?' భళ్ళునఏడ్చింది కాంచన. కళ్ళొత్తుకుంది నర్సు.

నిన్నటి రూపం మారిపోయింది. మనిషంతా ఒడిలి పోయింది. కళకళలాడే అమె ముఖం కళావిహీనంగా, వాడిన పుష్పంలా వుంది. ఎంతలో ఎంత మార్పు? ఏంచెప్పాలి? ఎలా ఓదార్చాలి? మనసంతా వికలమయింది నర్సుకు.

లోపలికెళ్ళి కాఫి తెచ్చింది. ముట్టలేదు కాంచన. బలవంతాన తాగించింది నర్సు. ఆమె కుళ్ళికుళ్ళి హృదయ విదారకంగా ఏడుస్తోంది.

నర్సు హృదయం ద్రవించింది. "ఉండమ్మా! నీతో కొన్ని విషయాలు మాట్లాడాలి. కాస్త తెప్పరిల్లు. నీవు ధైర్యంగా వుంటానని మాటయిస్తేనే నీకొక రహస్యం చెప్తా' ఓదారుస్తూ అంది నర్సు.

"నేను జీవితంలో సర్వం పోగొట్టుకొని మొండిగా బ్రతుకు తున్నదాన్నమ్మా! ఇంతకంటే కష్టాలూ, బాధలూ పడ్డదాన్నే. అంత తేలిగ్గా ఈ గుండె బ్రద్దలుకాదు. 'పాపీ చిరాయుః' అన్నట్లు అనేక సుడిగుండాలు దాటి ఈ స్థితికొచ్చానమ్మా! ధైర్యంగా వింటా, చెప్పు" వంచ ప్రాణాలు ఉగ్గబట్టి అడిగింది కాంచన.

"నిన్నీరోజునే రైలెక్కించమని మీ వూరికి టికెక్కట్టు కొనివ్వమని 20 రూ.లు నాకిచ్చారు" నీకు కొన్ని రహస్యాలు చెప్తా. బైటికి పొక్కనీకు. ఈ తెల్లవారుఝామున 4 గంటలకు నీవు ప్రసవించావు. వెంటనే నీకు మత్తు ఇచ్చి నీ బిడ్డను వేరే దాచారు. నీకు చూపవద్దన్నారు. నాకు చాలా బాధ కల్గింది. డాక్టరమ్మ అన్నీ తానే సొంతంగా చూస్తోంది. దీంట్లో ఏదో పరమ గోప్య ముందని గ్రహించా. కాని అదేమిటో ఆ రహస్యం నాకూ తెలియనివ్వలేదు. తక్షణం నిన్ను తీసుకెళ్ళి మీవూరు రైలెక్కించమని చెప్పారు. ఎలా పంపేది? ఒంటరి దానివి. పచ్చి బాలింతవు. నాకైనా మానవత్వ ముండాలా! ఆలోచించి నా స్నేహితురాలొక ఆయా సాయంతో నిన్నుతెచ్చి ఈ గదిలో ఉంచా. నేనొక సాయం చేస్తా. నీబిడ్డ ఒక వారం ఇక్కడే డాక్ట రమ్మ ఆధీనంలో వుంటాడు. నీళ్ళుమాత్రం రోజూ నేనేపోస్తా. ఉద యం డాక్టరు రాకముందే నీళ్ళకని తెచ్చి నీకుఒక్కసారి చూపిస్తా. ఈ విషయం ఎవ్వరికీ తెలియరాదు. తెలిస్తే నాపీక పోతుంది, జాగ్రత్త!"

ఆ రాత్రి పాలు, బ్రెడ్డు ఇచ్చి డ్యూటీకెళ్లింది నర్సు.

'తారలలో ధృవతారవలె ఆ కలుషిత వాతావరణంలోకూడ అవినీతికి తలొగ్గని ధర్మదేవత ఆ నర్సు-అనుకుంది కాంచన. కాంచన ఆ రోజు తెల్లవార్లూ తన దుర్గతికి చింతిస్తూనేవుంది: 'ఇంకా నేను బ్రతికి వున్నానంటే నా పిల్లల కోసమే. ఎలావున్నారో ఏమో! ఆ కిరాతకుడు వాళ్ళను ఏం బాధలు పెడ్తున్నాడో ఏమో! ముఖ్యంగా నా 'నీలి' ఎంత చిత్రహింసల పాల్చేస్తున్నాడో! నా అంత నిర్భాగ్యులీ ప్రపంచంలోనే వుండరు. తెలిసి నేనే తప్పు చెయ్యలే, ఎవ్వరికీ ద్రోహం తలపెట్టలా, నాకే అన్ని కష్టాలూ. ఇలా జీవచ్ఛవంలా ఎందుకు బ్రతకాలి? పోనీ చచ్చి సాధించేదేముంది? నా తల్లిలేక నే నెన్నిపాట్లు పడుతున్నానో, నేను లేకపోతే నా బిడ్డలూ అంతే కదా? వార్ని దౌర్భాగ్యుల్నిచేస్తే ఆ దోషం నాదికాదా? కానీ! నేనింతకన్నా చెడేదేముంది?' కొంతసేపు ధైర్యం; మరుక్షణం దుఃఖంతో ఆ రాత్రి భళ్ళున తెల్లారింది. మధ్యలో నర్సువచ్చి ఒక ఇంజక్షనూ, రెండు గోలీలిచ్చివెళ్ళింది.

తూరుపు తెలతెలవారుతోంది. హాస్పటలంతా నిర్మానుష్యంగా, నిశ్శబ్దంగావుంది. కొద్దిగా అలికిడయింది. తలెత్తి చూచింది కాంచన. పొత్తిళ్ళలో బిడ్డతో ప్రత్యక్షమయింది నర్సు. ప్రాణం లేచివచ్చింది. వెంటనే చెయ్యిచాపి బిడ్డనందుకొని ఉప్పొంగిపోయింది. బిడ్డ శరీరమంతా తడుముతూ హృదయానికత్తుకొంది. ఆ పసికందును తాకగానే పులకించి పోయింది. విప్పారిన కళ్ళతో తనివితీరా చూచుకొంది. తనలోని పుత్రవాత్సల్యాన్ని మేల్కొల్పిందాచూపు. జీవన్మరణాల మధ్యనున్న తనకు పోయిన ప్రాణం తిరిగొచ్చినట్లయింది. తనలోని మాతృత్వం గట్లు తెంచుకుంది. బిడ్డ అచ్చంగా తన పోలికే, మగబిడ్డ. బంగారువన్నె.

నిటారైన ముక్కు, చిన్ని నోరు, ఎఱ్ఱని పెదాలు చాలా పల్చగావున్నై నల్లని జుట్టు; సొట్టబుగ్గలు. అబ్బా! ఎంత సుందర విగ్రహం! చూట్టానికి రెండుకళ్లు చాలవు. తల్లి దిష్టి తప్పక తగుల్తుందంటారు, ఏమో!' ముద్దుల వర్షం కురిపిస్తూ క్షణకాలం సర్వం మరిచి పోయింది. మరొసారి తనివితీర గుండెలకు హత్తుకుంది. వెంటనే పాలు స్రవించటం మొదలయింది. స్తన్యం తల్లికి అనిర్వచనీయ మైన అనుభూతి, మాతృత్వానికదొక వెలుగు. పాలిద్దామని పెర పెరలాడుతూ రవికెముడి సడలించింది. ఆ లేత పెదాలకు స్తన్యాన్ని కుడిపించబోయింది.

'అమ్మో! అమ్మో! తే! తే! ఏదో అలికిడి అవుతోంది. మనిద్దరం చస్తాం.' బిడ్డను లాక్కెళ్ళింది నర్సు, నిరుత్సాహంతో కుప్పకూలిపోయింది కాంచన.

'వస్తావా? రైలెక్కించి వెడతా" డ్యూటీ చేసివచ్చి అడిగింది నర్సు.

తలూపింది. నోటిమాటరాలా. పుట్టెడు దుఃఖంతోవున్న కాంచనను దొడ్డిదారిన యెవ్వరూ చూడకుండా బైటకి తెచ్చిందినర్సు.

తూలి పడబోయింది కాంచన. పట్టుకుంది నర్సు. 'ఈమె నెలా పంపేది! కూడా దిక్కెవ్వరూలేరు కదా! ఈమెకు ఘోర అపచారం జరిగింది. శత్రువుకు కూడా జరగరాని దుర్మార్గానికి బలయిందీమె. హృదయానికి పెద్ద గాయమై పరితపిస్తోంది. ఏం చేసేదీ? ఎందుకూ ఈమెపై నాకీ అభిమానం? మా ఇద్దరికీ గల సంబధమేమిటీ? - కాదు. మనిషిని మనిషిగా చూడాలి కదా?

ప్రవాహంలో కొట్టుకు పోతుంటే ఊరుకోగలమా ? మానవత్వం లేని మనిషి పశువుతో సమానం; మనన్సు కలవరపెట్టింది నర్సును.

కాంచనను రిక్షా ఎక్కించి తనింటికి తెచ్చింది నర్సు. రెండు రోజులుంచి పంపుదామని నిర్ణయించుకొంది. 'ఆ పక్కమీద పడుకోఅమ్మా ! నే నిప్పుడే వంట తయారు చేసివస్తా. ఈలోగా కాస్త విశ్రాంతితీసుకో. రెండు పళ్ళు తినమని ఇచ్చి వంటగదిలో కెళ్ళింది నర్సు.

"ఈ విశాల ప్రపంచంలో మానవత్వం, దయ, సానుభూతి కలవారు లేకపోతే అనాధలూ, ఆర్తులూ మనగలరా ! సేవాదృక్ప ధమే ఈ నర్సు జీవిత విధానం. వటవృక్షంలాంటిదీ మహాతల్లి. అది అభాగినులకు ఆశ్రయమిస్తుంది. నీడనిస్తుంది. ఈమె రుణం నే సెలా తీర్చుకునేది. కాంచనహృదయం కృతజ్ఞతతో నిండిపోయింది. ఆమెను గురించి తీవ్రంగా ఆలోచిస్తోంది.

'లేమ్మా ! భోంచెయ్యి' అన్నది ఆప్యాయంగా, అన్నము కూర పట్టుకొచ్చిన నర్సు.

కాంచనలేచి ఎంగిలి పడ్డది. నర్సు ఇచ్చిన టానిక్కు త్రాగింది. అలసటవల్ల వెంటనే నిద్రపట్టింది కాంచనకు.

'మా అమ్మ చచ్చిపోతోంది, వెంటనే రావాలి, రా అమ్మా!, చిన్న డాక్టరమ్మా' పెద్దగా ఏడుస్తూ వచ్చిందొక పదిఏండ్ల బాలిక.

'పద ! పద !' అంటూ మెడికల్‌బ్యాగ్‌తో పరిగెత్తింది నర్సు.

# 2

అడుగుల సవ్వడికి కాంచన మేల్కొన్నది. చూస్తే వరండా నిండా పేషంట్లున్నారు.

'నర్సమ్మ ఎక్కడికెళ్ళింది? ఎప్పుడొస్తుంది?' ఒక పండు ముదుసలినడిగింది కాంచన.

'అమ్మా! ఈమె మాకు కామధేనువు. రాత్రిలేదు పగలులేదు, పేద సాదల సేవకై తన జీవితాన్ని అంకితం చేస్తోంది. అనాధ లకు, ఆర్తులకు, వ్యాధిగ్రస్తులకు ఉచితంగా ఇంజక్షన్లూ, మందులు ఇస్తూ ఉంటుంది. హాస్పటల్‌కు సైతం డ్యూటీగా కాక 'సేవ'గా రోగులకు పరిచర్యలు చేస్తుందేగాని చిఱుబుఱులాడదు. దయకు, ప్రేమకు మానవత్వానికి మారుపేరు ఈ నర్సమ్మ. అనాధలకు, అభాగినులకు ఆశ్రయమిస్తుంది; ఆదరిస్తుంది. ఈ కల్పతరువు నీడన మేమంతా ప్రశాంతంగా బ్రతుకుతున్నామమ్మా! అందరిని సమదృష్టితో చూడగల హృదయమీమెది,' ఆనందబాష్పాలు రాల్చింది అవ్వ.

'జ్వరం, కన్కులు, తగ్గలేదా? మాత్రలు మింగావా?' నర్సు ఒక రోగిని అడుగుతోంది.

'మా కాడ పైసలు లేవమ్మా' దీనంగా జవాబిచ్చిందాయమ్మ.

లోనికెళ్ళి శాంపిల్సు తెచ్చి ఇచ్చి పంపిందామెను. మిగిలిన వారికి బి. పి, టెంపరేచరు, పల్సు వగైరాలన్నీ చూచి

చీట్లిచ్చి వారిని పంపి లోనికొచ్చి "రా ! అక్కా ! కాఫీ తాగుదాం" మని ఆహ్వానించింది కాంచనను.

'సీతాకోక చిలుకలా రంగు రంగుల దుస్తుల్ని ధరించి మధుర జీవితాన్ని గడపాల్సిన ఈమె తెల్లని దుస్తుల్లో మానవత్వానికి జీవితాన్నర్పింస్తోంది. ప్రాపంచిక సుఖాల కతీతంగా మానవసేవ చేస్తోంది. తను సృష్టించిన ప్రాణవాయువు ప్రతిఫలాపేక్షరహితంగా ప్రజలకిచ్చి, దానికి బదులు వారిచ్చే విషవాయువుల్ని స్వీకరిస్తుంది చెట్టు. అది దాని ప్రకృతి లక్షణం. ఆలాగే ఈ నర్సమ్మకూడా నిస్వార్థసేవా ధురీణురాలు. ఈమె ఎవరు ? నే నెవరు? మాకీ అవినా భావ సంబంధ మేమిటి ! అంతా చిత్రాతి చిత్రంగా ఉంది. ఈమెపై సోదరిభావం కల్గుతోంది. అణకువ, ఆత్మీయత, ఉపకారం ఈమె సహజ లక్షణాలు. ఏ తల్లి కన్నదో ఈ బిడ్డను! ఆ ముఖమెంత అందంగా వున్నది! నిష్కల్మషంగావుంది. వర్ణించటానికి నేను కవినికాదుగదా ! ఆకర్షణకంటే ఆహ్లాదాన్ని కలిగించే లక్షణాలా ముఖంలో గోచరిస్తున్నాయి. నిస్వార్థంగా మానవసేవకు జీవితం ధారపోస్తోంది. తనకుతానే క్రమశిక్షణ విధించుకుంటోంది. ముఖంలో పరిశుద్ధత, లక్షణమైన ప్రతిభావున్నై. ఆ నేత్రాలలో ఎంతకాంతి ! యుక్తవయుస్సులోవుంది. మధుర మోహన సుందరమూర్తియైన ఈమెకు 24 ఏండ్లు కన్నా వయస్సులేదు. ఒంటరిగా వుంటోంది. తనవాెరెవరో అడగనా ? ఏమో ! కోపమొస్తుందేమో ! హిందూ పునిస్త్రీ చిహ్నాలైన గాజులు, మెళ్ళో పూసలు లేవు. అసలు పెళ్ళయిందా ? సేవా త్యాగాలకు జీవితాన్నంకితం చేస్తున్న ఈ పవిత్రమూర్తి వెనుక ఎంత అగాధముందో!' ఆలోచనలు ముంచెత్తినై కాంచనను.

"అక్కా! వేణ్ణీళ్ళు చల్లారిపోతాయి గాని వెళ్ళి స్నానం చేసిరా. కాస్త ప్రాణం హాయిగా వుంటుంది." నర్సు పిలిచింది.

తన ఆలోచనలనుండి త్రుళ్ళిపడ్డది కాంచన.

'ఏవమ్మా! ఈరోజు డ్యూటీకి పోలేదా! శలవు పెట్టావా? నావల్ల చాలా శ్రమపడుతున్నావు. నన్నింక నా దారిన పోనివ్వమ్మా. నా కష్టాలు నాతో నేనశించాలి. మరొకర్ని విసిగించటం న్యాయం కాదు. ఎడారిలో నీటిబొట్టులా దొరికావు. నీమేలు ఈ జన్మలో మరువలేను. కృతజ్ఞత చెప్పడం తప్ప ప్రత్యుపకారం చేయలేని అసహాయురాల్ని. నీకిప్పటికే చాలా రుణపడి ఉన్నానమ్మా! మానసతా లోతుల్లోంచి ఆమెకు కృతజ్ఞత చెప్తోంది కాంచన.

'ఇక్కడ రుణాలు తీర్చటాలు అనే ప్రసక్తిలేదు అక్కా! అందరం మానవులమే. సేవలోవున్న తృప్తి, ఆనందం, అనిర్వచనీయం. అదేశాశ్వతమైనది' దయతో పల్కుతోంది నర్సు కంఠం.

'అన్యథా తలచకుంటే నిన్నొకటడుగుతా. మీదేవూరు? పెళ్ళయిందా? తల్లి దండ్రు లెవరు? భర్త, అత్తమామలు ఎచ్చటున్నారు? అసలులేరా? చెప్పవామ్మ!' కాంచన గబగబ మాట్లాడేసింది. తనపై పిడుగు పడ్డట్లయింది నర్సుకు. ఆమెలో దుఃఖమూ, కోపమూ, చికాకు పెనగొన్నై. మనస్సు కలవరపడింది. ఎంత మంచిదో అంత గాంభీర్యంకల నిండుకుండ. ఎవర్ని తూలనాడదు. ఎవ్వరి వల్లా మాటపడదు. ఏమీ ఆశించదు. నిక్కచ్చిగా డ్యూటీ చేస్తుంది. వారానికి మూడురోజులు నైట్ డ్యూటీ

చెయ్యాలి. నాలుగు రోజులు బీదలకు, వాళ్ళ పిల్లలకు టీకాలు, బి. సి. జి., పోలియో డ్రాప్సు ఇస్తుంది. రోజూ జ్వరమని, కక్కులని, కాన్పులని, విరోచనాలని 30 మంది దాకా వస్తూ వుంటారు. సాయంత్రం వేళ హెచ్చు సంఖ్యలో ఆమె సాయం కోరటానికి వస్తూంటారు. చామన చాయ రంగు, పొడగరి, సన్నగా, నాజూగ్గా వుంటుంది. మితభాషి, నిరాడంబరజీవి. ఎప్పుడూ చలాకీగా, హుషారుగా వుంటుంది. ఒంటరిదైనా ధైర్యం, దర్పం వీడని వ్యక్తి.

అది ఇండియాలోకెల్లా పెద్దపేరుగలహస్పటల్. రాయవెల్లూరులో వుంది. పెద్దపెద్ద డిగ్రీలున్న డాక్టర్లు, స్పెషలిస్టులు పని చేస్తారు. అనేకానేక ప్రత్యేక విభాగాలున్న 2 వేల పడకలున్నై. ఫీజు హెచ్చయినా శ్రద్ధగా చూస్తారు. ఇది ధనవంతులకే ఎక్కువగా ఆశ్రయం ఇస్తుంది. అచ్చట ఒకరి విషయాలు మరొకళ్ళు పట్టించుకోరు. ఒకరి జబ్బు గురించి రెండోవారికి చెప్పరు. నర్సు నర్మద 5 సంవత్సరాలుగా అక్కడ పని చేస్తోంది.

మొదట్లో కలవరపడ్డా తన చరిత్ర అక్కతో చెప్పడానికి సందేహించలేదు నర్మద. ఇంతవరకెవ్వరూ సాహసించి ఆమె కథ అడగలా ! తనెవరో మరొకరికి చెప్పి ఎరుగదు. ఆమెకొక చిన్న క్వార్టరు ఇచ్చారు. దానిముందు చిన్న తోట పెంచింది. అచ్చటికి అక్కనుతెచ్చి కూర్చోపెట్టింది. రెండు కాప్పిల్సిచ్చి హార్లిక్సు త్రాగించి దీర్ఘంగా ఆలోచించింది. తన గత చరిత్ర గిఱ్ఱున ఫ్లాష్ బాక్ సినిమా రీలులా తిరిగింది తన మనస్సులో.

"పోనీలే అమ్మా! తెలియక అడిగి నిన్ను బాధ పెట్టాను. మన్నించు తల్లీ" కాంచన వ్యధతో పలికింది.

"తప్పులేదు అక్కా! నన్నెవ్వరూ ఇంత ఆ ప్యా య ం గా నా గత చరిత్ర గురించి ఎప్పుడూ అడగలేదు. చెప్పుకుంటే కొంత బాధ అయినా తగ్గుతుంది కదా! తప్పకుండా నాకథ నీకు వినిపిస్తానక్కా."

నర్మద ప్రారంభించింది తన గాధను గంభీర వదనంతో. కాని ఆమెలో నిర్లిప్తత తొంగి చూస్తున్నది. ఆమె చెప్తున్న కథ ఎవరిదో! మరెవరిదో అన్నట్లు తొణకకుండా చెప్తున్నది.

నైజాం ప్రాంతంలోని మరట్వాడాలో ఒక జిల్లా కేంద్రంలో వాసుదేవ ఖాడిల్కర్ ప్రభుత్వోద్యోగి. అతనిది పెద్ద కుటుంబం. భార్య, ముగ్గురు కుమారులు, నల్గురు కుమార్తెలు, తల్లి, తండ్రి అతని కుటుంబీకులు. భార్య పు రు ళ్ళ కు, మొదటి ఇద్దరు కుమార్తెల పెళ్ళిళ్ళకూ, తిండి ఖర్చులకు అతని స ం పా ద న చాలేదికాదు.

అతని తండ్రి ఇచ్చిన పొలం, పశువులు అంత సంపదా హారతి కర్పూరంలా హరించుకపోయింది. పిల్లల చదువుల ఖర్చు రోజురోజుకూ పెరుగుతుంది. అతడు రిటైరయ్యాడు. ప్రావిడెంటు ఫండు వచ్చింది. ఆ డబ్బుతో రెండేండ్లు జాగ్రత్తగావాడి ఇల్లు గడిపింది భార్య. ఆమె చాలా పొదుపరి. ఆత్మాభిమానం కలది. పిల్లల్ని మంచి క్రమశిక్షణతో పెంచింది. ఏం పెట్టేదో, ఎలా జరిపేదో రెండో కంటివాడికి తెలిసేదికాదు. ఖాడిల్కరు ప్రయివేటు

ట్యూషన్లు చెప్పి కొంత పైకం గడించేవాడు. మూడో కూతురుకు పెళ్ళి చేయాలని సంకల్పించారు దంపతులు. పెండ్లి చూపులకు వచ్చి పొయ్యేవాళ్ళకు మర్యాదలతో సత్కారాలతో భార్యాభర్తలు సతమతమయ్యేవాళ్ళు. రోజురోజుకి మగాళ్ళకు గిరాకి పెరుగుతోంది. చదువు, ఆస్తి, ఉద్యోగం లేకపోయినా మగాడైతే చాలు, అడవి జంతువులకున్నంత రేటు మార్కెట్లో పల్కుతోంది. చదువు లేనివాడు ఒకడొచ్చాడు పెండ్లి చూపులకు. రెండెకరాల పొలం, ఇల్లూ ఉన్నై అతగాడికి. పదివేలు కట్నం అడిగారు పిల్లవాడి తల్లితండ్రులు. చట్టాలకు కట్నాలు పోతయ్యా? అన్నట్లు మనకు మార్పు రానంతకాలం ఈ దురాచారం ఇలాగే ఉంటుంది కదా!

"ఇల్లు అమ్మరా! ఎలాగో కన్నె చెర విడిపిద్దాము" ఖాడిల్కరు తండ్రి సలహా ఇచ్చాడు కుమారునికి.

"పిల్లలూ, మనం నీడలేని పక్షుల్లా ఎలా ఉందామని వాడికా సలహా ఇస్తున్నట్లు?" అతని తల్లి గగ్గోలు పెట్టింది.

"మొయ్యలేని భారం మొదటికే మోసమండి. లాంఛనాలు, భోజనాలు మరి పదివేలు అవుతాయి. ఇప్పటికే అణగారి పోతున్నాం" కళ్ళమ్మట నీళ్ళు గిర్రున తిరుగుతూ వాపోయింది భార్య. వాసుదేవ్ ఆలోచనలోపడి ప్రమాన్పడి పోయాడు. అమ్మా నాన్నల సంభాషణ చిట్టి గుండెల్ని శూలాల్లా పొడిచేశాయి.

ఆ రాత్రి వాసుదేవ్ మూడో కూతురికి నిద్ర పట్టలా. పట్నంపోయి ఉద్యోగంచేసి కుటుంబాన్ని ఆదుకుందామని

నిశ్చయించుకుంది. వయస్సా 16 సంవత్సరాలు. చదువా ఇంటర్ ప్యాసయింది. ఎవరిస్తారు ఉద్యోగం? ఏది మార్గం? ఇలా ఆలోచనలతో ఆమె సతమతమయ్యింది ఆ రాత్రంతా.

ఆమె ఇంట్లోవాళ్ళు ఆమెను చిట్టి అని పిలిచేవాళ్ళు. బంధువులూ, స్నేహితులూ అలానే పిలవడం అలవాటుగా సాగింది. చిట్టి స్నేహితురాలు జలజకు మెడికల్ కాలేజీలో సీటు వచ్చిందని ఆమెకు తెలిసింది. మరునాడు తల్లితో జలజ యింటికివెళ్ళి వస్తానని చెప్పి వెళ్ళింది చిట్టి.

'రావే చిట్టీ, రా. ఊరకరారు మహాత్ములు' అంటూ ముఖం చిన్నబుచ్చుకొని వస్తున్న చిట్టిని ఆహ్వానించింది జలజ. 'ఫలహారం తీసుకుందువు లోనికిరా!' అంటూ డైనింగు హాలులోనికి దారితీసింది.

"నేను రేపు కాలేజీలో చేరబోతున్నా. ఈరోజు సాయంత్రం మీ ఇంటికి వద్దామని అనుకున్నా. నీవుకూడా మెడిసిన్‌కు దరఖాస్తు పెట్టే ఇద్దరం కలిసి ఉండేవాళ్ళం. ఎలిమెంటరీ స్కూలునుండి జూనియర్ కాలేజీవరకు ఇద్దరం తోడుగా చదివాము. కలసి మెలసి ఉన్నాం. ఈనాడిలా విడిపోతున్నాం కదా! నా మనస్సు ఎలానో ఉంది. డబ్బుసాయం చేస్తానని ఎంత బ్రతిమాలినా పెడచెవిన పెట్టావు. అసలు డబ్బు మనకెందుకే అవసరానికి ఆదుకోకపోతే. నన్ను వేరుగా నీవు చూడకపోతే ఇలా జరిగేదా? ఆత్మాభిమానానికికూడా హద్దుపద్దు ఉండాలా, లేదా? అంటూ తన మనోవేదన వెలిబుచ్చింది జలజ.

"మనం కలిసే ఉండాలని నీతోపాటు వెల్లూరు రావాలని నీ సహాయాన్ని అర్థించటానికే వచ్చాను జలజా'' గద్గద స్వరంతో తన పరిస్థితి విశదీకరించింది చిట్టి.

'ఎంతమంచివార్త తెచ్చావే' జలజ ఉబ్బితబ్బిబ్బయింది.

చిట్టి మాత్రం స్థాణువులా నిలబడిపోయింది. ఆమె మనస్సులో పాత కథ మెసిలింది.

జలజ తండ్రి ధర్మతేజ ఊరి ధనవంతులలో పేరెన్నికగన్నవాడు. ఒక్క గానొక్క కూతురు. చదువు, సంగీతం అన్నీ నేర్పించాడు జలజకు. ఇన్నీ ఉన్నా ఆమె నిగర్వి; నిస్వార్థపరురాలు. చిట్టి అంటే ఆమెకు పంచప్రాణాలు. ఆమె స్నేహంవల్ల తన సంస్కారం మెరుగుపడుతోందని భావించేది జలజ. కాని ఆమెతల్లి సౌభాగ్యమ్మకు చిట్టి అంటేనే అసహ్యం. పేద ఇంటిపిల్ల తన కుమార్తె స్నేహితురాలని చెప్పటానికి ఆమెకు మనస్కరించలేదు. అది తన హోదాకు, అంతస్తుకు భంగకరమని ఆమె అభిప్రాయం. చిట్టి తన ఇంటికిరాగానే చికాకు పడిపోయేది. ఇద్దరూకలసి స్కూలుకు వెళ్ళటం, హోంవర్కు చేసుకోవడం కలసికట్టుగా నాటకాల్లో, ఆటల్లో, స్కూలు డిబేట్లలో అన్నింటిలోనూ వారే. క్లాసులో వారేఫస్టు, సెంకడు స్థానాలు సంపాదించుకోవటం మామూలే. కాని సౌభాగ్యమ్మకు చిట్టిఅన్నా, చిట్టి కుటుంబమన్నా రోత. చిట్టి రాగానే దెప్పుతూ సాధించటం, ఎత్తిపొడవటం చేసేది. చిట్టి క్రమంగా వాళ్ళింటికి పోవడం తగ్గించింది.

'ఏమే, మా ఇంటికిరావా! పెద్ద! గొప్పదానివయ్యావు! పోనీలే. నేనే మీ ఇంటికివస్తా' అంటూ జలజే చిట్టి ఇంటికి వస్తుండేది. చిట్టిఇంటికి వెళ్ళివచ్చినప్పుడల్లా తిట్టేది జలజని ఆమెతల్లి.

'గతిలేని వాళ్ళింటికివెళ్తే మన పరువుంటుందా? నీకు తగిన సంబంధాలొస్తాయా? ఇకముందు అది మన ఇంటికిరావద్దు. నీవు వారింటికి పోవద్దు. దానిస్నేహం మానాలి. ఇది నామాట.' ఆజ్ఞాపించింది జలజను సౌభాగ్యమ్మ.

'ఏమ్మా! అది నిన్నేంచేసింది? తలవంపు పనులెన్నడూ చెయ్యలా. కూటికి పేదయినా దాని మనసుకు పేదలేదు. బీద ఇంట్లో పుట్టటం దాని తప్పా. బీదా గొప్ప ముఖాలమీద వ్రాసిఉంటయ్యా? రక్తంలో తేడాలుంటయ్యా? ఇకముందు ఇలాంటి ప్రసక్తి తీసుకొనిరాకు' కోపంతో మండిపడుతూ మేడ ఎక్కింది జలజ.

'ఇదిగో! చిట్టీ! నీకేచెప్తున్నా, ఇక మా ఇంటికిరాకు; మాపిల్ల స్నేహం చెయ్యకు. నక్క ఎక్కడ, నాకలోకమెక్కడ? నీతోకలసి తిరిగితే నీలాంటి గరాబే నా బిడ్డకు మగడవుతాడు. మీ కుటుంబం గర్భ దరిద్రంతో చస్తుంది. ఆర్నెల్లు స్నేహం చేస్తే వారు వీరౌతారట. చాలు, చాలుపో. ఇక మాగడపత్రొక్కితే మెడపట్టి గెంటిస్తా' తలుపు ఫెళామనివేసింది సౌభాగ్యమ్మ చిట్టి మొహాన. ఆ రోజు జలజకు నోట్సు ఇద్దామని చిట్టి వాళ్ళింటికి వెళ్ళింది. మరునాడు క్లాసు పరీక్ష. జలజకు జ్వరంవచ్చి ఇంట్లో

మేడమీద ఉంది. స్నేహితురాలినిచూచి పాఠంగురించి చెప్పాలని చిట్టి ఆవేదన. కాని జలజను చూడకుండానే వెళ్ళిపోవాల్సివచ్చిందా నాడు.

ఆ తర్వాత మళ్ళీ రెండు సంవత్సరాల తర్వాత ఈనాడే మళ్ళీ ఆ గడపతొక్కక తప్పలేదుకదా! అని తలపోస్తూ పాత సంఘటనకు చిట్టి కలవరపడింది.

'ఏమిటోయి, చాలా దీర్ఘంగా ఆలోచిస్తున్నావ్! రా పైకి పోదా' మని లాక్కెళ్ళింది జలజ.

'నాకేదైనా ఉద్యోగం చెయ్యాలని ఉంది జలజా. రేపు నీతోవస్తా. తర్వాత నీ అప్పుతీరుస్తా.' రుద్ధ కంఠంతో అడిగింది చిట్టి పిచ్చాపాటి పూర్తిఅయాక.

'ఎంత మారిపోయావే! ఏనాడైనా నన్ను ఆవగింజైనా కోరని నువ్వు ఇలా అర్థిస్తూ అడిగావా? అప్పుతీరుస్తావా? చక్రవడ్డీతో తీర్చాలిసుమా? నన్నింత వేరుగాచూస్తూంటే కోపంరాదా మరి? బి. ఏ. పూర్తికానీ, తర్వాతేలే ఉద్యోగప్రసక్తి. రేపు ఉదయం మూటా ముల్లెసర్దుకుని 7 గంటలకు స్టేషనుకు రా. మిగతా ఏర్పాట్లన్నీ నేచూస్తా' ఆమెను గేటువరకు సాగనంపింది జలజ.

అతికష్టంమీద తల్లి తండ్రుల్ని, మామ్మను, తాతయ్యను ఒప్పించింది చిట్టి.

'గతిలేక పెండ్లిచేయలేకపోగా నీ రెక్కల కష్టాని కాశించే రోజులొచ్చినై. ఏ భోగభాగ్యాలు ఎరుగవు. నా కడుపున పుట్టటమే

నీ దౌర్భాగ్యం' ఏనాడో దాచుకున్న వంద రూపాయలు తెచ్చి చేతిలోపెట్టి కౌగలించుకుని ఏడ్చింది చిట్టి తల్లి. దారి భోజనానికి పులిహోర, అటుకులు పొట్లాలుకట్టి ఇచ్చింది. తాతకు, మామ్మకు, నమస్కరించింది చిట్టి. తమ్ముళ్ళను, చెల్లిని చేరదీసి "బాగా చదువుకోండి" అని హెచ్చరించి తండ్రి వెంటరాగా రైలు స్టేషను చేరింది చిట్టి.

"దారీ, తెన్నూ, గమ్యం, దిక్కు లేకుండా నిన్ను పంపుతున్నానమ్మా! వెళుతున్నావా నా చిట్టితల్లి" బావురు మన్నాడు చిట్టి తండ్రి.

"అలా బెంబేలు పడవద్దునాన్నా! ఈ రోజునుండి నేను నీకు మగ బిడ్డను. తల్లితండ్రుల బాధ్యత కుమార్తెలకు లేదనుకోవటం వల్లనే ఆడా మగా తేడాతో ఆడపిల్లలను ఇలా పెంచుతున్నారు. ఇద్దర్నీ ఒకేలాగా కంటారు. తేడాగా చూస్తారు. ఆస్తి పంపకంలో బరువు బాధ్యతల కేటాయింపులో స్త్రీని తక్కువగా చూస్తారు. ఇద్దరూ ఒకటేననే రోజు వస్తేనే సమాజం మారుతుంది. నేను మన కుటుంబానికి సారథినౌతా. అది నా విధిగా భావిస్తున్నా. అమ్మా, మీరు, పిల్లలు జాగ్రత్త" అని హెచ్చరించింది చిట్టి.

రైలు కదిలింది. పైకండువాతో కళ్ళొత్తుకున్నాడు వాసుదేవ ఖాడిల్కర్. రైలు వేగం అందుకుంది. చెయ్యి ఊపుతూ రైలు కనుమరుగైందాకా జాలిగా చూస్తూ నిలబడ్డాడు తండ్రి.

మర్నాడు రైలు వెల్లూరు చేరింది.

"ఒంటరిగా ఎలాగున్నావు? చోటు దొరికిందా! నీ గురించి నాన్నకు చెప్పా. నాకు తోడుకోసం రమ్మన్నానని, అక్కడ వంటరిగా ఉండటానికి భయమని కల్లబొల్లి మాటలుచెప్పా. భయపడకు. మా నాన్న నిన్ను ఏమీఅనడు. నా వెం ట రా." ఫస్టుక్లాసులోంచి దిగిన జలజ చిట్టితో చెప్పింది.

జలజ తండ్రి దిగి సామాన్లు కూలీచేత దింపించాడు.

"నాకేదైనా ఉద్యోగం చూసిపెట్టండి బాబుగారూ! నా పొట్ట పోసుకుంటా, జలజకు తోడునీడగా ఉంటా" తలొంచి నమస్కారం చేసింది చిట్టి సజలనయనాలతో. హృదయం ద్రవించింది అతడికి.

"కాలేజీ ప్రిన్సిపాలు అలెగ్జాండరు నా పాత స్నేహితుడు. రేపు పోదాంలే అమ్మా! ఏదైనా సాయం చేస్తాడు" సాదరంగా ప్రత్యుత్తర మిచ్చాడు ధర్మతేజ.

మరునాడు అందరు కాలేజీకెళ్లారు.

"మెడిసిన్‌కు ఎందుకు అప్లై చేయలా" మార్కులుచూచి ఆశ్చర్యపోతూ అడిగారు పిన్సిపాలు. చిట్టి మారుమాట్లాడక తల వంచుకున్నది. డాక్టరు కోర్సుకు ఖర్చు భరించలేక దరఖాస్తు చేయలేదని గ్రహించాడు ప్రిన్సిపాలు.

"టైపు, షార్టుహేండు వచ్చా? పూర్వానుభవముందా? ప్రశ్నించాడు అలెగ్జాండరు."

లేదన్నట్లు తలూపింది చిట్టి.

"రెండు మూడు రోజుల్లో రామ్మా, ఏదైనా ఆలోచించి ఏర్పాటు చేస్తా" అభయమిచ్చాడు. ముగ్గురు సెలవు తీసుకొని జలజ గదికి తిరిగి వెళ్లారు. నాలుగు రోజుల తర్వాత జలజ, చిట్టి ప్రిన్సిపాలువద్దకు మళ్లా వెళ్లారు. ఆయనకు నమస్కారాలు చేసి నుంచున్నారు.

"కూర్చోండమ్మా! నేను సలహా చెప్తా వింటారా?"

"చెప్పండి సార్" వినయంగా అభ్యర్థించింది చిట్టి."

"నీ చదువుకు ఏం మంచి ఉద్యోగం రాదమ్మా. టైపులేదు, స్పెషల్ ట్రయినింగు లేదు. నీ మార్కులు పై చదువుకు తప్ప వేరే ఎందుకూ పనికిరావు. ఏ ఉద్యోగార్హత వుండదు ఇంటర్ చదివినవారికి.

బి. ఎస్. సి., నర్సింగ్ కోర్సు నాలుగు ఏండ్లు పడుతుంది, అందులో ఒక్క సీటు మాత్రం వెయిటింగ్ లిష్టులో వుంది, నీ కది ఇప్పిస్తా. భోజనం, వసతికి సరిపడ 200 రూ.లు స్టయిఫండు ఇస్తారు. సూపరింటెండెంటుతో మాట్లాడి వచ్చా. ఈ కోర్సువల్ల నీకు మంచి భవిష్యత్తు వుంటుంది. నర్సుకు దయ, కరుణ, ఓర్పు, క్షమ, దూరదృష్టి, సమయస్ఫూర్తి ఉండాలమ్మా. ఆ వృత్తిని చాలా ఉదాత్తమైన సేవగా భావించేవారే దానికి అర్హులు. రోగులు, దరిద్రులు, నిర్భాగ్యులైన కష్టజీవుల ప్రక్కల చుట్టూ తెల్లవార్లూ చిన్న దివ్వెతో ఫ్లారెన్స్ నైటింగేల్ తిరుగుతూ ఉండేది. ఆమె ఒక మైనపువత్తి. మైనపువత్తి ఇతరులకు

వెలుగునిస్తూ తాను హరించి పోతుంది. మైనప్పవత్తి మనస్తత్వం గలవారు చాలా అరుదు. అలాంటి సేవా దృక్పథం నీలో నాకు గోచరిస్తోంది. నా శాయశక్తులా నీకు సాయం చేస్తా. ముందీ అప్లికేషన్ నింపుకురా; ఫారం ఇచ్చాడు. మనసారా కృతజ్ఞత చెప్పి నమస్కరించి వెళ్ళింది చిట్టి. దరఖాస్తు పెట్టింది నర్సు కోర్సుకు. సీటు ఇచ్చారు. వివరాలన్నీ తండ్రికి వ్రాసింది.

కథ అర్ధాంతరంగా ముగించింది నర్సు నర్మద. ఆమె ముఖంలోకి చూచిన పిదప తరువాత ఏమయిందని అడగలేక పోయింది కాంచన.

## 3

"నాబాబు ఎలా ఉన్నాడు నర్మదా! మరొక్కసారి చూడాలనిపిస్తోంది. ముత్యంలాటి బిడ్డను చూచుకోనోచని పాప కర్మురాల్ని" తన మనస్సులో బిడ్డపై దాచుకున్న ప్రేమను కండ్లతో చూపింది కాంచన.

నర్మదతో మాట్లాడుతుంటే హృదయం తేలిక పడినట్లుగా వుంటోంది కాంచనకు.

"నీబిడ్డ సుఖంగా సర్వ సౌఖ్యాలతో తులతూగుతున్నాడు. ఇప్పుడే నీళ్ళుపోసి చూచి వచ్చానక్కా. అది సరేగాని అక్కా! నాకో సందేహం వచ్చింది. మీ రిజిష్టరులో నీవు రాజా ప్రతాప బహదూర్ భార్యవనీ, పేరు 'మయూర' అని వ్రాసి వుంది. మరి నీవు జమిందారిణివి కావా? అసలు నువ్వెవరు? ఇక్కడికెలా

వచ్చావు? ఇప్పుడెక్కడికి పోతావు? నీబిడ్డను వాళ్ళకెందు కిచ్చావు? అంతా ఏదో అగమ్యగోచరంగా వుంది. వెళ్ళేముందు నీ కథ వింటేకాని నాకు మశ్శాంతి వుండదు. కాంచన జీవిత చరిత్రను తెలిసికోవాలనే కుతూహలాన్ని బహిర్గతం చేసింది నర్మద.

తన గత జీవితం దశలవారీగా తన స్మృతి పథంలో మెదిలింది కొంచ కప్పుడు.

"ఏమిటో ఈ జీవితాలు! విధివిలాసం ఎంతో అనూహ్యమైనది నర్మదా! వేదాంత ధోరణితో చెప్తుంది కాంచన.

"విధి లేదు: కర్మాలేదు అజ్ఞానం వల్లే మనం పెత్తందార్లకు లొంగి పైగా సుకృతం, దుష్కృతం అంటూ మనమే సృష్టి చేసుకున్న మాయాజాలంలో చిక్కుపడి పోతున్నాం." ప్రపంచానుభవంతో అంటుంది నర్మద.

కాంచనకు పాలు స్రవిస్తున్నై. సన్న ధారగా కారిపోతున్నై. నర్మదకు జాలేసింది. 'బిడ్డ పాలు మట్టి పాలవుతున్నాయి కదా' వెంటనే వెళ్ళి మిల్క్ సక్కర్ తెచ్చి పాలు లాగి పారపోసింది. రొమ్ము గడ్డలకు ఆయింటుమెంటు పూసింది. పాల జ్వరం తగ్గటానికి మందిచ్చింది నర్మద. టైమయిందని హడావుడిగా పరిగెత్తింది హస్పటల్‌కి.

మరునాడు సాయంత్రం నర్మద హడావిడిగా ఇంటికి వచ్చింది.

అక్కా! ఎలాగున్నావు? మందులన్నా నే చెప్పినట్లు వేసుకున్నావా? టానిక్కు తాగావా? అంటూ కాంచన దగ్గరకు పరుగెత్తుకువచ్చింది నర్మద.

"చూడబోతే గొప్ప సంస్కారమున్న వ్యక్తిలా గోచరిస్తున్నావు. నీమీద నాకొక విధమైన పూజ్యభావమేర్పడింది. ఈ రెండురోజులూ నీగురించే ఆలోచిస్తున్నా నీకేదో మహాపచారం జరిగినట్లు నాకనిపిస్తోంది, మణిపూసలాంటి నీపై కత్తిగట్టిన నీచులెవ్వరు? కన్నబిడ్డను కోల్పోయి ఎందుకిలా హృదయ విధారకంగా విలపిస్తున్నావు? నీ అతి మంచితనమే నీ జీవితానికి గొడ్డలి పెట్టయినట్లు తోస్తోంది. కష్టాల్ని సహృదయులకు చెప్పుకుంటే హృదయభారం తగ్గుతుంది. నీ కభ్యంతరం లేకపోతే నీ గతచరిత్ర చెప్పవా" భుజంమీద చెయ్యేసి ఆప్యాయంగా అడిగింది నర్మద.

కాంచనకు తన జీవితమంతా సినిమా ప్రొజక్టరులోని ఫిల్ములా గిఱ్ఱున తిరిగింది.

"నాదంతా ఒక విషాదగాధ తల్లీ! నేను దుఃఖమయ, బాధామయ చరిత్రగలదానినమ్మా! నేడు నా జీవితంలో చాలా విలువైనరోజు, దీర్ఘకాల మానసికాందోళన తర్వాత నాకు ఊరట కల్గబోతుంది. వాడిపొయ్యే మొక్కపై వర్షపు చినుకులా నన్ను రక్షించావు. ప్రాణదానం చేశావు. నీకన్నా నా కాప్తులెవరమ్మా! శ్వాస విడిచేలోగా ఒకరికైనా తన జీవితంలోని కష్టాలనుచెప్పుకోని

వారుండరు. నీతోకాక మరెవ్వరితో చెప్పుకుంటానమ్మా" కంటతడి పెట్టింది కాంచన,

చలించింది నర్మద. కాంచన తన విషాదగాథను వివరిస్తోంది నర్మదతో.

"ఈ సమాజమే నన్ను పతితను చేసింది నర్మదా!.... నా అందమే నా జీవితాన్ని బలిగొన్నది. నా ఆప్తులే నాకీ నరకయాతన కల్పించారు. సంస్కారులకు సహృదయులకు యమ యాతనలు తప్పవుకదా! అందులో ఆడదాని బ్రతుక్కు విలువలేదు. దానిపై దోపిడి దురాక్రమణ తరతరాలుగా జరుగుతున్నై, అలా దోపిడీచెయ్యబడ్డ అభాగినిని నేను తల్లీ! 'అంటూ జాలిగా చూస్తూ తన పూర్వగాథను చెప్పసాగింది కాంచన.

నాకప్పటికి ఆరుఏండ్లు నిండినై. అమ్మకు నేనంటే ఎంతో ఇష్టం, పంచప్రాణాలు నామీదే వుండేవి. నన్ను క్రిందపెడితే భూమి ఎత్తుకుపోతుందని, పైనపెడితే పక్షులెత్తుకెడతయ్యని అహర్నిశలు నన్ను తన కంటికిరెప్పలా కాపాడుకొనేది. రెండు జడలేసి పూలుపెట్టి మంచి బట్టలుకట్టి నన్ను కన్నార్పకుండా చూచుకునేది. రంగురంగుల పూసలదండలంటే అమ్మకిష్టంలేదు. నల్లపూసలదండవేసి "తెల్లనిపిల్ల నల్లనిపూసల్లో ఎలా మెరిసి పోతోందో" అంటూ నాపై ముద్దుల వర్షం కురిపించేది. నన్ను కన్నార్పకుండా తనివితీరా చూసి, అమ్మో! నా తల్లికి దిష్టి తగలవచ్చు" అంటూ ఉప్పు దిగతుడిచి బావిలోపోసి వచ్చేది. నా అందచందాలకు అతిచక్కని మా అమ్మసైతం దిగ్భ్రాంతి

చెందేది. తానే స్వయంగా నాకు 'కంచన్' అంటే బంగారంలాంటి వన్నె కలదాన్నని ఆ పేరు పెట్టుకుంది. చుట్టుప్రక్కల తెలుగు వాళ్ళంతా కాంచన అని పిలిచేవారు నన్ను. తానుమాత్రం ముద్దుగా 'కాంచీ' అని పిలిచేది.

"ఈ ముద్దులగుమ్మను నాకోసమే సృష్టించాడేమో"? అంటూ నన్ను విడిచి క్షణమైనా వుండలేకపొయ్యేది మా అమ్మ. చక్రాలలాంటి కన్నులు, సొట్టబుగ్గలు, సన్నని పెదిమలు, వేలు తగిలితే మచ్చపడే రంగుల అందాలభరిణె నా బిడ్డకు భరతనాట్యం నేర్పిద్దామండీ" అంటూ మురిసిపొయ్యేది. నన్ను పెద్ద విద్యాధికురాల్ని, నాట్యమయూరిని. చెయ్యాలని ఆమె వాంఛ. "మహా గొప్ప భువనసుందరిని నువ్వుకాంగా కన్నావులేవోయ్" నాన్న చమత్కరించేవాడు. లోలో ఆనందాన్ని పైకి వెలిబుచ్చుతూ.

"ఇదిగో ఇది విన్నారా! తగిన రూపకళా సౌందర్యాలేకాక సంస్కారమున్న వ్యక్తి లభిస్తేనే నా చిట్టితల్లి పెళ్ళి" అమ్మ సవాలు విసిరేది; నన్ను గురించి గొప్పగొప్ప కలలుకనేది.

"పులి కడుపున చలిచీమ పుడుతుందా! నీ కూతురూ అంతే. పోనీ స్వయంవరం చాటిద్దాంలే! ఏ రాజకుమారుడో నీ కూతుర్ని ఎగరేసుక పోతాడు" నాన్న హాస్య ధోరణిలో బదులు పల్కేవాడు.

మా అమ్మకు నిద్దట్లో సైతం నామీదే కలలొచ్చేవట. అవన్నీ తెల్లారి కథలు కథలుగా చెప్తుంటే నాన్న పకపకా నవ్వి

"రేపు పెళ్ళయితే పిల్లను మొగుడి దగ్గరకి కూడా పంపేటట్లు లేదే నీ వ్యవహారం" అని ఎగతాళి చేసేవారు.

రోజూ నన్ను తన ప్రక్కలో పడుకోబెట్టుకొని చిన్న చిన్న నీతి కథలు, కబుర్లు చెప్తూ వుండేది మా అమ్మ. స్కూలుకు పంపితే నన్నెవరన్నా ఎత్తుకెడతారనే భయంకొద్దీ అమ్మే నాకు చదువు నేర్పించేది. మా నాన్న పేరు బద్రీనాద్. నాకిద్దరన్నలున్నారు; రవి, రంజన్. ఎనిమిది, తొమ్మిదిసంవత్సరాలవాళ్ళు. 4, 5 క్లాసులు చదువుతున్నా రప్పుడు.

అలా అతి గారాబంగా పెరుగుతున్న నాకు ఒకరోజు రాత్రి కొద్దిగా జ్వరం వచ్చింది. వెంటనే వాంతి చేసుకున్నా. శరీరమంతా చెమటలు పట్టింది. అమ్మ ఆరాటం, ఆదుర్దా ఇంతా అంతా కాదు. నాన్నను లేపి డాక్టరును తెమ్మని గగ్గోలు పెట్టింది. బి. పి. పెరిగి పడిపోయ్యే స్థితి కొచ్చింది. అది చాలక నాన్నను సైతం హడలు పెడ్తుంది.

"ఇప్పుడేమయిందే! జబ్బులు మనిషికిరాక మానుకొ స్తయ్యా? నీది మరీ చోద్యంగా వుంది. నీవే పిల్లల్ని కన్నావా ఏం? అజీర్ణం చేస్తే కక్కుతారు. కక్కితే చెమట పడుతుంది. కొస్త వేడినీళ్ళు పెట్టి వాము నూరి త్రాగించు. పొట్ట ఉబ్బరం తగ్గుతుంది. తగ్గకుంటే తెల్లారిచూద్దాం. ముందు నీళ్ళు మరగబెట్టు. ఈలోగానేవెళ్ళి సోడా తెస్తా" అంటూ పైకండువా వేసుకుని నిద్ర కళ్ళతోనే నాన్న సోడా కొట్టు కెళ్ళాడు. నా కళ్ళు మగతతో మూతపడిసై.

"అయ్యో! అమ్మో! బాబో! కాలిపోతున్నా కాపాడండి. రక్షించండి. ప్రాణాలు పోతున్నై." హృదయ విదారకంగా అరుస్తోందొక ఆడగొంతు. మగతలోవున్న నాకు అదొక ఆర్తనాదంలాగా సన్నగా వినిపించింది.

"ఏమండీ! రారేమండీ! మంటల్లో మండిపోతున్నానండి! అమ్మా కాంచీ! నా దగ్గరికి రాకు. కాలిపోతావు. అన్నలూ నీవు; నీవూ - అన్నలూ"....మరి శబ్దం ఏనిపించలా. నాకిదంతా మరోలోకంలోంచి లీలగా చిన్నగా వినపడింది.

అమ్మ అరుపులకు రవి, రంజన్ లేచారు. దారీ తెన్నూ తోచక గాభరాతో చెంబెడు నీళ్ళుతెచ్చి అమ్మమీద పోశారు. ఇక అమ్మ ఒళ్ళంతా బొబ్బలెక్కి పోయింది. అమ్మ క్రింద పడిపోయింది. ఒళ్లంతా భగభగ మంటలతో గిలగిలా కొట్టుకుంటోంది. రవీ, రంజన్ ఎటూ తోచక ఏడుస్తున్నారు. గజగజా వణికి పోతున్నారు.

నాన్నా! నాన్నా! అమ్మకు స్టౌ అంటుకుందని, కాలి పడిపోయిందని గగ్గోలు పడుతూ చెప్పారు.

"విశాలి! విశాలి! అయ్యో! నావిశాలికి క్షణంలో ఎంత దుర్గతి పట్టింది." అమ్మని కదిపి చూచాడు. బాధతో అపస్మారంలో పడివుంది అమ్మ. ప్రక్కింటి పరుశురామయ్యను లేపి డాక్టరుకోసం పంపి తిరిగొచ్చాడు నాన్న. అమ్మ శరీరం ఆపాదమస్తకం కాలి, బొబ్బలెక్కి నల్లగా వికృతాకార మయింది. అమ్మ ఆఖరి క్షణాలమీద వున్నట్లు ఊహించాడు నాన్న.

"నువ్వెవరివో ఎరుగను మొదట్లో; ఇప్పుడు నీవు తప్ప అన్యం ఎరుగను విశాలి! ఇలా నిలువునా కాలిపొయ్యావు. నిన్నీ స్థితిలో చూడాల్సిన గతిపట్టింది నాకు. అయినా నేనింకా బ్రతికి వున్నానంటే పాషాణంతో సమానం నేను. ప్రకృతికూడా నాపై సీతకన్నేసింది విశాలి. ఆ సమయంలో నిన్ను నాకు దూరం చేసింది. ఇంట్లోవుంటే నీతోపాటు కాలి ఇద్దరం కలసి భస్మమై ఉండే భాగ్యం కల్గేది" అమ్మమీదపడి విలపిస్తున్నాడు నాన్న.

"విశాలి"! దగ్గరగా చేరి ఆర్ద్రతగా పిలిచాడు నాన్న. బలవంతంగా అర్ధరాత్రికి కళ్ళువిప్పి చూచింది అమ్మ. బాధ పడుతున్నా ఆ కళ్ళల్లో వెలుగు, అభిమానం తొణికిసలాడుతున్నై.

"ఏమిటీ ఘోరం విశాలి, కాల పురుషుడు నిన్ను కాటేశాడా! నన్ను గూడులేని పక్షిని చేస్తున్నావా? అయ్యో! దారీ తెన్నూ కానని కారడవిలో చిక్కుకున్నాను విశాలీ. ఎలా వుంది!" అమ్మ తలని తన తొడమీద పెట్టుకొని అడిగాడు.

"ఏమండీ! ఇక నేను బ్రతకనండీ! నా కలలన్నీ సుడిగాలి కెగిరిన చిత్తు కాగితాల్లా కల్లోలమైనై" శరీరమంతా మంటలతో మరణ వేదన పడుతోంది అమ్మ.

"నీకేమైనా కోరికలుంటే చెప్పు విశాలి! అలాగైనా నీరుణ విముక్తుణ్ణి అవుతా." తల కొట్టుకుంటూ ఏడుస్తున్న భర్తను చూచి

"ఇలా కోరికలు తీరకుండా, ఆశ చావకుండా కాలి చచ్చే దౌర్భాగ్యం నానొసటుంటే మీరెలా తప్పించ గలరండీ!" ఆయాసంతో ఆగి ఆగి చెప్తోంది.

"విశాలీ! నీ వియోగాన్ని భరిస్తూ నేను బ్రతుకలేను. ఆత్మాహుతి చేసుకుని నీతోనే వుంటా. ఇద్దరం కలిసి మరో లోకంలో విహరిద్దాం." నాన్న పెల్లుబుకుతున్న దుఃఖంతో అన్నాడు.

"అలా దుఃఖపడకండి! ధైర్యంగా వుండాలండి. నేనూ లేక, మీరూలేకపోతే పిల్లలు దిక్కుమాలిన వారౌతారు. ఇకనుండి మీరే వారికి తల్లీ తండ్రీనూ. మాటలు హీనస్వరంతో వస్తునై్న.

నాన్న గుండెల్ని పిండిచేసింది ఆ దృశ్యం.

"పిల్లల్ని చూస్తావా విశాలి! నీ ప్రాణాలన్నీ వాళ్ళమీదే వుండేవి గదా! ఈనాడెలా వదలి పోతావో గొంతు బొంగురయి మరే మాట పెగల్లా నాన్నకు.

"ముక్కు పచ్చలారని బిడ్డల్ని మీ చేతుల్లో పెడుతున్నా. వాళ్ళలో నన్ను చూచుకొని బ్రతకండి. నా ప్రతి రూపాలే వాళ్ళు. మీతో, పిల్లలతో కలిసి ముద్దూ ముచ్చటా అనుభవించలేని పాపిష్టి జన్మ నాది." ఇక క్షణాలమీద వున్నట్లుందా భాష.

"నీదికాదు విశాలి! నేనూ పిల్లలూ నిర్భాగ్యులం. నీ వియోగంతో నేను తెగిన గాలిపటాన్నవుతా. ఈ ఉపద్రవం నాకొచ్చినా పిల్లలు సుఖపడేవాళ్ళు" నాన్న కసలు మాట పెగిలి రావటంలా.

'రతీ మన్మధులని, శివపార్వతులని మన ఈడూ జోడూచూచి అందరూ అనుకొంటుంటే విని నా విశాలి సర్వకాలం ఇలాగే ఉండాలని కోరుకునేవాణ్ణి. కాని ఇంతలో నూరేళ్ళు నిండుతై అని కలలో కూడా అనుకోలేదు విశాలీ!'

"మీరు ఆశీర్వదించినా నా అదృష్టం ఇలావుందండీ! అకాల మృత్యువాతపడ్డాను. నా గురించి మీరు బెంగపడకండి. పిల్లల్ని కంటిపాపల్లా కాపాడుకొండి; మీరు జాగ్రత్త' గొంతు పూడుకు పోతోంది అంత కంతకూ.

'విశాలి! నా సర్వస్వమూ నీవేనని బ్రతుకుతున్నా. ఇలా అధోగతి పాలౌతానని కలలోకూడా ఊహించలే దెప్పుడూ.' 'కాంచి ఎలావుంది? సోడాతెచ్చి త్రాగించారా? పిల్లలు, నా కాంచీ జాగ్రత్తత....' మాట పెగల్లా. సౌంజ్ఞతో చెప్పింది. మా అమ్మ తలను నాన్న తన చేతుల్తోపట్టుకున్నాడు. తన మోమువంచి నుదుటిని ముద్దాడుతూ.... తన ఎదుటే తన విశాలి సజీవదహనమౌతోందని, పిల్లల్ని కడసారిచూపుకై తెద్దామని లేస్తున్న భర్తని పోవద్దని తలూపింది. మా నాన్న ఒళ్ళో అమ్మతల నిశ్చేతనంగావుంది. అమ్మ శాశ్వతంగా భవ బంధాలు త్రెంచుకొనిపోయింది. ఆమె ప్రాణాలు ఈ అనంత వాయువుల్లో కలిసిపోయినై.

చుట్టు ప్రక్కల వారొచ్చారు. ఎలా జరిగిందని, ఎందుకు జరిగిందీ ఈ ఘోరమని పిల్లల్ని అడిగారు.

పిల్ల మీద ఆదుర్దాకొద్దీ స్టౌ ఒత్తులు పెద్దవిచేసి అంటించింది. నీళ్ళకోసం వెనక్కుతిరిగింది. అగ్నిశిఖ ఆమె చీరకొంగును

అందుకుంది. ఇది ఆమెగమనించలా. ఆ రోజు శ్రావణ శుక్రవారం. భర్త తెచ్చిన టెరిలిన్‌చీర కట్టింది. బొట్టు కాటుక తీర్చి దిద్దుకుంది. తలలోని పూలు వాడలా. తిరిగి చూచేసరికి అగ్నిశిఖలా మెను చుట్టు ముట్టినై. చీరె కాలుతూ శరీరాని కంటుకుపోయింది. పొట్టలోని అవయవాలన్నీ మాడిపోయినై' పిల్లలు చూచిన సంగతి చెప్పారు వచ్చినవాళ్ళందరికీ.

'కారణమేదయినా కాని చేసే చేసే కాపురం బూడిద పాలయింది. ఆమె అకాల మరణంపాలయింది! అని నొచ్చు కున్నది ఒక ఇల్లాలు.

'పిల్లల గతి అలావుంది. మగాడికేం, పెళ్ళాం చస్తే పెళ్ళికొడుకు. ఎలాగైనా పురుషుడు పురుషుడే. ఆడది ఆడదే' అని ఒకరంటే.

'ఏదైనా అన్యోన్యంగా చేసే చేసే కాపురం ఈ నాడు తెడ్డు లేని నావ అయిందని' మరొకరు: సవతితల్లి కన్నతల్లి అవుతుందా! పెంపుడు తండ్రి కన్నతండ్రి అవుతాడా! అలా తలోకరకంగా అనుకున్నారప్పుడు.

బద్రీనాథ్ మిత్రుడొకడు ముఖ్యులందరికీ అర్జంటు టెలిగ్రాం లిచ్చివచ్చాడు. ఇరుగు పొరుగు వచ్చినవారిలో చాలామంది మర్నాడు శవదహనానికి వస్తామని ఆ రాత్రికి తప్పుకున్నారు.

ఈ కథ వింటున్న నర్మదకు కాంచనపై జాలివేసింది. 'అక్కా' అని కౌగలించుకుని కాంచన తల నిమిరింది. కాంచన ముఖపై ఖరిమారింది. అదో ధోరణిలో కథనం సాగించింది ఆమె.

ఆ రోజు రాత్రంతా పిచ్చాడిలా, గతాన్నంతా నెమరేసుకు సాగాడు. శవ జాగరణ చేస్తూ మా నాన్న.

## 4

రాజస్తాన్ రాష్ట్రంలో శాంతిగ్రాం అనేది అతని స్వగ్రామం. సైజాం ప్రాంతంలో వలసవచ్చి తాలూకా హైస్కూలు హెడ్‌మాష్టరుగా వుంటున్నాడు దయానిధి. సదాచార సంపన్నుడు, నిష్కామి, పరోపకార పారీణుడు. తన ఉపాధ్యాయ వృత్తిని విజ్ఞాన దానంగా భావించే ఉన్నతోన్నతు డతడు. తన నివాసానికి వికాసకేంద్రమని పేరు పెట్టి వ్యక్తి వికాసానికై కులమత విబేధాలు లేని రీతిలో విద్య నేర్పేవాడు. ఆ వాతావరణంలో హెచ్చు తగ్గులు లేవు. నిజమైన స్వేచ్ఛ సమానత్వాలకు ప్రతినిధి దయానిధి. వటవృక్షంలాంటి ఆయన నీడలో అనేకమంది విద్యార్ధులు సేద తీర్చుకొని విద్యతోపాటువివేకం, సంస్కృతిగలమహావ్యక్తులైనారు. అందు కాయన ప్రోద్బలం ప్రోత్సాహాలే కారణం. అతిధి అభ్యాగతులకు ఆలవాలము ఆయన ఇల్లు. ఏడువారాలు వారపిల్ల లుండేవారు వారి ఇంట్లో. దూర తీరాలనుండి పిల్లల్నితెచ్చి ఆ దంపతుల కప్పగించి వెళ్ళేవారనేకమంది. 'సాలగ్రామము మున్నగాగానడు' అన్నట్లు ఏమీ పుచ్చుకొని యెరుగడు. ఊరి పెద్దగా రాజీలు చెయ్యటం, అన్యాయాన్ని యెదుర్కొని నిలవటం ఆయన ప్రత్యేకత.

'వండనలయదు వేవురు వచ్చిరేని అన్నపూర్ణకు నుద్దియౌ నతని గృహిణి' అన్నట్లు దయానిధి భార్య శాంతమ్మ పరమ

యోగ్యురాలు. విద్యార్థులకు వేడి - వెచ్చన, ఏ కష్టమొచ్చినా ఆదుకునేది. ఇరుగు పొరుగువారికి తల్లో నాలుకగా వుండేది. శాంత గుణమే ఆమె ఆభరణం. ఒంటిమీద చిన్నమెత్తు బంగారంలేదు. నేతచీరె, ముతక రవికె ధరించేది. సాదాసిగముడితో అతి నిరాడం బరంగా ఉన్నా అందంగానే అగుపించేది.

ఆ దంపతులకు విశాలి, భార్గవి అను ఇద్దరాడపిల్లలు. విశాలి చక్కదనాల చుక్క. సర్వకళలతో ఉట్టిపడే ఆ పిల్ల నయనా నందకరంగా వుండేది. ఆ పిల్ల అందచందాలకు ముగ్ధులై అనేక మంది పిల్లనివ్వమని కబురు పెడుతూండేవారు. 15 సంవత్సరాల విశాలి పది క్లాసులు మాత్రం చదివింది. పెండ్లికితొందరేంలే, పెద్ద చదువులు చదివిద్దామని తండ్రి పట్టుదల.

'అన్నప్పుడల్లా మంచివాళ్ళు దొరకరండీ! అన్ని విధాల నచ్చితే పెండ్లి చేద్దాం' తొందరపెట్టింది భార్య శాంతమ్మ.

'నా బిడ్డకేమే! బంగారురూపం. విశాల హృదయం రెండూవున్నై. ఆ రెండు లక్షణాలు కలవారెందరుంటా రంటావు?' భార్యకేసి గర్వంగా చూచాడు దయానిధి.

'ఇదొక గంభీరమైన ప్రశ్న: సీతా స్వయంవరమా; ద్రౌపతి వివాహమా? మరీబాగుంది. మనం అర్థించేదిపోయి వాళ్ళు అడిగి ప్రాధేయపడ్డా, వినడేమన. మనం కట్న కానుకలు కుమ్మరిస్తామా, ఏమన్నానా?' పెండ్లికై తొందరచేసేది శాంతమ్మ.

'నా బిడ్డ మణి మాణిక్యమే! మన మిచ్చే లక్షలుంటాయా? లక్ష్మీదేవిలాంటి భార్య కావాలి గాని' అలావాదించుకొనేవారా దంపతులు.

'దయానిధి ధర్మగుణం, విశాలి చక్కదనం విని బద్రినాథ్ అతని తండ్రి లక్ష్మణ్‌దాసు శాంతిగ్రాం వచ్చారొకనాడు.

జైపూర్‌కు 30 మైళ్ళదూరాన ఉంది వారి స్వగ్రామం. సైజాంప్రాంతంలోనే ఒక తాలూకా. టౌనులో బంగారు నగలు తయారుచేసే వృత్తి లక్ష్మణదాసు కుటుంబానిది. పెద్ద కొడుకు బద్రీనాథ్‌ని అకులా లో తనస్నేహితునివద్ద వుంచాడు. స్నేహితుని మరణానంతరం ఆ కొట్టుకు బద్రీనాథ్ మేనేజరయ్యాడు. రెండో కొడుకు వృత్తిమాని పంచాయతీ ఆఫీసరుగామారాడు. కూతురు శారదాంబ తండ్రి ఇంటిప్రక్క తన భర్తతో కాపురంవుంటుంది.

బద్రీనాథ్ రూపవంతుడు. గుణవంతుడైన మంచి యోగ్యుడు. మెట్రిక్ మాత్రం పాసైనాడు. సభ్యత, సంస్కారంవున్నవాడు. వృత్తిలో సైతం నీతి నిజాయితీలు పాటించేవాడు.

విశాలి అందచందాలు, దయానిధి పేరు ప్రఖ్యాతులు విని లక్ష్మణదాస్, బద్రీన్ని తీసుకొచ్చి పిల్లనిమ్మని కోరాడు. 4 రోజులున్నారు తండ్రి కొడుకులు. వారిని పరిశీలనగా చూచాడు దయానిధి. బద్రీనాథ్ వినయ విధేయతలు నచ్చినై దయానిధికి. ధనవంతుడు కాకపోయినా అభిమాన ధనుడనేనమ్మిక కల్గింది. 'అయినా ఇతర వివరాలు, కుటుంబ మర్యాదా తెలియాలిగదా!

అని తొందరపడలా! 'విశాలి సలక్షణమైనపిల్ల. మాకన్నివిధాలా నచ్చింది. మీకు బద్రీనాథ్ నచ్చాడా బావగారూ' అడిగాడు లక్ష్మణదాసు. 'ఆలోచించి కబురు చేస్తానండీ.' దయానిధి లక్ష్మణదాసుతో తనకు కొంత అవకాశం కావాలని చెప్పాడు. వారు వెళ్ళిపోయారు.

'అమ్మా! విశాలీ!. నీకు బద్రీనాథ్‌నచ్చాడా' అన్నప్పుడు

'బద్రీ 'అందగాడు అనురాగమూర్తి' మనస్సులో అనుకొంది.' మౌనం అర్ధాంగీకారం అన్నట్లు తలవంచుకుని మాట్లాడలా.

'శాంతా! నీ అభిప్రాయమేమిటి?' నాకు మాత్రం పిల్లాడు బుద్ధిమంతుడు, యోగ్యుడనిపిస్తోంది' 'మన కుటుంబంతో కలిసి మెలిసిపోతే అంతకన్నా మనం కోరేదేముందండీ.' తనకి యిష్ట మేనని ధృఢపరిచింది శాంతమ్మ.

"అయినా పెళ్ళికేమంత వయస్సు ముదిరిపోయిందనీ" అభ్యంతరం చెప్పాడు దయానిధి.

"కొంతయినా వరునిగురించి ముందుగా తెల్సుకోవాలి. పూర్తిగా దూరపుకొండలు నునుపనుకొని పరిగెత్తితే చివరకు రాళ్లు, రప్పలు, మిట్టపల్లాలే కన్పిస్తై. పెండ్లంటే నూరేండ్ల పంట. నింపాదిగా చూచి తగిన వరుణ్ణి అన్వేషిద్దాం శాంతా"! అని ఆమెకు సర్దిచెప్పాడు దయానిధి.

తిరిగివచ్చిన తర్వాత బద్రీ మనస్సు మనస్సులో లేదు.

"ఆ సర్వలక్షణ సంపన్న ఏ గడపలో కాలూనుతుందో! ఎవరి అదృష్టం పండుతుందో"! సర్వ కళలతో ఉట్టిపడుతున్న ఆ పిల్ల విశాలిపైనే బద్రీ మనస్సు లగ్నమై పోయింది. వారాలు, నెలలు గడిచిపోయినై. ఆలోచించి ఆలోచించి ఒక నిర్ణయానికొచ్చాడు.

ఒకనాడు సూర్యోదయపువేళ దయానిధి ఇంటి తలుపు తట్టిన శబ్దమయింది.

"ఎవరండీ! వస్తున్నా" చెట్లకు నీళ్లు పోస్తున్న దయానిధి వచ్చి తలుపు తీశాడు.

తలుపు తియ్యగానే దర్శన మిచ్చాడు బద్రీనాథ్. ఆశ్చర్యం, సంతోషం పెనగొన్నై.

"రా! బాబు కూర్చో!" "శాంతా కాఫీ పట్రా అర్జంటుగా"

"ఏం నాయనా అంతా క్షేమమా" కుశలాది ప్రశ్నల తర్వాత ఇక్కడ భోజనాని కుండమని చెప్పి స్కూలు కెళ్ళాడు దయానిధి. 2 రోజులున్నాడు. ఏమీ చెప్పలేదు. పోలేదు. చివరి కొకనాడు ధైర్యం తెచ్చుకొని మాష్టారి ఎదుట వినమ్రుడై నిలబడ్డాడు బద్రీ.

"ఏమిటి విశేషం? ఏం కావాలి నాయనా" అతి మార్దవంగా అడిగాడు.

"వివాహం విషయం" వణుకుతూ చెప్పాడు బద్రి.

"నీ తల్లి దండ్రులు, నీ కుటుంబ సంప్రదాయం తెలియాలి గదా!" దయానిధి సమాధానం చెప్పాడు.

"ఈ పెండ్లి జరక్కపోతే నే నాజన్మ బ్రహ్మచారిగా వుండి పోతానండీ! నా మాట నమ్మండి. మీ అమ్మాయిని ప్రాణప్రదంగా చూచుకుంటా" చేతిలో కర్పూరం వెలిగించి ప్రమాణం చేశాడుబద్రి

అంతటి వ్యక్తిత్వమున్న దయానిధి చకితుడై నాలుగు. రోజులుండు చెప్తానని బయటి కెళ్ళాడు.

"ఎంత సాహసం! ఎంధైర్యంగా అడిగాను? ఏమని అపార్థం చేసుకున్నారో! ఏదైనా, ఇది చివరి ప్రయత్నం. ఆ తేజస్విని ఇంట్లోవున్నాచాలు. జన్మ ధన్యమౌతుంది. ఏ శిల్పి చెక్కలేని రూపం. ఏ అజంతా ఎల్లోరాల్లో చూడని సోయగం ఆ బొమ్మలో వున్నై. గడిపితే ఆమెతోనే జీవితంగడపాలి. లేకుంటే.... .... ....

లేకుంటే....అయినా అడగందే అమ్మయినా పెట్టదన్నట్లు తప్పేముంది? నా అదృష్టం ఎలావుందో! ఇంత శ్రమపడి ఇక్కడికి వచ్చి, చల్లకొచ్చి ముంత దాచినట్లుంటుంది. పరి పరి విధాల ఆలోచిస్తున్నాడు బద్రీనాద్.

గొడ్లపాక ప్రక్క గోరింట చెట్టుంది. దాని ఆకులు కోస్తోంది విశాలి. వన దేవతలా గోచరించిందామెరూపం బద్రికి. లేత ఆకుపచ్చ గళ్ళ లంగా, నల్ల ఓణీ ధరించింది. కెంపు రంగు జాకెట్టు లోంచి తొంగిచూస్తోందామె నవ యవ్వనం. నల్లని జడ పిరుదులపై నిగనిగ మెరుస్తూ నాట్య మాడుతోంది. గులాబీ రంగు పాదాలకు వెండి పట్టీలున్నై. వాటి గజ్జెల గంటలు చెవులకింపైన శబ్దం చేస్తున్నై. ఏ ఆభరణాలు కోరని ఈమె వన దేవతయా! సుగాత్రి శీలీనుల ప్రణయగాథ బద్రీ మస్తికంలో మెరిసింది.

సహజ సౌందర్య మామెది. ముక్కుకు ధరించిన ముత్యపు ముక్కెర సైతం ఆమె అందం వల్లనే అది ప్రకాశిస్తోందా! అన్నట్లుందామె సౌందర్యం.

మేఘ మాలికలా నిల్చున్న విశాలిని చూచి చకితుడై "విశాలీ" వెనుకనుండి అనురాగపు పిలుపు సన్నని శబ్దంతో.... ఆ పిలుపుతో తృళ్ళిపడి అరమోడ్పు కన్నులతో తిరిగి చూచింది విశాలి.

ఆ కండ్లలో ఎంత తేజస్సు! ఎంత ఆకర్షణ! రెంటిలో ఏది మిన్నో నేనొక కవినైతే వర్ణించేవాడిని' అనుకొన్నాడు బద్రీ. ఆమెనుండి చూపు మరల్చలేక పోయాడు బద్రీనాద్.

"నూనూగు మీసాలు, దబ్బపండు చాయ, గిరజాల జుట్టు, స్ఫురద్రూపి, మన్మధుడే దిగివచ్చాడా! నేనే శిల్పినైతే ఈ సుందరాకారుని విగ్రహాన్ని మలిచేదాన్నికదా!" అనుకొంది విశాలి. అతని అందానికి ముగ్ధురాలై సిగ్గుతో తలవంచి నేల చూస్తూ బొటనవ్రేలితో నేల రాస్తోంది విశాలి.

" ఈ నిరుపేద ప్రేమ పూజారిని స్వీకరించవా విశాలీ?"

మౌనంగా ముఖంలో సంతోషం చూపింది ఆమె.

"అంతటి భాగ్యం నాకు లభిస్తుందా విశాలీ"

"మీబోంట్ల సాంగత్యంకన్నా నే కోరేదేముందండీ" ఈరోజు నా జీవితంలో వసంతం ప్రవేశిస్తోంది. ఇంతంటె స్త్రీకి మరోభాగ్యం

వుందా! కోరుకున్న పురుషుడు అనురాగపుంజమై నాదరి చేర బో తున్నాడు. నా జీవితం సఫలమౌతోంది. అని సంతోషం పట్టలేక ఆనంద బాష్పాలు రాల్చింది విశాలి.

"విశాలీ! కన్నీరు కారుస్తున్నావా"

"కాదండీ! ఆనందాశ్రువులు"

ఇద్దరూ నోటమాటరాక మధుర స్మృతులు తలచుకుంటూ ఊహాపధంలో విహరిస్తున్నారు. దయానిధి పదధ్వని విని లోనికి పరిగెత్తింది విశాలి. ఇది గ్రహించిన తండ్రి చిరునవ్వుతో "బద్రీ! రా, లోనికి పోదాం" అంటూ ఆహ్వానించాడు.

ఎఱ్ఱ చెంకి చీరె ధరించింది విశాలి. పల్చటి మేలిముసుగు లోంచి పాపటబొట్టు, చెంపసరాలు, ముక్కుపోగు మెరుస్తున్నై. కండ్ల కాటుకతో, పల్చని పెదాలతో, సొట్ట బుగ్గలతో దివినుండి భువికి దిగొచ్చిన అప్సరసలా వున్న వధువును తదేక దృష్టితో చూస్తున్నారు పెండ్లి పెద్దలంతా.

"ఆజన్మాంతం జీవిత భాగస్వాములుగా కలిసే జీవిద్దాం. సుఖదుఃఖాలలో పాలుపంచుకుందాం" పాణిగ్రహణం చేశారిద్దరూ"

నిరాడంబరంగా వివాహం జరిగింది.

శోభనపురాత్రి అలంకరించిన గదిలోకి అడుగు పెట్టింది అపూర్వ సౌందర్యవతి విశాలి. గదంతా అత్తరు, సెంటువాసన విరజిమ్ముతోంది. పాన్పుపై మల్లె పూలు విచ్చుకుంటున్నై.

శృంగార నాయకి అలా నిల్చుంటే అమితానంద భరితుడైన బద్రీనాథ్-

"చూడు విశాలీ" నీవు అపర వరూధునివి - మదవతిని తృణీకరించే ప్రవరాఖ్యుణ్ణికాదు నేను. నీవూ నేనూ తనివితీర సర్వ సౌఖ్యాలనుభవించాలి" ఆనందంతో విశాలి కళ్ళు మిలమిల మెరిశాయి. ఆమెను గాఢాలింగనంతో బంధించాండు బద్రీ.

ఒరిపై మరొకరు ఒరిగి, ఒకరిలో మరొకరు లీనమయి శృంగార రశాబ్ధిలో ఓలలాడారు ఆ దంపతులు.

# 5

"ఎంత అదృష్టవంతురాలివి అక్కా నీవు, అలాంటి తలిదండ్రుల కడుపున పుట్టావు" అన్నది నర్మద.

"అది దురదృష్టంగాపరిణమించిందమ్మా" అని వాపోయింది కాంచన. నా కథంతా పూర్తిగా వింటే నీకు కన్నీళ్ళు మిగలవు. అంటూ కాంచన పెల్లుబుకుతున్న దుఃఖంతో తన చరిత్ర చెప్పసాగింది.

"ఈ ముండింకా లేవలేదే. తల్లిచావు పిల్ల. దానివల్లే నా తమ్ముడి కొంప కూలింది. శవాన్నన్నా చూస్తావా? లేదా? లే! లే! అంటూ నన్ను కుదిపిందొక హస్తం. ఎవరా అని కళ్ళు తెరిచి చూచా. మా మేనత్త కంఠమది. తరుచుగా వచ్చి నెలలకు నెలలుండి అమ్మచేత ఊడిగం చేయించుకొని చీరె సారెలతో పోతూ వుండేదామె.

"ఏమే లేచి వస్తావా? వస్తావా? మీ అమ్మ నెత్తుకెడు తున్నారు. పుట్టు దరిద్రురాలివి. శని ముండవు దాపురించావు" అంటూ మా నాయనమ్మ నా రెండు చేతులు ఊడేట్లు లాగింది. దిమ్మెరపోయ్యా. కళ్ళు తెరుచి చూచా. మామ్మ, అత్త ఇద్దరూ చెరో చెంపా రాక్షసుల్లా అరుస్తున్న దృశ్యం కన్పడింది. అర్థంకాలా నా కప్పుడు.

"ఏంటి మామ్మ! నేనేం తప్పు చేశాను. ఏమైనా పగల గొట్టానా? అన్నల్ని తిట్టానా? అమ్మ మాట వినలేదా? ఎందుకు నన్నిలా తిడుతున్నారు?" మెల్లిగా అడిగా నప్పుడు.

"నోరు వాయి లేని పిల్ల, మాయా మర్మాలెరుగని వయస్సు పుట్టెడు కష్టం వచ్చింది చాలక అలా ఆ పిల్లను కసురు కుంటారేమిటండీ!" అంటూ మా అమ్మమ్మ, మా భార్గవీ పిన్ని నాదగ్గరికొచ్చి "అమ్మా కాంచీ! మన పెన్నిధి కూలిపోయిందమ్మా నీకు మాతృ హీనం. నాకు కడుపు శోకం. ఇవి ఈ జన్మలో తీరవమ్మా. నీ తల్లి ఆలనా, పాలనా నీ పాలిట శత్రువు లయ్యాయమ్మా; ఎంత పాపం చేశామో! మన పాలిట దుర్దినా లొచ్చినై. ఇంత ఘోర శాపమా! మొగ్గలో నే ముడుచుకు పోతోంది నీ బ్రతుకు. ఈ కష్టాలన్నీ చూడటానికే నే నింకా బ్రతికేనేమో!" అమ్మమ్మ నెత్తినోరు మొత్తుకుంటూ ఏడుస్తోంది.

"నీవు, అన్నలు సర్వనాశనమైనారమ్మా! ఈ నష్టం తీరేది కాదమ్మా" దుఃఖం దిగమ్రింగుతూ "రామ్మా అమ్మనుచూపిస్తా" నని బుజాన వేసుకొని భార్గవి పిన్ని నన్ను బైటికి తెచ్చింది.

సావిడి అంతా ఊళ్ళో ఆడవాళ్ళు, చుట్టాలతో నిండి వుంది. వాకిట్లో ఊళ్ళో మగాళ్ళు, పిల్లలతో గలభాగా వుంది. మా చాకలి రెండు కుండలూ, బొంగులు తెచ్చిపడేశాడు. నిచ్చెన కడుతున్నాడు మా పురోహితుడు. ఆయనే అమ్మచేత నోములూ, పూ జ లూ, చేయించేవాడు. చాపమీద తెల్ల గుడ్డతో కప్పబడ్డమనిషి, తలప్రక్క దీపం, వున్నై. అన్నలెందుకో ఏ డు స్తు న్నా రు. నాన్న తెల్లని బట్టలతో నిప్పుమీద దర్భలూ, పువ్వులూ వేస్తున్నాడు. అందరూ ఏడుస్తున్నారు. మరి నేను? నాకేడ్పేరాలా? ఆ దృశ్యమంతా వింతగాతోచింది.

'ఈ జన్మలో మళ్ళా చూడలేని అమ్మని చూడమ్మా.' పిన్ని శవం ముఖంమీదగుడ్డతీసి చూపింది. 'అమ్మా' అని అరచి పిన్నిని గట్టిగా వాటేసుకున్నా. ఆ ముఖంచూచి భయపడ్డా. అది మా అమ్మ కాదు. అమ్మట! అమ్మ! వికృతంగావుంది అమ్మరూపం. మొగం కళ్ళు, చేతులు, పొట్ట, జుట్టుకాలి నల్లగావున్నై. అంతా బొబ్బ లెక్కినై. నీళ్ళుకారుతున్నై. వాసనేస్తోంది. ఎవరిమె! ఏమిటీగోల నాకు అర్ధంకాలా. అమ్మమ్మ వెక్కి వెక్కి ఏడుస్తోంది మీదపడి.

'పాతికేళ్ళకే నీకు నూరేళ్ళు నిండినయ్యామ్మ! పిల్లల నోట మట్టి, నానోటగడ్డ పడినై. ఇంత నడమంత్రపుచావుకు నీవే పాపం ఎరుగవమ్మా!' కన్నీరు మున్నీరుగా ఏడుస్తున్న అమ్మమ్మ నెత్తినచెయ్యిపెట్టి తాతయ్య 'ఊరుకోవే! నీవే ఇలా బెంబేలెత్తితే ఆ చిన్నారి పిల్లలగతేమిటే. వాళ్ళు అల్లాడిపోతారు.'

'కష్టాలొచ్చినప్పుడు వివేకంతో బ్రతకాలి శాంతా. మనం నిమిత్తమాత్రులం. ఆ పిల్లలగతీ, మనవిధీ అలావున్నై. అందరూ

నీటిమీద బుడగలమే. మా నవుడు జ్ఞానజీవి, ఆలోచించగలడు. ఆలోచించాలి. పోయినవాళ్ళ అదృష్టవంతులు. ఆ పిల్లల్లో మన బిడ్డనుచూసుకొని మనం సమాధానపడాలి.' తన దుఃఖం దిగమింగుతూ అమ్మమ్మను ఓదారుస్తున్నాడు తాతయ్య.

'పుత్ర దుఃఖం నిరంతరం' అన్నట్లు కన్నతల్లి బాధను ఎవరు పూడ్చగలరండీ! - పేగులో పేగు, నెత్తురులో నెత్తురు నవమాసాలు మోసి, కుడి ఎడమల తేడాలేకుండా సర్వస్వమూ తానే అయి బిడ్డను పెంచుతుందితల్లి. ఆ పుష్పం వికసిస్తే తృప్తిగా వాసనపీలుస్తుంది, మొగ్గలో తెగిపోతే ఉసూరుమంటూ విలపిస్తుంది. మీకర్థంకాదండి నాబాధ. ఏంచెప్పేది! ఎలావర్ణించేది? అమ్మమ్మ తల బాదుకుంటూ అంటోంది.

ఇంతలో 'క్రొత్తచీరె కట్టండమ్మా! బొట్టూ, పసుపు, పారాణి పెట్టిపూలదండలుంచండమ్మా' పురోహితుని కేకవినవచ్చింది. అన్నలిద్దరికి తెల్లబట్టలు కట్టారు. శవాన్ని పాడెమీదపెట్టి తాళ్ళతో కట్టారు. అంతా ఘొల్లుమనగానే నాన్నశవంమీదపడి 'విశాలీ! నే నెలా బ్రతికేది. ఏనాడూ కష్టమంటే ఎరుగని నన్ను ఇలా ఒకే సారి అఖాతంలో పడేసి తప్పుకుంటున్నావా! వెనుకంతా అగమ్య గోచరం, ముందంతా శూన్యం అయింది నా జీవితం. ఏనుగంత తండ్రి కంటే ఏకులబుట్టంత తల్లి మేలంటారు. నాకన్నా ఈ అకాలమరణం రాకపోయెనే' గుండె తల బాదుకు ఏడుస్తున్న కొడుకుతో తండ్రి 'లే! లే! కష్టాలు మనుష్యులకురాక జంతువుల కొస్తయ్యా? అకాలమయింది. పిల్లా పాప ఆకలితో నకనకలాడు తున్నారు. రెండు ఝాములవేళ ఎండలో స్మశానానికెళ్లటం కష్టం.

పద పద' అంటూ పట్టుకోమని నిప్పుకుండ బద్రిచేతికిచ్చాడు తండ్రి లక్ష్మణ్‌దాస్. ముందు నడువమని లేపాడు కొడుకును. అందరూ ఘొల్లుమన్నారు. జరుగవలసిన కార్యక్రమమంతా జరిగిపోయింది.

'మా అమ్మను తీసుకెడుతున్నారు. మాకింక అమ్మలేదు. ఇంకరాదు. మేముపోతాం' అన్నలిద్దరూ పెద్ద పెద్దగా ఏడుస్తున్నారు.

శవదహన తతంగమంతా పూర్తయి ఇంటికొచ్చారంతా. ఏమిటి? అమ్మ, అమ్మ అని ఏడుస్తారుఅన్నలు. నాకుమాత్రంఅసలు ఏడ్పేరాలా. మాఅమ్మ బంగారుబొమ్మ. నల్లనినొక్కులతో నిగనిగ మెరిసేజుట్టు, తెల్లనిరంగు, సన్ననివళ్లు, నవ్వుతుంటే సొట్టబుగ్గలు మాఅమ్మకున్నై. ఈమె ఎవరో, ఏమిటో? నల్లగావికృతంగావుంది. భయంవేస్తోంది. అంతా విచిత్రంగాఉంది. ఇంటినిండా జనం. అమ్మమాత్రం కనపడదు. అమ్మేది? పనిచేస్తోందా? అన్నం వండుతోందా? అమ్మా! అమ్మా! అనబోయినా, పైకిమాట పెగిలి రాలా. కడుపులో మళ్ళీ మంట వచ్చింది. ప్రక్కమీదికెలావచ్చానో ఎవరు తెచ్చారో తెలియదు.

ఆ రోజు సాయంత్రం ఆరుగంటలకు తెలివొచ్చి కళ్ళు తెరచిచూచా. కడుపులోకలియబెట్టినట్లుంది. ఆకలేస్తోంది. నీరసంగా వుంది. అమ్మా, అనిపిలిచా! అమ్మపల్కలా! రాలా. ప్రక్కగదిలో ఒక ఆడగొంతుక అంటోంది.

'రైలందక వేళకు రాలేకపోయ్యాం. ఎలాగొ పది రోజు

లుండాలికదా అని ఆయన శెలవు పెట్టి వచ్చేటప్పటికి ఆలస్య మయింది. ఇలా ఎందుకు జరిగింది" ఆమె మా పినతండ్రి భార్య ఊర్మిళమ్మ. వివరాలు సేకరిస్తోంది.

మా నాయనమ్మ కోడలితో చెపుతుంది: కాంచి కోసం వేడి నీళ్ళకై స్టౌ వెలిగించిందని, మంట చీరకొంగుకు అంటుకుందని, కాలుతున్నప్పుడు నాన్న ఇంట్లో లేడని, ఆ పాదమస్తకం కాలి బొబ్బలు తేలి పడిపోయిందని, నాన్న ఏ సాయం చేయలేక పోయాడని, డాక్టరువచ్చిచూచి మరింక బ్రతకదని చెప్పాడని, ఇదంతా ఒక కథగా చెప్పుకుంటున్నారు. నా కప్పటికే అర్ధంకాలా. మా అమ్మ కాలిచచ్చిపోయి బూడిదయిందని. ఆ శవానికి, అమ్మ రూపానికి పోలికేలేదు. కాలితే అలా వికృతరూపం వస్తుందని అర్థంచేసుకునే వయస్సులేదు నా కప్పటికి.

'అమ్మకావాలి ! అమ్మే కావాలి' అని ఆ రాత్రి మెలకువ వచ్చి ఏడ్చాను. అమ్మరాలా. పెద్దగా మళ్ళీ మళ్ళీ అమ్మకావాలి ! అమ్మా ; అమ్మా ! అని ఏడ్చా.

'ఏం తల్లీ ! ఏం కావాలి ? అన్నం తింటావా ? పాలుత్రాగు తావా ?' అమ్మమ్మ నన్ను తన గుండెలకదుముకొని పరి పరి విధాల బుజ్జగిస్తోంది.

'మా అమ్మేది ? అమ్మా, అమ్మకావాలని వెక్కి వెక్కి ఏడ్చాను. అందరూ ఓదార్చారు. లాభంలేదు. నాన్న ఎత్తుకుని దొడ్లోకి తీసుకెళ్ళి మాటలు చెప్పి మరపిస్తున్నాడు.

'కడుపునొప్పా? ఆకలా? అన్నంతింటావా' నాన్న అడిగాడు. 'కాదు అమ్మకావాలి." పెద్ద పెద్ద శోకాలు పెడుతూ గోలచేశా. అసలే పుట్టెడు దుఃఖంలోవున్న నాన్నకు దుఃఖం కట్టలు తెగి కోపంగా మారింది.

'బద్మాష్! అమ్మకావాలా! అమ్మ. అమ్మను పొట్టనపెట్టు కుందినీవే. నీవల్లే అమ్మచచ్చింది. నీ సోడాకోసంవెళ్ళిన నేను సమయానికిరాలేక నా సర్వస్వాన్ని పోగొట్టుకున్నా. మా వియోగానికి కారణం నీవే. నన్ను రెక్కలులేనిపక్షినిచేశావు. ఏ దుర్ముహూర్తాన మా కడుపునపడ్డావో! శనిలా పీడిస్తున్నావు. నీవు పుట్టకున్నా, లేక పుట్టగానే చచ్చినా, నాకీబెడదతప్పేది. అంతకంటే బాగుండేది.' అని చెంప పగిలేలా కొట్టాడు.

'చావు, చావు' అని దొడ్లో జామచెట్టుక్రింద నుంచోపెట్టి చావబాదాడు. మళ్ళీ మళ్ళీ ఆవేశంతో ఇంకా ఇంకా కొట్టాడు. దాంతో ఏడ్చేశక్తినికూడా కోల్పోయి స్పృహలేకుండాపడిపోయ్యా. ఇది నా జీవితంలోని ప్రథమ మలుపు. అలా అమ్మ చావుతో ప్రారంభమైన నాకష్టాలింకా కడతేరనేలేదు. అవి నాతోనే పోత య్యేమో! నర్మదా! కొన్నాళ్లు చీకటి, మరికొన్నాళ్లు వెలుతురనే నానుడి నా పట్ల ఫలించలేదమ్మా. జీవితాంతం నేను అమావాశనిసి లోనే జీవిస్తున్నా. నా జీవితంలో వికాసంలేదు. నాకు ప్రగతిలేదు.'

ఆ రాత్రి 12 గంటలప్పుడు నాకు మెలకువ వచ్చింది. చుట్టూ కలియచూచా. సన్నగా ఏడ్పువినిపిస్తోంది. మెల్లగానాన్ననాదగ్గరి కొచ్చి బావురుమని ఏడుస్తూ "అమ్మా! కాంచీ! పరమకిరాతకుడిలా

నిన్ను కొట్టానమ్మా. మీ అమ్మలేనిలోటు నేతీర్చలేనమ్మా, పాపిష్టి వాణ్ణి ఉద్రేకం, ఉద్వేగం, దుఃఖం నన్నుపశువులా చేశాయమ్మా! మీఅమ్మ ఉండి, నేపోయినా మీరు హాయిగాబ్రతికేవాళ్లు. ఆమె తన సర్వస్వాన్ని వెచ్చించైనా మిమ్మల్ని కంటిరెప్పలా కాపాడుకునేది. ఇంకనిన్ను కొట్టనమ్మా! నామాటనమ్ము. అమ్మ నిన్ను నాకప్పగించిపోయింది. నేనింకా బ్రతికేవున్నానమ్మా! నామాట విన్నావా'? బ్రతిమాలి పాలు త్రాగించాడు. ఒళ్లంతా నిమిరాడు. వీపుపై, శరీరమంతా ఎఱ్ఱగా వాతలు తేలివున్నై. ఏడ్చి ఏడ్చి నాకళ్లు పీక్కుపోయినై. జుట్టు చిందర వందరగావుంది. ముఖం ఎఱ్ఱబడ్డది. అవిచూచి నాన్న గుండె బ్రద్దలయింది.

'ఆహా! ముక్కుపచ్చలారని నా బంగారుబిడ్డ. ఆ బంగారు చాయ వొంటిపై ఈ గుర్తులా! ఇవి ఈ పిల్ల భావి జీవితానికి చిహ్నలా! సృష్టివైపరీత్యం కాకపోతే, ఏ కోటీశ్వరుడియింట్లోనోపుట్టి హంస తూలికా తల్పంపై పెరగాల్సిన ఈ పిల్ల నా కడుపునపుట్టి నిర్భాగ్యురాలయింది. ఇకముందు నా దుర్దశ నా బిడ్డలకంటరాదు. ఎలాగైనా బిడ్డల భవిష్యత్తు కాపాడాలి. నాజీవితభాగస్వామి ఆత్మ శాంతించాలి. ఆమె నన్ను పది సంవత్సరాలు కంటిరెప్పలా కాపాడింది. సర్వసౌఖ్యాలు అందిచ్చింది. చిదిమి దీపం పెట్టగల ఆమె సోయగం చితికిపోయింది. సహృదయంగల నా విశాలి ఈనాడు నాకు దక్కలేదు. అందం, వయస్సు, సోయగం, ఓర్పు, నేర్పులలో ఆమె కామేసాటి. నే మహాపాపిని. కనుకనే నాకామె దక్కలేదు. నాపాపఫలమే నన్నిలా దిక్కులేనివాణ్ణి, వంటరివాణ్ణిచేసింది. పోయిన నాహృదయ దేవతకేచిక్కులు, ఇక్కట్లులేవు. అన్ని

బరువు బాధ్యతలూ, కష్టాలూ నన్నూ- నా బిడ్డల్నీ చుట్టుముట్టినై. నా పెన్నిధి నశించింది. పెట్టానో? తిట్టానో ఏనాడూ నన్ను పల్లెత్తు మాట అనిఎరుగదు. నన్నే తన సర్వస్వమని నమ్మింది. ఆనాజీవిత జ్యోతి నేడారిపోయింది. పిల్లలే ఆమె కనుపాప కాంచన ఆమె బహిప్రాణము, జీవనజ్యోతి. ఆ కనుపాప్లో నీరు ప్రవహించ కుండా చూడడమే విశాలిపై నా కృతజ్ఞతకు నిదర్శన. అంటూ నాన్న వాపోయాడు.

అమ్మపోయి పదిరోజులయింది. చుట్టాలు, స్నేహితులు వస్తూపోతూనే ఉన్నారు. పెద్దకర్మ, చిన్నకర్మ, దినం వగైరాలని రోజూ హడావిడితో ఇల్లంతా గలభాగా ఉండేది. అమ్మమ్మ, పిన్ని నన్నూ అన్నల్నీలాలిస్తూ, కబుర్లుచెప్తూ అన్నం తినిపించేవారు. నాన్న తనపక్కలో పడుకోబెట్టుకోనేవాడు. 'అమ్మా ! అమ్మ కావాలి' అంటూ మధ్యమధ్య ఏడుస్తూవుండేదాన్ని. నిద్దర్లోకలవరించేదాన్ని. ఇంటికొచ్చినవాళ్ల కళ్లన్నీ నామీదేవుండేవి. ఊళ్లో భూస్వాములు, చుట్టాలు, "పిల్లనిమాకివ్వండి పెంచుకుంటాం. మీరెలాసాకుతాతారు?' అని అడుగుతున్నారని నాన్న 12వ రోజు రాత్రి పదిమందిలో చెప్పటంవిన్నా. అమ్మమ్మ. పిన్ని 'మేంతీసుకెడతాం' ఎవ్వరికీ ఇవ్వద్ద'ని వాళ్లంటున్నారు. ఆ రోజు అమ్మ తండ్రి దయానిధి తాత, నాన్న తండ్రి, అమ్మమ్మ, నాయనమ్మ అంతా సభలాగా చేరితలోరకం సలహా ఇస్తున్నారు. మగపిల్లల్ని నాన్న తండ్రి తీసు కెడతానని పట్టు పట్టాడు. రెండునెలల్లో ఓపిల్లనిచూచి కట్టపెడతాం. అందాకా పిల్లల్ని మాతో పంపమని నాయనమ్మ మరీఘట్టిగా అంటోంది. నాన్నగుండె బాదుకుంటూ ఏడుస్తూ 'అదిలేని ఇంట్లో

పిల్లలూ లేకపోతే నేనెలాబ్రతికేది? నేనే వాళ్ళని చూచుకుంటా' నని నాన్న ఘట్టిగా వాదించాడు. పంపనన్నాడు. నా బిడ్డలు నాకుబరువు కాదన్నాడు.

13వ రోజు బంధువులు అంతా వెళ్ళిపోయ్యారు. ఆ రోజు ఇంట్లో ఎవ్వరూ నిద్రచెయ్యరాదట. ఇంట్లో ఉండరాదనేది మావాళ్ళఆచారం. ఆ రాత్రి అమ్మ ఫొటోపెట్టుకుని నల్గురం పెద్దగా ఏడ్చాం. అన్నం తినలేదు. చాపలమీదపడి ఏడ్చి ఏడ్చి కన్ను మూశాం.

తెల్లవారింది. పాలుతెచ్చాడు వెంకన్న. అన్న గిన్నె తెచ్చి పాలు పోయించుకున్నాడు. తెస్తుంటే క్రింద పడేశాడు. గిన్నె అన్న కాలిబోటనవ్రేలు మీదపడి నెత్తురొచ్చింది. నాన్న కొడతాడని భయపడి తలుపు చాటుకెళ్ళిదాగాడు. ఆపూట కాఫీలేదు. అలాగే కుంపటి రాజేసి బియ్యం పెట్టాడునాన్న. అన్నంలో నీళ్ళుచాలక మాడింది. ఊరగాయతో ఎలాగో ఎంగిలి పడ్డాం. అలా వారం గడిచింది. రెక్కాడితేగాని డొక్కాడని సాదా కుటుంబం మాది. నాన్నసంపాదించాలి, మేమందరం తినాలి. అమ్మచావుకి, దినానికి నాన్న రెండువేలు నోటువ్రాసి తెచ్చాడట. చచ్చాకా శ్రార్ధకర్మలు, మాసికాలు, దినవారాలు తడిసి గం పె డ యి ం ది నాన్నకు. మావాళ్ళందరివీ సామాన్య కుటుంబాలే. ఎవర్ని ఎవరాదుకోగలరు! ఎవరిపనులు వారివి. అంతా వెళ్ళిపోయ్యారు నాలుగురోజులయ్యాక మా నాన్న మాకన్నం వండిపెట్టి, అన్నల్ని స్కూలుకి పంపి, తను కొట్టుకెడుతూ ఇల్లుతాళంవేసి నన్నూతీసుకెళ్లాడు. బిక్కమొహంవేసి

కూర్చున్నాను కొట్లో. 'బద్రీదాసుగారూ ; ఎన్నాళ్లిలా గడుపుతావయ్యా ! ఆ పిల్లను స్కూల్కుపంపు; నాలుగు అక్షరంముక్కలన్నా నేర్చుకుంటుంది.' బెంగ మరచిపోయి పిల్లల్తో ఆడుకుంటుందని కొట్లోని తోటిపనివాళ్లంటే, నాన్న సమాధానం చెప్పలా. తనపిల్లమీద అందరి కళ్ళూ పడతయ్యని, ఎవరైనా ఇమ్మని అడుగుతారని నాన్న భయం. అదికాక ఎవరైనా ఎత్తుకెళ్ళిపోయి తన ముద్దు బిడ్డను, అందాల రాశిని అమ్ముకుంటారని లోపలి భయం. మరి ఇలాగే రెండు నెలలు గడిపాడు. ఇళ్ళు వాకిళ్ళు మట్టి పట్టినై. పనిమనిషి అందినదల్లా పట్టుకెళ్ళింది. ఒకనాడు పనిమనిషి అమ్మచీర గుడ్డచాటున పట్టుకెళ్లటం చూచి నాన్నతో చెప్పా. వచ్చి నన్ను నానామాటలూ అంది. "నీవు ఇలాంటి పితూరీల దానవు గనుకనే అమ్మను దిగమింగుకున్నావు. ఇంక మీ నాయన్నైనా బ్రతుకనిస్తావా తల్లీ! కరువు దానా !" మెటికలు విరుస్తూ పోయింది. మరి రాలేదు. అసలే కొద్ది జీతం ఇస్తాం గదా! దొంగను దొంగ అంటే తప్పయింది. దాంతో నాన్నకు పని రెట్టింపయింది. విసుగు, చిరాకూ పెరిగినై. పిల్లల్ని పెంచేకన్నా బిచ్చం ఎత్తుకోవటం మేలు అంటూ తిట్లు ప్రారంభించాడు.

పోషణ లేక, ఆదరం లేక నేను బక్క చిక్కి పోయినా. తరుచూ జ్వరం వస్తూండేది. నాన్నకు కోపం, చికాకు పెరుగుతున్నై. అమ్మపోయి 3 నెలలయింది. ఆరోజు పెద్ద మాసికం పెట్టాలట. తాత, నాయనమ్మ, అత్త ఆ రాత్రి బండిలో దిగారు. నన్నూ, అన్నల్ని గదిలో పడుకోబెట్టి కబుర్లు చెప్పుకుంటున్నారు.

"మనూరికి ఆమడ దూరంలో ఒక గ్రామం ఉంది అక్కడ. మన దూరవు చుట్టానికొక పిల్ల వుందట. కటిక బీదవారు. పైగా ఆ పిల్లకు అందం లేదని పెళ్లి కాలేదుట. నీకిస్తామని వార్త పంపారు. పెండ్లికి ఉభయ ఖర్చులు మనవే నట. అయినా ముగ్గురు పిల్లలున్న నీకు అంతకంటే గొప్ప సంబంధం వస్తుందా! మనం మాత్రం శ్రీమంతులమా ఏం! గంతకు తగ్గ బొంత. నీకూ, పిల్లలకీ ఇంత ఉడకేసిపెట్టి తిని పడుంటుంది. ఇంటికి దీపం పెడుతుంది. ఏపుగా ఎదిగిందట. ఆరుగురు ఆడ సంతతి, ముగ్గురు మగ సంతతట యజమానికి. అయినా అవన్నీ మనకెందుకు? నీకు కావలసింది ఆడది. వాళ్ళకి వదలాల్సింది కన్నె చెర. మిగతావన్నీ మేం చూస్తాం. 30 ఏళ్లు నిండినవాడివి. ఎలా రోజులు గడవాలి. ఎన్నాళ్లు దిక్కు మొక్కు లేకుండా బ్రతుకుతావు?" నానమ్మ చాలా గట్టిగా బలవంతం చేస్తోంది.

ఇది విన్న నాన్న గొంతు బొంగురు పోయింది. మాటరాలా. దుఃఖం వచ్చి ఏడ్చాడు. "నా బంగారు మణిని పోగొట్టుకొన్న నేను మట్టిని స్వీకరించగలనా! నా బిడ్డల గతేంకాను? వాళ్ళకామె తల్లి అవుతుందా? నాకు ప్రియురాలౌతుందా? కలో గంజో తాగి బ్రతుకుతాం. రెక్కలు రాగానే బిడ్డలు ఎగిరిపోతారు. నాకు మళ్లా పెళ్లెందుకమ్మా? నాకింక వివాహం, దాంపత్య జీవితంపై మనసు విరిగి పోయింది. నన్ను బాధించకమ్మా."

"ఎప్పటికి నీ జీవితం కడతేరుతుంది నాయనా! భార్యాభర్తల అన్యోన్యం, అండదండలు మరొకళ్లవల్ల తీరుతుందా?

మగాడివి. నీకేమిటి? మళ్లా పెళ్లాడి పిల్లల్ని కనొచ్చు, ఆడదైతే విడ్డూరం కానీ. ఏదైనా నీవు బాధపడలేవు. మేము చూస్తూ ఊరుకోలేం. మేము చేయటానికి తగ్గ శక్తి, స్తోమత మాకు లేవు. నేను దరిదాపు మాట ఇచ్చి వచ్చా!" తండ్రి ఆజ్ఞాపిస్తూ గంభీరంగా చెప్పాడు. "అదేమిటి! నేను చూడొద్దా? ఆమె ఇష్టపడొద్దా? పిల్లల భవిష్యత్తు ఆలోచించద్దా? అంతా మీ ఇష్టమేనా? ఇది నా సొంత విషయం. నేను నా విశాలికిచ్చిన మనస్సు మరొకరికివ్వలేను. ఆమెలాంటి మణి నాకు పృథ్విలో దొరకదు. ఆమె స్మృతులు మరువలేను. నా బిడ్డల్ని అన్యాయం చేయలేను. ససేమిరా వినను" అని గగ్గోలు పెట్టాడు నాన్న.

తల్లీ చెల్లెలు రకరకాలుగా బోధించారు. పిల్లల కోసమే తామీ పని చేస్తున్నామని నచ్చ జెప్పారు. పిల్లల్ని లాలించాలన్నా, పాలించాలన్నా అది ఆడదానికే చెల్లుతుంది. నీ వల్లకాదు. మా మాట విను" "ఊఁ" అని వొప్పించి తప్పుకున్నారు ముగ్గురూ. నాన్న నా పక్కలో పడుకుని ఏడుస్తూ నా వొళ్ళంతా తాకుతూ, తల నిమురుతూ "అయ్యో! కాంచీ: నీ ముందురోజులెలా గడుస్తయ్యో? నీకన్యాయం జరిగితే ఆ దోషమంతా నాదేనమ్మా. ఇంత నిర్భాగ్యుడి కడుపున ఎందుకు పుట్టావమ్మా? నిన్ను కని పోయిన మీ అమ్మ ధన్యురాలు. మీ కష్టాలు, బాధలు చూడటానికే నేను బ్రతికున్నా. నేను కఠినాత్ముణ్ణి! పాపాత్ముణ్ణి! అసహాయుణ్ణి! పాపపు రొంపిలోకి దిగుతున్నానమ్మా" తలగడ కరుచుకొని పెద్దగా ఏడ్చాడు. ఆ రోజు తెల్లవార్లూ మళ్లీ మళ్లీ, కుళ్లి కుళ్లి ఏడుస్తూనే వున్నాడు మా నాన్న.

'నాన్నా! నేను తప్పు చేశానా? ఎందుకేడుస్తున్నావు? నీమాట వింటా! నీవేం చెయ్యమంటే అదే చేస్తా. నాకన్నీ నీవే నాన్నా" అంటూ చిన్న లంగాతో నాన్న కన్నీరు తుడిచాను. నీకో అమ్మ వస్తుందట. నా అదృషం, నా విధి ఎలా వుంటయ్యో?

రవి నా పెద్దన్న 5వ తరగతి, రంజన్ చిన్నన్న 4వ తరగతి చదువుతున్నారు. బంగారు నగల పనిలో వాళ్ని పెట్టాలని నాన్న ప్రియత్నం. చిన్న చదువు అంటే చదవను, లెఖ్ఖలు వ్రాయను వస్తే చాలని. అమ్మకు మాత్రం అన్నల్ని పెద్దగా చదివించి ఉద్యోగస్తుల్ని చెయ్యాలని ఉండేది. ఒకనాడు రవి మానాన్నతో "నాన్నా! నా స్నేహితు లందరూ పెద్ద చదువులకు పట్నం పోతున్నారు. నేను పెద్దయ్యాక నన్ను చదివించవా?" గోముగా అడిగాడు. "మీరు గొప్పవాళ్ళయ్యే యోగము ంటే, నాబోటి దౌర్భాగ్యుడికి పుట్టేవాళ్ళు కారు" గద్గద స్వరంతో అన్నాడు నాన్న. "పెద్ద ఉద్యోగంచేసి మంచి ఇల్లు కట్టిస్తా. టెర్లిన్ బట్టలు కట్టుకొందాం, స్కూటరు కొందాం" ఇంకా చె ప్ప బో తు ం టే "ఇకచాలు బాబు! మనవాండ్లకు తిండి, గుడ్డా, నీడా వుంటే చాలు. అవన్నీ కావాలంటే మీరు ఈ ఇంట్లో పు ట్టే వా రు కాదు." కండ్లంబడి నీళ్లు ధారగా కారుతున్నై నాన్నకు. ముక్కు పచ్చలారని బిడ్డలు సూర్య చంద్రుల్లాంటి అందం. మెరిసి పోయ్యే శరీర సోయగం. అన్నీ నా విశాలి పోలికలు, ఆమె గుణగణాలు వచ్చినై. ఏం చేసేది, అసమర్థుణ్ణి? పెన్నిధిలా సర్వ వేళలా ఆదుకునే నా భాగ్యరాణి పోయింది. అంటూ నాన్న విలపించేవాడు మళ్లీ.

మా రెండో అన్న రంజన్ మాత్రం దుడుకు పిండం. ఆటలంటే ఇష్టం. పార్కుకెళ్ళి రేడియోలో పాటలు వినడం, ఆటలు చూడడం అతనికిష్టం. తను పెద్ద ప్లేయరు కావాలని వుందని తన స్నేహితుడు రమేష్‌కంటే తను అన్నిట్లో ముందే వుంటానని అమ్మతో చిన్న చిన్న మాటలు చెప్తూవుండేవాడు. అమ్మ వాణ్ణి కౌగలించుకుని 'నిన్ను టెన్నిసు ప్లేయర్ కృష్ణన్ అంతవాణ్ణి చేయిస్తా. నా నగలన్నీ అమ్మి నిన్ను పట్నం పంపిస్తా' ననేది. ఆ మాట గుర్తుకొచ్చి బుంగమూతితో నాన్న నడుగుతూ అమ్మ మాట గుర్తుచేసేవాడు రోజూ.

అమ్మ పొయ్యాక మా ముగ్గురికీ సర్వస్వమూ నాన్నే అయినాడు. నేను బెంగపడతానని దుఃఖాన్ని మింగుతూ కథలు, కబుర్లు చెప్పేవాడు. నన్ను మరీ కనురెప్పలా చూచేవాడు. మళ్ళీ ఎన్నడూ తిట్టలేదు. కొట్టలేదు. నిద్రలోతప్ప నాన్న ధ్యాసంతా నామీదే వుండేది. అన్నలూ, నేనూ దొంగ - దొర ఆట, ఇసుకలో పిచ్చిక గూళ్ళ ఆట ఆడేవాళ్ళం. మా ప్రక్కింటి పిల్లలతో బొమ్మల పెండ్లి చేయుటం, చెమ్మ - చెక్క ఆట ఆడుకుంటూ వుండేదాన్ని. క్రమేపి అమ్మమీద బెంగ తగ్గుతోంది నాకు.

ఆ రోజు దీపావళి. ప్రతి గడపలో దీపాల దివ్వెలు వెలుగుతున్నై. ప్రతి ఇంటి ప్రహరీగోడలపై డిజైన్లలో మైనపు వత్తులు అందాన్నిస్తున్నై. ఇంటింటా పిల్లలు కేరింతలాడుతూ పోటీలు పడి టపాకాయులు కాలుస్తున్నారు. ఇరుగు పొరుగు అమ్మలంతా రంగు రంగుల పట్టుచీరెలు ధరించి తమ చిన్నారి

పాపల చేతులు పట్టుకుని చిన్న చిన్న కాకర కడ్డీలు, నిప్పు పుల్లలూ కాల్పిస్తున్నారు. ఆ కాంతిలో పిల్లలు కేరింతలు కొడ్తుంటే పెద్దలు ఉబ్బి తబ్బిబ్బవు తున్నారు. నాన్న మాత్రం ఎదా గుండె పడి కుప్పగా కూలిపోయి కూర్చున్నాడు. అన్న లిద్దరు దిగాలుపడి మౌనముద్ర వహించారు. నేను తలుపు చాటునుండి చిచ్చుబుడ్ల కాంతి చూస్తూ, టపాకాయల ధ్వని వింటూ అదోలా చూస్తున్నా. ఇంతలో మా అమ్మ 'అమ్మా! కాంచీ! కాల్చవా! నాదగ్గరికిరా, నీచెయ్యేది' అన్నట్లు కన్పించింది. ఆ దీపాల కాంతిలో మంటలో అమ్మ కాలిపోతూ అరుస్తున్న అమ్మ రూపాన్ని చూచి, అమ్మా! అమ్మా! అంటూ పరిగెత్తా. రోడ్డుమీద బోర్లాపడ్డా. ప్రక్కింటి పరశురామయ్యతాత వచ్చి ఎత్తుకుని వాళ్ళింటికి తీసుకెళ్ళి మతా బులు కాల్చమన్నాడు. 'అమ్మకావాలి. అమ్మేది? పెద్దగా ఏడ్చా. 'చూడమ్మా' అలా ఏడిస్తే అమ్మ నీ కింక కనబడదు. నీకు మళ్ళీ ఇంకో అమ్మ వస్తుంది. అమె చెప్పినట్లు వినాలి. ఆమే ఇక మీ అమ్మ. నాన్నని వేధించకు. మా ఇంట్లో వుంటావా? మల్లితో పువ్వొత్తులు కాల్చుకో' మాటలు చెప్తూ నా చేత తీపి తినిపించి అన్నలకు మిఠాయిఇచ్చి నాన్నను ఓదార్చి వెళ్ళాడు. అది మా మొదటి దీపావళి, అమ్మపోయాక.

నాన్న పెండ్లి చేసుకున్నాడని తెలిసి అమ్మమ్మ, పిన్ని వచ్చారు. 'అల్లుడుగారూ! మీతో ఒక మాటచెప్తా, మీరు మరోలా అనుకోపోతే. నా కుతురు భార్గవికి పిల్లలు లేరింకా. పిల్లల్ని మాతో పంపితే, అదీ నేనూ కనురెప్పల్లా వార్ని చూచుకుంటా' మని ప్రాధేయ పూర్వకంగా అడిగింది. పిన్నికూడా అనేక విధాల నచ్చ

చెప్పింది. 'మీ రెప్పుడు పంపమంటే అప్పుడు పంపుతా. కన్నబిడ్డలా చూస్తా. మీరీ శ్రమ పడలేరు. పిల్లలూ సుఖపడలేరు. మేము వారికి విద్యా బుద్ధులు నేర్పిస్తాం. వారి భవిష్యత్తు అంధకారం కాకూడదు. మా మీద విశ్వాసముంటే పంపండి' కన్నీరు కారుస్తూ అడిగింది అమ్మమ్మ. విధిలేక అంతకన్నా గత్యంతరంలేక.

మరునాడు 'సరే' నని ప్రయాణానికి తానుకూడా సిద్ధమైనాడు నాన్న. అమ్మమ్మతో మగపిల్లల్ని శలవలదాకా వుండిరమ్మని పంపాడు. పిన్నీ, తనూ నన్ను తీసుకుని రైలెక్కారు. పిల్లను తన నుండి దూరం పంపుతుంటే తన గుండె నెవరో వేరుచేసి ఎత్తుకెడు తున్నట్లుందని దారిపొడవునా దుఃఖిస్తునే వున్నాడు. నన్నురైలు దింపాడు. పిన్నికి వొప్పజెప్పి, వెళ్ళివస్తాననిచెప్పి, పిన్నిగారింట్లో నన్ను విడిచి వెళ్ళలేక వెళ్ళలేక, చెయ్యి వూపుతూ కనులొత్తు కుంటూ వెను తిరిగిచూస్తూ కను మరుగైనాడు నాన్న. కొద్దిసేపటికి మళ్ళీ తిరిగొచ్చి నన్ను కౌగలించుకొని 'భార్గవీ! కడుపులో కలియ బెడుతోందమ్మా, కాంచిని విడిచి బ్రతకలేనమ్మా! మరచిపోయ్యా, ఇవిగో' అని అమ్మవి రెండు బంగారు గాజులు, కాళ్ళ పట్టాలు, జడగంటలూ, సన్న గొలుసూ మూటకట్టి పిన్నిచేతిలో పెట్టి, నన్ను కావిలించుకొని వల వల ఏడ్చి, 'పరిస్థితులకు బానిసనై నీకు అమ్మకు తీరని ద్రోహం చేశానమ్మా! నన్ను మన్నించమ్మా, భార్గవీ. నీవే తల్లివి. వస్తానని కన్నీరు కారుస్తూ వెళ్ళిపొయ్యాడు నాన్న. అక్కపోయినా,దాని పిల్లలో అక్కను చూస్తున్నాను. అది మాత్రం నా పిల్లకాదా? పెంచుకుంటే మాత్రం పిల్లకాదా! కన్న

ప్రేమకంటే పెంచిన ప్రేమే గొప్పదంటారు. ఈ పిల్లనట్టింట్లో తిరుగుతోంటే మధురానుభూతి కల్గుతోంది. మనమే పెంచి పెద్దచేసి విద్యా బుద్ధులు చెప్పించి వివాహం చేద్దామండీ' భార్గవిపిన్ని బాబాయితో అన్నది.

'నాకూ అలాగేవుంది. ఆ పిల్ల ఇంట్లోవున్నా చాలు, ఇల్లు కళ కళ లాడుతోంది. చిదిపి దీపం పెట్టొచ్చు.' అన్నాడు బాబాయి. 'ఏ వండీ, దీనికీ వర్చస్సు ఎలా వచ్చిందో! నేనెక్కడా చూడలేదు, ఇలాంటి లావణ్యరాశిని. దీని జాతకం ఎలా వుంటుందో ?. ఏ ఇంటిని పునీతం చేస్తుందో. దీనికితగ్గ మన్మధుడసలున్నాడా' పిన్ని, బాబాయి సంభాషణలు రోజూ ఇలా మామూలుగాసాగేవి.

పిన్ని కథలు చెప్పేది. కొద్ది కొద్దిగా చదువు నేర్పేది. ఆడుకోనిచ్చేది. స్కూలుకు తనతో తీసుకెళ్ళేది. అందరికీ మాఅక్క బిడ్డ అనబోయి 'నా కూతురండీ' అని గర్వంగా నావంక చూసేది. నాన్నని మరపించి 2 సం॥లు నాతోటిదే లోకమన్నట్లు పెంచింది భార్గవి పిన్ని నన్ను.

అమ్మమ్మకు జబ్బుచేసింది. తాత ఉత్తరం వ్రాశాడు. పిన్ని వెడుతూ నన్ను తీసుకెళ్ళింది. ఒక నెల సెలవుపెట్టి ఇద్దరం వున్నాం.

"కాంచీ, నేను రేపువెడతాం నాన్నా" అమ్మకిప్పుడు బాగానే వుంది. ఎలానో శ్రమలేకుండా పనులన్నీ చేయించుకుని కాలక్షేపం చెయ్యండి మీ ఇద్దరూ, జాగ్రత్త!" భార్గవిపిన్ని ప్రయాణమైంది.

"భార్గవీ! కాంచిని వుంచి వెళ్ళమ్మా. ఇంట్లో కాస్త మాట మంతి పల్కేవాళ్ళు లేరు. మగపిల్లల్ని ఉంచమంటే వాళ్ళ నాన్న చేతికి తోడుకావాలని తీసుకెళ్ళాడు. "సరే"నని నన్ను విడిచి పోలేక పోలేక బాధగా వెళ్ళింది పిన్ని.

"కాంచీ అమ్మను నీలో చూస్తున్నానమ్మా. మళ్ళీ ఇంట్లో దీపమై వెలుగుతున్నావు. బాగా చదువుకోవాలి. భూదేవిలాంటి ఓర్పుండాలమ్మా. సముద్రం వుంది చూశావ్! అంత గాంభీర్యం రావాలమ్మా. మనిషికి విద్యేకాదు, వివేకం కావాలి. విజ్ఞానం అలవడాలి" విద్యతోపాటు నీతి, నడవడి, శాంతం, న్యాయం, ధర్మాలపై పాఠాలు చెప్పేవాడు మా దయానిధి తాత.

రోజూ స్కూలుకెళ్ళేదాన్ని. ఇంట్లో వారంపిల్లలతోపాటు నాకూ ప్రయివేటు చెప్పేవాడు తాత. అమ్మమ్మ ప్రాణాలు నామీదే వుండేవి. ముద్దాడేది. కబుర్లు చెప్పేది. "మా అమ్మ లక్షణాలు పుణికిపుచ్చుకున్నావు. కాని అమ్మ అకాలమరణానికి బలయింది. నీ అదృష్టం బాగావుండాలి. నీ జీవితం మూడు పువ్వులూ, ఆరు కాయలు కాయాలి. నీకేలోటు లేకుండా చూస్తాం. మీ నాన్న మాతో వుండాలేగాని" అనేది అమ్మమ్మ. ఆమెకు చేదోడు వాదోడుగా వుంటూ, చదువుకుంటూ అందరికీ తలలో నాల్కలాగా వుంటూ మరి మూడు సం॥లు గడిచినై.

"పిల్లని నాతో పంపండి మామగారూ! పిల్లకు 12 సం॥లు నిండినై. ఇంట్లోది ఇబ్బందిపడుతోంది. ముగ్గురు పిల్లల తల్లి. సాయం వుంటుంది తెమ్మన్నదండి" గోణిగాడు బద్రీనాథ్.

"నీ పిల్ల నీ ఇష్టం కాని దాన్ని విడిచి మేం బ్రతక లేమయ్యా" బాధను వ్యక్తంచేశాడు దయానిధి. "రవి, రంజన్ బాగున్నారాండీ! దసరా శలవులకు పంపండి అల్లుడుగారూ" తలుపుచాటునుండి అడిగింది అల్లుణ్ణి మా అమ్మమ్మ శాంతమ్మగారు.

"కూతురు పోయిన దుఃఖాన్ని ఈ పిల్ల రాకతో దిగమింగాం. మా కంటి వెలుగయిందీ పిల్ల. అది పోతే నే బ్రతకలేనంటే నమ్మండి, దానికేలోటు రానీయను" అన్నది అమ్మమ్మ నాన్నకు సమాధానంగా. "కాంచనను తీసుకెడదామని వచ్చానత్తగారు. చూచి బహుకాలమైంది" గద్గద స్వరంతో కోరాడు మా నాన్న.

నాన్నను చూచి 5 సం॥రాలయింది. ఉత్తరాలుమాత్రం వస్తూవుండేవి. సన్నగా చిక్కిపొయ్యాడు. పరుగెత్తుకెళ్ళి నాన్నను కౌగలించుకొని "రవి, రంజన్ ఎలావున్నారు నాన్నా? బాగా చదువుకుంటున్నారా? ఇలా వున్నావేం నాన్నా?" అంటుంటే "నాకేమమ్మ! బాగానేవున్నా" నంటూ నా తలపై ముద్దాడాడు. ఇంతలో అమ్మమ్మ వచ్చి.

"పిల్ల పెళ్లి పేరంటం చేస్తాం. మాకున్నది దానికే ఇస్తాం. మాకెవరున్నారు నాయనా" బ్రతిమాలుతూ అన్నది అమ్మమ్మ.

"సరేలెండి ఒక నెల వుంచుకొని శలవలు కాగానే తెస్తాను" మరి రెండురోజులున్నాడు మానాన్న, అమ్మమ్మగారింట్లో.

"వెడదాం బట్టలు తెచ్చుకో కాంచీ" పిల్ల ఏపుగా పెరిగింది చూడటానికి రెండు కళ్లు చాలేట్లులేవు. చక్కగా చదువు,

సంస్కారం అన్నీ నేర్పుతున్నారు. పిల్లని తీసుకెళ్లి ఆ కొంపలో వెయ్యటం అన్యాయంగా భావించాడు మా నాన్న. తాతయ్యతో వెంటనే తెచ్చి దింపుతానని మాట ఇచ్చాడు మానాన్న. "రామ్మా! బండివేళయింది పోదాం! నాన్న నన్ను పిలిచాడు.

తాతకు, అమ్మమ్మకు నమస్కరించా. తోటి విద్యార్థులకు, వారం పిల్లలకు వెళ్లివస్తానని చెప్పా. నా బట్టలు, పుస్తకాలు తీసుకొని నిలుచున్నాను. నాన్నతో బయలుదేరుతుంటే తాత, అమ్మమ్మ నిట్టూరుస్తూ చూస్తున్నారు. నాకు కాళ్లురాలా. మళ్లావచ్చి 'అమ్మమ్మా! నే పోను, ఇక్కడే వుంటా' నని కావిలించుకొన్నా. "వెళ్లి రామ్మా!" తల నిమురుతూ తాత అన్నాడు. వెళ్లలేక వెళ్లలేక నాన్నతో రాత్రికి మావూరు చేరా.

"ఏమి ధగధగా! ఏమి రూపురేఖలు! ఈ పిల్ల తన మగని కూతురేనా? నమ్మలేకున్నా. దాని తల్లి అందచందాలగురించి చుట్టుపక్కల వాళ్లు చెప్తుంటే ఏమోననుకున్నా. దీన్ని ఇన్నాళ్లూ నా కంటపడకుండా దాచాడు, చూస్తే ఏడుస్తానని. దానిప్రక్కన నా పిల్లలు బలాదూరు. దిబ్బముక్కులు, మొద్దుపెదాలు, నల్లరూపాలు, ఆంబోతెద్దుల్లాగా వీళ్లెక్కడా? అదెక్కడా! నవనవ లాడుతూ మెరిసిపోతుంది!" ఈర్ష్య అసూయలతో దేహమంతా దహించింది నా సవితితల్లి కామినికి.

ఆదినుండి కామినితో కాపురం రోతగా వుండేదట నాన్నకు. ఆమె అడుగుపెట్టినప్పట్నించీ ఇల్లొక నరకమయిందతనికి.

నగల్లేవనీ, దాసదాసీలు లేరనీ, వయస్సుమళ్ళిన మగడనీ ఏదో ఓ దానికి తగాదా పెట్టుకొనేది. సభ్యత, సంస్కారం అనే అక్షరాలు ఆమె డిక్షనరీలోనే లేవు. భర్త వివేకం, విజ్ఞానం అర్థంచేసుకోటానికైనా ఏనాడూ ప్రయత్నించి ఎరుగని కుచ్ఛితురాలు. ఖలునకు నిలువెల్ల విషముగదరా సుమతీ! ఈమెపట్ల అక్షరాల నిజం. ఎన్నివిధాల నీతి, నిజాయితీ, సభ్యత, సంస్కారాలపై ఆమెకు ఆసక్తి కలిగించాలని ప్రయత్నించినా నాన్న విఫలుడైనాడు. నాన్న అందుకు ప్రయత్నించినా మాట్లుపడ్డ పాత ఇత్తడి బిందెలా వుండేది ఆమె నడవడి. ఉత్సాహం, సంతోషం నశించిన నాన్న విరాగిగా బ్రతుకుసాగించేవాడు. విషసర్పంలాంటి కామిని మేడిపండులాంటి యుగంధర్ చేరి తననీగతికి తెచ్చారని లోలోన కృంగి కృశిస్తుండేవాడు నాన్న. చెవిపోటు చాలక రోకటిపోటు న్నట్లు ఈ 5, 6 సం॥రాల కాలంలో మళ్ళీ ముగ్గురు సంతానం మాత్రం కలిగారు. మూలిగే నక్కపై తాటికాయ పడ్డట్టయింది మానాన్నపని. ఈ విషయాలన్నీ అన్నలద్వారా తర్వాత తెలిసికొన్నా నేను.

"నాన్నా! అన్నలేరి? నా కళ్ళు అన్నలకై వెతుకుతున్నై. అటు ఇటు తేరిపారచూచా! వాళ్ళనిచూచి కొన్ని సంవత్సరాలయింది. ఏకగర్భవాసులమైనా ఒకచోట మన జాలని నిర్భాగ్యులం కదా! " రవీ, రంజన్ ఎక్కడికెళ్లారు నాన్నా!'' జాలిగా అడిగా. దొడ్డివైపు కంటితో సౌజ్ఞచేసి చూపాడు నాన్న. రెండు అంగలలో పరిగెత్తి'' అన్నా! అన్నా! అని అరిచా. నీళ్లుతోడిపోస్తున్నాడు రవి. గేదె పేడ తీస్తున్నాడు రంజన్. కావిలించుకున్నా నిద్దరినీ.

నా కన్నీళ్ళు బొటబొటా కారినై. రెండు జామకాయలు కోసి నా చేతిలో పెట్టారు వాళ్ళు.

'ఇలా నల్లపడి పోయ్యారేం. ఒక్కసారైనా తాతగారింటి కెందుకు రాలా ? చదువు, సంధ్యా లేదా ! తాత ఎందరికో విద్యా బుద్ధులు చెప్తున్నాడు. నాతో రండి. మీరూ ఇలాగై పోయారని తెలియదు మాకు. తాతగారు ఎన్నో ఉత్తరాలు వ్రాశారు. మీనుండీ మాకే సమాధానం రాలా. ఇప్పటికైనా వాస్తే చక్కగా చదువు కుందురు.' వెంట వెంట ప్రశ్నల వర్షం కురిపించా నేనప్పుడు.

ఇద్దరూ గుడ్లంట నీరు కార్చారు. తమ దుర్దశను కళ్ళతో చెప్పారు. నా కప్పుడర్థమైంది ఇంటి పరిస్థితి. "అన్నా ! అమ్మ పొయ్యాక మనం ముగ్గురం రాత్రుళ్ళు అమ్మ మాటలు, చేష్టలు నెమరేసుకునే వాళ్ళం. అమ్మ చావే మనకి వియోగం కల్పించింది. నాన్నతో చెప్తా, మరి మీరు నాతో వస్తారా ? లేదా ?" "కాంచీ, ఆ రాత్రి అమ్మ కాలి పో తూ రవీ, రంజన్, కాంచీ ! మీరు జాగ్రత్త అంటూ మన్ని కలిసి మెలిసి వుండమని చెప్పింది కూడా." వెనుకటి సంఘటనలన్నీ క థ లు గా అన్నలిద్దరితో మాట్లాడుతున్నా. ఇంతలో—

"ఏరా కబుర్లలో పడ్డారు. చం టి దా ని కి నీళ్ళుపోసి బట్ట లెయ్యండి. పాలు పితికి కాచండి. పని మనిషి రాలేదీరోజు. కాస్త గిన్నెలు కడిగితే తప్పా ? మన పని మనం చేసుకోవచ్చు. పదండి. ముప్పొద్దులా మూడు కంచాలు లేవదీస్తారు. ఈడలేక

తల ప్రాణం తోక కొస్తోంది. ఈ సంసారంలో పడి ఏనాడు కడుపునిండా తిండీ, కంటినిండా నిద్రా ఎరుగను. నా ఖర్మకొద్ది చేశారీ పెళ్ళి." తిడుతూ, సాధిస్తూనే వుంది కామిని.

"ఎందుకండీ! అలా అరుస్తారు? వాళ్ళేం చేశారిప్పుడు?" వాళ్ళ బాధ చూడలేక ఆమెనడిగా.

"ఓయబ్బ! నంగనాచివి. మూరెడు పెట్టకు బారెడు తోకట! అడుగు పెడుతూనే సవతి తల్లి పోరు ప్రచారానికొచ్చావా? పిట్ట కొంచెం కూత ఘన మన్నట్లు! పెద్దలంటే వినయ విధేయత లుండాలా? వద్దా? పిల్లల్ని గదమాయించే హక్కు లేదా అంట నాకు? పెద్ద నీతులు చెప్పొస్తోంది. కూసే గాడిదొచ్చి మేసే గాడిదను చెడగొట్టిందట. అలావుంది ఈ ముచ్చులాడి వ్యవహారం" అంటూ మెటికలు విరుస్తూ మూతి ముడిచింది మా సవతి తల్లి కామిని.

నా మనస్సప్పుడు వికావికలై చెదిరి పోయింది. నా నోట మాట రాలా.

"ఇన్ని సంవత్సరాల తర్వాత నా పిల్ల గడపలో కాలు పెట్టింది. అప్పుడే శాపనార్థా లేమిటమ్మా! కాస్త దాన్ని తెప్పరిల్లనీ" పిల్ల బెంబేలెత్తుతుందని తిట్లకు అడ్డుతగిలాడు నాన్న.

"ఇదిగో నా పిల్లకూ, దానికీ తేడా చూపిస్తున్నావు. నా పిల్ల నేనాడైనా వెనకేసుకొచ్చావా? ఒక కంట్లో బెల్లం, ఒక కంట్లో సున్నం. నీకే చెల్లుతుంది" పెద్దగా అరుస్తూ తగాదాకై

మీది మీది కొస్తోంది కామిని. నాలుగు రోజులలా గడిచినై. ఇంతలో మా సవతి తల్లి తమ్ముడు యుగంధర్ ఊడిపడ్డాడొకనాడు. అతనొక జల్సారాయుడు, షోకిలా, భ్రటాజులా వుంది అతని వాలకం.

"ఏయ్ పిల్లా సినిమాకొస్తావా? "ప్రేమ లీలలు" మహాధ్భుతంగా వుంది" ఓరచూపులు చూస్తూ అడిగాడు నన్ను యుగంధర్. నేనొచ్చినప్పట్నించి నన్ను వెన్నాడుతూ, వెకిలి నవ్వులు నవ్వుతూ చుట్టుకొని నా వెంట వెంట తిరగటం మొదలెట్టాడు. నాకు ఒళ్ళంతా కారం పూచినట్లుండేది. నాన్నతో చెబ్దామనీ, మళ్ళా పిన్ని నాన్నని తిడుతుందనీ చెప్పలేకపొయ్యా. అతను సముద్రంలో తిమింగలం లాగుండేవాడు నా కంటికి. తుంటరి వెధవనీ, అతని కన్ను నామీద పడిందని గ్రహించా.

ఇప్పుడా ఇంటి యాజమాన్యం కామినిది; పెత్తనం ఆమె తమ్ముడు యుగంధర్‌దీ అయింది. తన తోటి భరణంగా తెచ్చింది తమ్ముణ్ణి. వాడికి రోజూ తిండి పెట్టి సిగరెట్లకు, సీసాలకు రూపాయిలు ఇవ్వాలి. ముగ్గురు పిల్లలకూ, తిండి ఖర్చులు పెరిగినై. మా నాన్న సంపాదన చాలక ఇల్లుకాస్తా అమ్మించింది. సవతి పిల్లలిద్దర్నీ రెండు కొట్లల్లో వుద్యోగాలకు పెట్టి, వారి సంపాదన పుచ్చుకొని కలో గంజో వారికి చావకుండా పోస్తోంది. మా నాన్నకు, అన్నయ్యలకు ఆ ఇంట్లో ఆలనా పాలనా లేకుండా పోయింది. పోషణ అసలే లేదు. పైగా రోజూ తిట్లు, శాపనార్థాలు తినాలి.

ఒకరోజు "అక్కా ఇదిగో బహుమానం పట్టుచీర తెచ్చా"
పూలు, పండ్లు, మిఠాయిలతోసహా చీర పాకెట్ చేతికిచ్చాడు ధర్.
తన కళ్ళను తానే నమ్మలేకపోయింది కామిని. "ఏరా తమ్ముడూ!
ఎంత బాగుంది చీర. ఏదైనా పెద్ద ఉద్యోగంలో చేరావా?
జీతమెంత?" లాలనగా అడిగింది మాపిన్ని కామిని.

"అక్కా నీకో మాట చెప్పనా! నిన్నొకటి అడగనా?"
అన్నాడు గోముగా యుగంధర్.

"అడగరా తమ్ముడూ, కాదంటానా! మనిద్దరి బంధం
ఈనాటిది కాదురా! అదేమిటో నీమీద ప్రేమ నా పిల్లల మీద
కూడా లేదురా" ఉబ్బి తబ్బిబ్బై అన్నది కామిని.

"నాకు నీ విషయం తెల్సు అక్కా! కాని నేనిప్పుడు కోరే
విషయం అంత తేలికగా నెరవేరేది కాదక్కా." రహస్యంగా
అక్కతో అంటున్నాడు.

"నీవు భయపడకు తమ్ముడూ. అదేదైనా సరేకానీ
తీరుస్తానని హామీ ఇస్తున్నా. ఆఖరికి నా తల తాకట్టు పెట్టి
అయినాసరే

"నాకా ధైర్యముండబట్టే నిన్ను యాచించానక్కా."

"తికమక పెట్టక చెప్పరా బాబు."

"కొత్త పిల్లని తిట్టవద్దక్కా! పిల్ల మంచి పసందుగా
వుంది. అదరగొడితే పారిపోద్ది. నేనిప్పుడొక సుడిగుండంలో
ఇరుకున్నానక్కా! నీ దయ, నా ప్రాప్తం' జోకు విసిరాడు ధర్.

"ఏరా! ఏమిటిగోల నా కర్థంకాలా. సరిగా చెప్పరా"

'దాన్ని ఎలాగైనా ఇక్కడే ఉండేలా చూడవా అక్కా? ఆ అందాలరాశిని నేను పెళ్లాడాలక్కా. అది లేకపోతే నే చస్తా. బావనొప్పించి దాన్నెలాగైనా నా దాన్ని చేసే భారం నీది. లేదా బావకు చెప్పకుండా రహస్యంగానైనా పెళ్లి చేయించాలి. ఆ భారమంతా నీదే, దాన్ని ఇక్కడే ఉంచేలా బావతో చెప్పి చేయించు. దానితో నా పెళ్లి కాకపోతే నాకు మరణమే శరణ్యం. చేయిస్తే నీ వొళ్లంతా బంగారు తొడుపు చేయిస్తా, దీనికేదైనా ప్లాను వెయ్యి. ఇదంతా రెండో కంటివాడికి తెలియకూడదు!" అక్క కామిని చెవిలో చెప్పటం చూచా. నా విషయమేనని నేను గ్రహించి బాధపడ్డా.

"పాతికేళ్ళ నీకు. పన్నెండేళ్ళ ఆ పిల్లని స్తోడా దాని తండ్రి" అనుమానిస్తూ అడిగింది కామిని.

'బావ నీచేతిలో కీలుబొమ్మ, కాదటే! చెప్పి వినిపించలేవా?'

'ఏమోనబ్బా! ఇది చాలా అసాధ్యమైన పని. ఆయన నువ్వనుకున్నంత అమాయకుడేంకాదు. గతిలేక కాపురంచేస్తున్నాడే కాని, మనసంతా ఆ చచ్చినదానిమీద, దాని పిల్లలమీదేరా. చాలా పేచీలుపడి, ఉపవాసాలుచేసి ఈ మాత్రం స్థానం సంపాదించగల్గా'

'అయితే నన్ను చంపుకుంటావా?' ఏడుపు మొగం పెట్టాడు ధర్.

'ఆలోచించి ఒక పన్నాగం పన్నుతారా. సమయం వచ్చినప్పుడు చూచి కాటేస్తా. అంతేకాని, అంత తేలిగ్గా ఆ తండ్రిని

పిల్లల్ని వొదులుతానా? ఎలాగూ నీ విచ్చే ప్రతిఫలం వుండనే వుంది. ఐతే ఒక సంగతి అడుగుతా చెప్తావా?'

'ఒకటేమిటీ? లక్ష ప్రశ్నలడుగు చేప్తానక్కా. నీ కన్నా నా కాప్తులెవరున్నారు? అమ్మ ంత దానివి' ఉబ్బిస్తూ చెప్పాడు ధర్.

"నా కేదో డబ్బు సాయం చేస్తానంటున్నావుగదా, ఎలా తెస్తావు? అదేదో నాకు ఆతురతగావుందిరా? కాస్త వివరంగా చెప్పరా!

"అదా, వినుచెప్తా. కానీ ఈ పరమ రహస్యాన్ని పరమాత్ముడికి చెప్పరాదు సుమా!

"మనిద్దరి అనుబంధం నీకు తెలియదా, తమ్ముడూ?"

"అమ్మణ్ణికి నే నంటే పంచ ప్రాణాలు. ఆమె నాకు పైస లిస్తోంది.

నమ్మినవార్ని మోసం చేయుటలో సిద్ధహస్తుడు యుగంధర్. దుర్గుణాలన్నీ సంఘంబులై ధర్‌లో ప్రవేశించినవా! అన్నట్లుండతని పైఖరి. హమేషా కారా కిల్లీ కావాలి. సిగరెట్లకు తెంపులేదు. ఎంతకైనా సాహసిస్తాడు. వ్యక్తుల ప్రాణాలతో, మానాలతో చెలగాటం అతని జీవితధ్యేయం. నీచాతి నీచమైన 'శాడిష్టు' మనస్తత్వం అతని నరనరాన జీర్ణించిపోయింది. పాప భీతిలేదు. దయా దాక్షిణ్యా లంటేనే అతని కపహాస్యం. పొట్ట పొడిచినా అక్షర

జ్ఞానంలేని వింత పశువు; విద్యా విహీనుడు. వాడెక్కడ కాలుపెడితే అప్పుడే సర్వ నాశనం. కొంపలార్పటంలో వాడికి వాడే సాటి. వేష భాషల్లో అగ్రగణ్యుడు. మేడిపండుచూడ మేలిమైయుండు పొట్ట విచ్చిచూడ పురుగులుండు ననేది ధర్ పట్ల సత్యదూరంకాదు. ఒక్క మాటలో చెప్పాలంటే అతడు అపరగిరీశం అంటే అపహాస్యం కాదు. అలాంటి ధర్, పేరాశగల కామిని ఒకచోట చేరారంటే ఇక పట్ట పగలే నక్షత్రాలు పొడుస్తాయి.

మర్నాటినుండి కామిని ప్లేటు మార్చింది. నాపై ప్రేమఉట్టి పడుతున్నట్లు మాట్లాడేది. నాకు పూలు, రిబ్బన్లు, గాజులు తెప్పించింది. పిండివంటలు, మిఠాయి రోజూ తెప్పించిపెట్టేది. ఏ పనీ చెయ్యనిచ్చేదికాదు. అన్నలకు ఆశ్చర్యంగావుంది. మెల్లగా నాతో 'కాంచీ; ఇదేదో పన్నాగం, జాగ్రత్త!' అన్నా రొకనాడు.

'ఏదైనా కానీ ఆమె మనకు అమ్మలాంటిది. మనం ఆమెను గౌరవించాలి' సహజమైన స్వరంతో అన్నాను.

'కాదు కాంచీ! మమ్మల్ని నిప్పులపై వేపుతోంది. నాన్నని తిట్టి నానా గోల చేస్తోంది. నెలకు పది రోజులు నాన్న అన్నమే తినడు. నాన్న ఆరోగ్యం చెడిపోతోందే కాంచీ!' రవి, రంజన్ బిక్కమొగాలేశారు.

'నాన్నని మీరైనా కనిపెట్టి వుండండిరా!'

'అందుకే మేమిక్కడపడిఉండి కుక్కల్లా బ్రతుకుతున్నాం చెల్లీ' అన్నాడు రవి.

'నీతో తాతగారింటికివస్తా! నాన్నతో చెప్పి తీసుకెళ్ళవా? ఎన్నేళ్ళు నేనిలా దిక్కుమాలిన పక్షిలావుండాలి? తీసుకెళ్ళకపోతే పారిపోతా! ఊ!! తెలిసిందా' బెదిరించాడు రంజన్.

'అలాగేలే చూద్దాం' అన్నానప్పుడు.

మా నాన్నతో మారు తల్లి మాటలు వినపడుతున్నాయి. ఆ రోజు సాయంత్రం.

'మన పిల్ల మనకు బరువా? నా పిల్లల్తో కొంచిగూడా ఇక్కడే వుంటుంది. పంపొద్దండి' బ్రతిమాలే ధోరణిలో అడిగింది కామిని.

'శలవలు కాగానేతెచ్చిదింపుతానని మామగారికి మాటఇచ్చా. మధ్యలో ఆపితే మాటాపోతోంది. దానిచదువూ నాశనమౌతుంది. నా కిష్టంలేదు.' ఆమె మాటల చాతుర్యానికి అచ్చెరువందాడు నాన్న. 'ఆడపిల్లలకు పెద్ద చదు వెందుకంటే? ఉద్యోగం చేస్తుందా! ఊళ్ళేలుతుందా. ఏ నాటికైనా పెళ్ళిచేసి పంపబడేదే కదా!' తికమక పడ్డాడు నాన్న. అర్థంకాలా ఆమె వైఖరి. తల్లి లేని పిల్లగదా అని దయ కలిగిందేమోననుకున్నాడు. గుణవంతుల కన్నీ మంచిగానే కన్పడతై. దుష్టులకెప్పుడూ దురాలోచనే వుంటుందికదా! అలాగే నాన్నకామె కుచ్చిత ఆలోచన అర్థంకాలా. ఆ రోజు శనివారం వచ్చింది, నాన్నదగ్గరికెళ్ళి.

'నాన్నా! వెడదామా! రేపు ఆదివారంకదా! అన్నాను శలవలు కాగానే.

"పిన్ని వుండమంటోందమ్మా, వుండవా?" పిల్లని పంపలేక, విడిచి వుండలేక అన్నాడు నాన్న. "కానీ నీ ఇష్టం" మన్నట్లున్నదా ధ్వని. తనూ పిల్లలూ ఎలాగో రంపపుకోత అనుభవిస్తున్నారు. ముక్కు పచ్చలారని ఆ పిల్లైనా సుఖపడాలని తండ్రి అభిలాష.

'నా చదువు పోతుంది నాన్నా! తాతా, అమ్మమ్మ నే లేకపోతే కృంగి కృశిస్తారు నాన్నా!' రుద్ధ కంఠంతో అన్నాను. నా కన్నీళ్ళకు ద్రవీభూతుడై నాడు నాన్న.

'అమ్మా, కాంచీ! నీకు నే నెలాగో దూరమయ్యాను. నీ ముద్దు ముచ్చట చూచే భాగ్యానికి నోచుకోలేదు. ఆ వృద్ధులవల్ల నీవు వృద్ధి పొందావు. గుణవతివి, విద్యావతివి అయ్యావు. వారిని ఆనంద పరచటం మన కర్తవ్యం.' ఆ పైన మాట పెగల్లా. నాన్నకు, అమ్మ జ్ఞాపకమొచ్చి నట్లుంది. కన్నీళ్ళు తిరిగినై నాన్న కళ్ళల్లో.

'నాతో అన్నల్ని పంపవా నాన్నా! వాళ్ళు ఆ మహా యోగ్యుల ఆశ్రమంలో పెరిగితే విద్యా వివేకంగల వుత్తమ పౌరు లౌతాయి. దూర తీరాలనుండి బీదా బిక్కా తేడా లేకుండా వచ్చి చదువు, సంస్కృతి పొంది పోతున్నారెందరో, నా మాట కాదనకు నాన్నా' అని మళ్ళా అడిగా. 'తగిన అవకాశాన్ని చూచి వాళ్ళని పంపుతానమ్మా.' అని నా కళ్ళలోకి దీనంగా చూచాడు. ఆ చూపుల్లో 'నేనశక్తుణ్ణమ్మా! నన్ను క్షమించు తల్లీ, అనే బాధ దృగ్గోచర మయింది నాకు.

'ఈ సారి తాత దగ్గర నన్ను దింపి నీవు ఒక వారము వుండి వెళ్ళాలి. రేపు ఉదయం 7 గంటలకు రైలు. మళ్ళీ పిన్నికి నా మీద కోపం రాకముందే వెళ్ళటం మంచిదీ. సరేనా నాన్న!' ఆ రోజు రాత్రంతా, అన్నత్తో అనేక ఖబుర్లుచెప్పా! తాతగారింట్లో సంఘటనలు, భార్గవి పిన్నిగారి వూళ్ళో విశేషాలు, విద్యార్థులూ, తనూ ఎలా వుండేదిఅన్ని విషయాలు చెప్పాను. నిద్రించేముందు చంద్రం రూపం కళ్ళలో తళుక్కున మెరిసిం దొకసారి.

## 6

'చంద్రం కొద్ది రోజుల్లో మనం విడిపోతామా ?' గద్గద స్వరంతో అడిగాను. మిన్ను విరిగి మీద పడ్డట్టయింది చంద్రానికి.

'నాకదే చింతగావుంది కాంచనా ! మన అనుబంధం శాశ్వతంగా వుండాలని, అది సాధ్యామా ! అని రోజూ ఆలోచిస్తున్నా' బాధతో జవాబిచ్చాడు చంద్రం.

'మనసిచ్చి దూరమౌతున్నావు నీవు. మనసిచ్చి బాధపడుతున్నాను నేను' 'అలా అనకు కాంచనా ! ఇక్కడి చదువు స్కూల్ ఫైనల్‌తో ఆఖరు. నేను పట్నంపోయి పై చదువులు చదివి బ్రతుకు తెరువు చూచుకోవాలికదా ? ఈఆరు సంవత్సరాల కాలంలో మనిద్దరి ప్రేమానురాగాలు విడలేనంతగా అభివృద్ధి చెందాయి. ఈ నాడు ఏలా ? ఏం చేద్దాం ? అనే తపనతో కృంగి కృశించి పోతున్నా. నా మాట నమ్మవా ?' మరి మాట పెగల్లా చంద్రానికి.

'నాకు నీ విషయం తెలియక కాదు చంద్రం ! నీవు వేదనావని అలా నిష్టూరంగా మాట్లాడా. ఇద్దరం ఒకే స్థితిలో వున్నాం'

'ఏడుస్తున్నావా కాంచనా!'

'లేదు, కంట్లో నలుసు పడింది చంద్రం.'

'చంద్రం నిజంగా చంద్రుడే. చల్లని దయ, ప్రేమా, అనురాగం కలవాడు. నిండు కుండ. స్వార్థత్యాగి. నిష్కపటి. సప్త జన్మ లెత్తినా అలాంటి వ్యక్తి లభించుట దుర్లభం. నా అదృష్టం ఎలావుందో! వెడతాడే. ఏం చేసేది?' తహ తహ లాడుతోంది నా మనస్సు. ఆ రోజు స్కూలు నుండి వచ్చా. చంద్రం ప్రయాణం విషయం గుర్తుకొచ్చి గుండె ఝల్లు మంది. ఆలోచించి ఆలోచించి ఎలాగైనా సరే చంద్రంతో శాశ్వత అనుబంధం - అదే వివాహం కావాలని నిర్ణయించుకున్నా.

'అందాలరాశి, చంపకు చారెడేసి కళ్ళు, పున్నమి చంద్రుని అందం. సహజ సద్గుణవతి కాంచన యెక్కడ? సామాన్య వ్యక్తిని నే నెక్కడ? తన కంతటి అదృష్టమా! ఆమె ఏ ఇంటిని పునీతం చేస్తుందో! కాంచన వెంత అద్భుత నేత్రాలు. అవి చిన్నవా? పెద్దవా? నల్లనివా? ఆ కళ్ళలో నిష్కాపట్యం గోచరిస్తుంది. వాటిలో తడబాటులేదు: ప్రశాంతమైనవి. ఆమె మందహాసంలో నవరసాలు తొణికిసలాడతై. ఆమెతో నాకు వివాహ మయ్యే యోగ్యత వుందో లేదో? అంతా భ్రమేనా? తాతగారేమంటారు! వారికి ద్రోహం చెయ్యలేను. తిన్నింటి వాసాలు లెక్కపెట్టే కృతఘ్నత పనికిరాదు, మధనపడుతున్నాడు.

'ఎదురుగా కన్నెపిల్ల వుంటే ఏమిటో అంత పరాకు. ఎవరికోసమో ఆ తపన. కొంచం తెల్సుకోవచ్చా!' కొంటెగా చూచి

కిల కిలా నవ్వింది కాంచన. ఉలిక్కి పడ్డాడు చంద్రం. "నా నిర్ణయాన్ని రాజావారు తెల్సుకుంటారా ?" పరిపక్వమైన ఆమె యవ్వనం, పరిపూర్ణమైన ఆమె అనురాగం చంద్రాన్ని ఆహ్వానిస్తున్నట్లుందా ధ్వని.

'తమరు ఏ సుందరి జీవిత భాగస్వాములవుతారు ? ఏ మందగమన ఆలింగన పరిష్వంగంలో తేలియాడుతారో సెలవిస్తారా' 'కోరుకున్న ప్రియురాలు లభించే భాగ్యం అందరికీ అబ్బుతుందా? కాంచీ ! కలలు కంటాం, కాని కల నిజమయ్యే అదృష్టవంతులు అరుదే కదా !'

'వారిలో నీ వుండకూడదా?'

'ఉంటే నేను కుబేరుని కన్నా భాగ్యశాలిని అవుతా'

రెండు వేళ్ళు చూపించి 'ఏ వేలు కావాలో కొరుకో' అంది కాంచి.

'మరీ చిలిపి పిల్ల వౌతున్నా' వని అంటూ చూపుడు వేలు పట్టుకున్నాడు చంద్రం.

"మనిద్దరం భార్యా భర్తలం" అంటూ చెంగున దూకి చంద్రాన్ని కావిటేసుకుంది కాంచన.

"అమ్మ దొంగా ! ఎంత నాటకమాడా" వంటూ కాంచనను హృదయానికి హత్తుకున్నాడు చంద్రం. అలా ఎంత సేపున్నారో ! వారికి ప్రపంచ జ్ఞానమేపోయి మరోలోకంలో కలలు గంటూ విహరిస్తున్నారు.

"కాంచీ!" వారికా పిలుపు వినిపించలా.

'చంద్రం!' హెచ్చుస్వరంతో పల్కాడు మళ్ళీ దయానిధి. ఇద్దరూ త్రుళ్ళిపడి విడిపడ్డారు.

ఎదురుగా దయానిధి నిలబడ్డాడు. భయంతో గడ గడ వణికి పోయింది భీతహరిణేక్షణలాగా కాంచన. 'తాతయ్యా! మన్నించవా అంది.'

చంద్రం కాళ్ళక్రింది భూమి కృంగిపోతోంది. కళ్ళు తిరిగి పోతున్నై. కృతఘ్నుణ్ణి, గురు ద్రోహిని—అనుకుంటూ తల పట్టు కున్నాడు. శరీరమంతా కంపించి పోతున్నది. చమటలుపడుతోంది. నిశ్చేష్టుడై 'మాష్టారూ మన్నించండి. స్వామిద్రోహిని. నా కే శిక్ష విధించినా అర్హుణ్ణే' పాదాలపై పడ్డాడు చంద్రం.

'జీవితానుభవం కలవాణ్ణి. అర్థం చేసుకోగల నమ్మా! మన సిచ్చినవాణ్ణి తాకితే తప్పు లేదమ్మా! వివాహం అంటే వొండొరుల అన్యోన్యం, ఆప్యాయతల మీద జరగాలి. అది లేని పెళ్లి వ్యభి చారంతో సమానం. మానసికంగా మీ రిద్దరూ మనసిచ్చి పుచ్చు కున్ననాడే భార్యాభర్తలైనారు. ఇక బాహ్యంగా జరిగే దానికి నేను విలువ ఇవ్వనమ్మా! శాశ్వతమైన అనిర్వచనీయా నందాన్నిచ్చేది వివాహం. దానికి వధూ వరులు తప్ప అన్యుల ప్రమేయం వుండరాదు. మీ ఇద్దరూ రూప వయో గుణాలలో అద్వితీయులు. మిమ్మల్నిద్దర్నీ ఏకంచేసి దీవించి పంపుతానమ్మా! దానికింతగా భయపడాల్సిం దేముందోయ్ చంద్రం.' మా ఇద్దర్నీ పిరికి పందలు కావద్దు. ధైర్యంగా వుండమని సలహా చెప్పాడు దయానిధి తాతయ్య.

'నీ సైజం తెల్సు తాతయ్యా, అమ్మ పోయినా నీ ఆత్మీయతలో ఈ ఏడేళ్లూ ఏ లోపం లేకుండా పెరిగాను. నీ వల్ల లోక జ్ఞానం పొందాను. నీకు ఋణపడివున్నాను తాతయ్యా!'

'బొందిలో ప్రాణముండగా ఏ జీవినీ బాధించనమ్మా! చంద్రం నా బిడ్డ లాంటి వాడివి, అలా........

"మాష్టారు! మీ కన్నా వుత్తమ పురుషు లుంటారా? మీ ఆశ్రయం, ఆశీర్వచనం, అండదండలవల్లే నేనొక వ్యక్తిగా మలచబడ్డాను. మీకు జన్మ జన్మలకు కృతజ్ఞుడను మాష్టారూ' కన్నులు చెమ్మగిల్లాయి చంద్రానికి, "నీతి, నిజాయితీలకు, సత్యాహింసలకు ప్రతిరూపమే నీవు. నీ లాంటివాడు నా శిష్యుడవటం నా అదృష్టం చంద్రం. సద్గురు వెప్పుడూ తగిన శిష్యుని కొరకన్వేషిస్తాడు నాయనా!' శిష్య వాత్సల్యంతో చంద్రానికి ఆత్మస్థయిర్యాన్ని అందించాడు మా తాతయ్య.

'తాతయ్యా' ఏదో చెప్పాలని వుంది, చెప్ప లేకపోయా. కంఠంలో వణుకు పుట్టిందప్పుడు.

'కాంచీ' ఆ పిలుపులో అనురాగం. ఆప్యాయత తొణికిసలాడుతున్నై.

"నా కంతా తెల్సునమ్మా! మీ ఇద్దరిగురించి ఆలోచిస్తూనే వున్నా.'

అదిరిపోయానప్పుడు. ఏ మనితెల్సు! ప్రశ్నించ బోయింది కాంచన! కాని భావాలు గొంతులోనే నిలిచిపోయినై. మాట పెగిలి చాలా.

'మీ ఇద్దరూ గాఢంగా ప్రేమించుకున్న ప్రేమికులని నాకు తెలుసు. నా ఆశీర్వచనం మీకు సర్వదా లభిస్తుంది.' ఆనందంతో వుక్కిరి బిక్కిరయింది కాంచన ; స్థిమిత పడ్డాడు చంద్రం.

'చంద్రం! కాంచన తల్లి లేని పిల్ల. తగిన యోగ్యుణ్ణి చూచి దరి చేర్చితే నా బాధ్యత తీరుతుంది. చ ని పో యి న నా బిడ్డ....' అంతటి వివేక వంతుడికి సైతం కన్నీరొలికింది.

'ఇది కలయా! ఇలయా! తాము విన్నది నిజమా! తాత ఎంత ఉదారుడు!" కాంచన చంద్రాలొకర్నొకరు చూచుకున్నారు. ధైర్యం వచ్చింది.

ఇద్దర్నీ అక్కున చేర్చుకున్నాడు దయానిది. ఇద్దరి తలలూ నిమురుతూ' మీ ఇద్దరికి వివాహంచేసి మళ్ళా ఇలాగే ఆశీర్వదించి పంపుతా. ఆనంద భాష్పాలురాలిసై ఆ వృద్ధునికి. తాత సమ్మతి విన్న వారి గుండెల్లో బరువు తగ్గింది. ఏదో మహా సామ్రాజ్యాన్ని అవలీలగా గెల్చినంత అమందానంద భరితు లయ్యారు కాంచన చంద్రాలు.

# 7

చంద్రం తండ్రి రామనాధం మధ్య తరగతి కుటుంబీకుడు. దయానిధి క్లాసుమేటు. అతని ఆధ్వర్యంలో ఒక్కగా నొక్క తన బిడ్డను పెరగనిస్తే గొప్ప సంస్కారి కాగలడని వప్పజెప్పి వెళ్ళాడు రామనాధం. వస్తుతా వినయ వివేకాలు గల చంద్రానికి అగ్నికి గాలి సాయపడినట్లు వాతావరణంవల్ల అతని వినయు, వివేకాలు,

శక్తి సామర్థ్యాలు వృద్ధిపొందినై. చంద్రం ఇంట్లో బిడ్డలా, తల్లో నాలుకగా వాళ్ళతోకలసిపొయ్యాడు. కాంచీ, చంద్రం చాలా సన్నిహితంగా వుండే వాళ్ళు ఒకే వయస్సు, ఒకే చదువు, ఒకే మాట. వాటికితోడు తాత అవ్వల పెంపకం.

స్కూలు ఫైనలు పూర్తిచేసేనాటికి వారివయస్సు పదహారు, 13 సంవత్సరాలునై్న. ఇద్దరు స్కూలు కెళ్ళటం, ఇంట్లో పాఠాలు వల్లె వేయటం అవ్వకు, సాయం, తాతకు తోడ్పాటు. నాటి గురుకుల వాసాన్ని అనుకరించేవాళ్ళు. ఆ సన్నిహితమే వారిలో ప్రేమ బీజాలు నాటింది. అది దిన దినాభివృద్ధిచెంది మహావృక్షమై, శాఖోప శాఖలుగా విస్తరించింది. ఈ నాడు విడిపోలేనంతగా వారి జీవితాలు పెనవేసుకునై్న.

'కాంచనను విడిచిపోక తప్పదుకదా! ఈరోజే నా ప్రయాణం. వివాహమయ్యే వరకు ఎడబాటు తప్పదుకదా! ఈ ఆరు సంవత్సరాలు తృటిలో గడిచినై. ఇక నుండి క్షణమొక యుగమౌతుంది. ప్రేయసీ ప్రియులు విరహాగ్ని నెలా భరిస్తారబ్బా! చదువుకు నేను మాష్టార్ని ఆశ్రయించటం; తల్లి లేక కాంచన తాత అండన చేరటంవల్ల ఆమెతో నాకు పరిచయ భాగ్యం కలిగింది. అది ప్రణయంగా మారటం, తాతగారు సమ్మతించటం అంతా కాకతాళీయంగా జరిగింది. ఇక మిగిలింది వివాహం. విద్యార్థినైన నాకు మనస్సు స్థిరంగా వుండాలి. వెళ్ళి కాంచన వద్ద వీడ్కోలు పుచ్చుకొని రావాలి.' అనుకుంటూ కాంచనకోసం తోటలోకి వెళ్ళాడు చంద్రం.

"కృత్రిమమైన నగలు లేవు. పట్టు పీతాంబరాలు లేవు. తెల్లని చీరె గోచీపోసి కట్టింది కాంచన. నల్లని జాకెట్టులోంచి నూతన యవ్వనం పొంగి పొర్లుతోంది. బిందె నడుమున ఎత్తి తోటకు నీళ్లు పోస్తోంది. అచ్చుగా ఆనాటి కావ్య సుందరి సుగాత్రిలా వుందా జవ్వని. ఆ వొంపు సొంపులు, ఆ సోయగం - చెక్కిన శిల్పంలా తీర్చి దిద్దినట్లుంది. ఆమె రూపు రేఖలు అజంతా శిల్పంకన్నా మిన్న. ఈ రోజు నుండి ఈమె నొదిలి ఎలా బ్రతికేది. నేను నిజంగా వియోగంచే పిచ్చివాణ్ణి కానుగదా!" "దగ్గరగా సమీపించి ఆ వనదేవత వెనకగా వెళ్ళాడు చంద్రం. వెళ్లి వస్తాను కాంచనా" తల్లో మందార పూ వుంచుతూ అన్నాడు చంద్రం.

కాంచన తృళ్లి పడింది. వెంటనే వెనుదిరిగి చూచి,

"చంద్రం" బావురుమంటూ మీద వ్రాలింది. "మన కోర్కె ఈడేరే రోజు వస్తోందిగా. నాకు మాత్రం బాధగా లే ? కొంత కాలం ఎడబాటు తప్పదు. తర్వాత శాశ్వత జీవితాను బంధం. అప్పుడు మనల్నెవ్వరూ విడదీయలేరు." చంద్రం కాంచనను వోదారుస్తూ అన్నాడు.

"మీ వూరెళ్లి నన్ను మర్చిపోతావా" కాంచన కళ్లనిండా నీళ్లు తిరిగినై.

"పిచ్చి పిల్లా! మేరువు తలక్రిందులైనా, పారావారంబు లింకినా........నా మనస్సులో మరొకరికి స్థానం లేదు కాంచనా.

నిన్ను పొందని నా జన్మ జన్మేకాదు.” బుజంమీద చెయ్యేసి ఆదరాభిమానాలు వుట్టిపడుతూ అన్నాడు చంద్రం.

పరమానంద భరితురాలైన కాంచన “నీ కిచ్చిన నా హృదయంలో అన్యులకు స్థానం లేదు నా రాజా! కానీ మీ పెద్దల వల్లగాని, ఇతరుల వల్లగాని మన పెళ్లికే ఆటంకం రాదుగదా! నా మనస్సులో ఏదో శంక నన్ను పీడిస్తోంది” జాలిగా చంద్రం కళ్ళలోకి చూచింది. “చరా చరా లేకమైనా ఎవ్వరూ మనల్ని విడదీయలేరు కాంచనా! నీవు నా బహిః ప్రాణం; నేను నీ హృదయాధి దేవతను. వివాహమైన తర్వాత శాశ్వత సుఖ సంతోషాలతో, ఆనందాబ్ధిలో ఓలలాడుదాం.” బుగ్గమీద వ్రేలితో మీటాడు చంద్రం.

“గాంధర్వ వివాహం తర్వాత శకుంతలా దుష్యంతు లెలా విడిగా మనగల్గారు! నీ వియోగాన్ని తలుచుకుంటేనే నా గుండె బద్దలైతోంది చంద్రం.”

“శృంగార నాయకి శకుంతల అధరామృతాన్ని గ్రోలిన ఆ రాజు విరహాగ్నినైనా భరించాడు గాని అన్య కాంత సంపర్కాన్ని ఏనాడూ వాంఛించి ఎరుగడు. అలాగే నేనూ నీ కొరకై సప్త జన్మలైనా నిరీక్షిస్తూ వుంటా, కాంచనా.

“అంతటి శక్తి సంపన్నుల బిడ్డయినా ఆ శకుంతల అపవాదుల పాలైంది. మహారాజును చేపట్టినా పడరాని పాట్లు పడ్డది. ఇక అశక్తులకు - అందులో ఆడదానికి ఈ సమాజంలో రక్షణా, స్వేచ్ఛా వుంటుందా”? చంద్రం వంక జాలిగా చూచింది.

"పురుషులూ, సమాజం అంతా దుర్గంధ భూయిష్టం అనుకోవడం భ్రమ. మంచి తక్కువ, చెడు హెచ్చు స్థాయిలో వుంటై. నాకు నీమీద పరిపూర్ణ విశ్వాసముంది. నాకు నీమీద నమ్మకముంది. మన మెక్కడున్నా మన ఆత్మీయత విడిపోదు కాంచనా!''

ఇద్దరూ చెట్లక్రింద ఒకరినొకరు పెనవేసుకున్నారు. ఏమేమో తనివితీరా చెప్పుకున్నారు. చేతిలో చెయ్యేసి వాగ్దానాలు చేసుకున్నారు. మధ్యమధ్య ఓరగంటితో చంద్రాన్ని చూచేది కాంచన.

మనస్సుకాస్త కుదుటపడటానికి మరోమధురఘట్టంలోకిదించి

"మను చరిత్రలోని వరూధిని విరహ ఘట్టం చదివావా? రేపు పరీక్ష వ్రాయులికదా?'' చంద్రం వాక్ చతురతకు కాంచన ఆనందంతో ఉక్కిరి బిక్కిరయింది. "గడుసువారే" తమరిప్పుడు మేఘసందేశంలోని యక్షుని విరహాగ్నిని అర్థంచేసుకోగలరు. అర్థజ్ఞానంకంటే అనుభవజ్ఞానం మిన్నకదా!'' అర్థనిమీలిత నేత్రాలతో చూచింది. అతను ఆమె నోటిని తన పెదిమలతో కట్టేసి ముగ్ధురాలిని చేశాడు. తన రెండు చేతులనూ చంద్రం మెడచుట్టూ పెనవేసి అతని బాహు పంజరంలో గువ్వలా పొదిగిపోయింది కాంచన. అలా ఎన్ని గంటలున్నారో?....

కుహూ కుహూ మనే కోకిల శబ్దంతో ఇద్దరూ ఈ లోకంలో కొచ్చారు. ఇద్దరిమధ్య కొన్ని క్షణాలు మౌనం గోడకట్టింది.

"ఇక శలవిస్తావా? కాంచనా"

కాంచన దుఃఖం ఒక్కసారిగా కట్టలు త్రెంచుకున్నది.

"అలా చూడకు, సంతోషంగా వీడ్కోలు చెప్పవా?" సాదరంగా అడిగాడు. పేలవంగా నవ్విందామె.

"అనవసరమైన ఆందోళనతో నీ నిర్మలమైన మనస్సుకు చికాకుపెట్టుకోకు. వెళ్ళగానే నాన్నగారికి అన్నీచెప్పి ఏర్పాట్లు చేయిస్తా. నా తల్లి దండ్రులు బహు సౌమ్యులు. మీ సంబంధానికి వారెన్నరూ అడ్డుచెప్పరు" మన దాంపత్యానికి వ్యతిరేకించరు.

...."మౌనం అర్ధంగీకారం. అయినా పోయిరమ్మని మనసారా సాగనంపవా?" చంద్రం కంఠం దుఃఖంతో బొంగురు పోయింది.

ఎండుటాకులనుండి పదధ్వనివిని ఉలికిపడ్డాడు, చంద్రం. సిగ్గుతో తలవంచింది కాంచన. తమ ప్రక్కగా దయానిధి వెళ్తున్నట్లు గమనించారు. వెంటనే చంద్రంవెళ్ళి "నమస్కారం మాష్టారు" అన్నాడు వినమ్రుడై.

"పరీక్షలు బాగా వ్రాశావా? క్లాసు ఫస్టువస్తావా?" "బాగానే వ్రాశానండి"! చంద్రం ముఖం ప్రశాంతంగా, నిర్మలంగావుంది.

"ఇక్కడ చదువు పూర్తయిందిగదా! ఇక పై చదువుకు పట్నం పోతావా? తల్లోనాలుకలా కలిసిపొయ్యావు. వెళ్ళిపోతా

వంటే బాధగా వుంది నాయనా!" పుత్రవాత్సల్యంతో చంద్రాన్ని చూచాడు తాతయ్య.

"మాష్టారూ! ఈ రోజు సాయంత్రం మావూరు వెడుతున్నానండి, అమ్మగారికి మీకు నా ధన్యవాదాలు."

"మంచిది నాయనా! కొద్దికాలంలో మీవాళ్ళకుచెప్పి వివాహపు టేర్పాట్లు చేస్తా. ఈరోజే వుత్తరం వ్రాస్తా. క్షేమంగా వెళ్ళిరా బాబు" బుజంతట్టి ధైర్యం చెప్పివెళ్ళాడు తాత. తన పెన్నిధిని కోల్పోయినట్లు కూలబడింది కాంచన.

"అమూల్యమైన వస్తువును పోగొట్టుకున్నా" కాంచీ కొద్ది దూరంపోయి తిరిగొచ్చిన చంద్రం అన్నాడు.

"అన్నిటికన్నా ముఖ్యమైనది, ప్రాణంకంటె మిన్నయైనది విడిచిపోతున్నావు చంద్రం! అదేనా హృదయం," ఉబికివస్తూన్న దుఃఖాన్ని దిగమ్రింగుతూ అన్నది కాంచన.

"టైమయింది ఇక వెళ్లనా?" కలువరేకుల్లాంటి కాంచన కళ్ళలోకి చూస్తూ అడిగాడు. ఆమె ప్రేమకు అతను-అతని ప్రేమకు ఆమె పరవశించి పోయ్యారు.

"ఈ ప్రేమైకమూర్తి నా జీవిత భాగస్వామికావడం నిజంగా నా అదృష్టం' కాంచన అనుకొంది.

'ఈ నవమోహనాంగి, సద్గుణరాశి నా హృదయేశ్వరి అయితే నిజంగా నేను కుబేరునికన్నా ధనవంతుణ్ణవుతా," చంద్రం ఊహించుకున్నాడు.

ఇద్దరూ సుమధుర స్వప్నాలలో సర్వాన్ని మరచి పొయ్యారు. ఇంతవరకూ తమ స్నేహం పవిత్రంగానే వుంది ఇప్పుడది శాశ్వతమైన అనుబంధంగా మారబోతోంది-అది పవిత్రమైన వివాహబంధంద్వారా. అప్పుడు ఇంక వారిని ఏ వ్యక్తీ విడదీయలేడు. పూర్వపు మధురస్మృతులు నెమరేస్తున్నారు మళ్ళీ.

"వెళ్ళొస్తాను" కాంచీ.

"త్వరగా రావాలి" నీకొరకై వేయికళ్ళతో వేచివుంటా. విదేశాలకు పోతున్న ప్రేమికుల్లా మళ్ళీ ఎప్పుడు కలుస్తామోననే భావంతో విడివడి వెనుదిరిగిచూస్తూ, చూస్తూ నిష్క్రమించాడు చంద్రం.

రాబోయే తీయని వసంతాన్ని ఊహించుకుంటూ లోనికెళ్ళింది కాంచన.

"రవీ, రంజన్ బాగున్నారా బాబూ" హఠాత్తుగా ఊడిపడ్డ బద్రీనాథుని ప్రశ్నించాడు మా తాత దయానిధి.

"పిల్లల్ని మీతో తెస్తే పదిరోజులుండి వెళ్ళేవారుకదా! ఎందుకుతేలేదు?" మా అమ్మమ్మ శాంతమ్మ అల్లుణ్ణి అడిగింది.

"మీ ఉత్తరం చదివాను. కాంచన పెండ్లి విషయమై వివరాలు వ్రాశారు. మీ ఇష్టమే నా ఇష్టం. భవిష్యత్తునిగురించిన ఆలోచనలో మీరు సిద్ధహస్తులు. మీమీద నాకు పూర్తి విశ్వాసముంది. పిల్ల ఫస్టున పాసయిందని విని ఆనందించా. ఇంకా

చదివిద్దామనే మీ ఆలోచనకూడా నాకు నచ్చింది'' పెండ్లి విషయంలో తన అంగీకారాన్ని మా నాన్న మా తాత-అమ్మమ్మ లతో చెప్తున్నాడు.

''ఏది ఏమైనా నీవు తండ్రివికదా! నీతో సంప్రదించాలని వ్రాశా.''

''పిల్లోడి తల్లిదండ్రులు, కుటుంబ సంప్రదాయం మంచివే కదా?'' మా నాన్న తిరిగి ప్రశ్నించాడు.

''అందుకే నేను త్వరపడుతున్నా. అమ్మాయిని ఇంకా చదివిస్తామనుకోండి. ఆ తర్వాత తగిన వరుడు లభిస్తాడని గ్యారంటీలేదుకదా! అసలే తల్లిలేని పిల్ల. పెండ్లయ్యాకైనా చంద్రం కాంచిని చదివిస్తాడనే నమ్మకం నాకుంది'' తాత చంద్రం సత్ప్రవర్తనగురించి వివరంగా చెప్పాడు నాన్నకు.

''కట్నకానుకలు, పెళ్ళి ఖర్చులు మనకందుబాటేనా?''

''వాటివిషయం నీకనవసరం. అవన్నీ నేను చూచుకుంటా. నాకుమాత్రం ఎవరున్నారు? చంద్రం ఆరు సంవత్సరాలు నా కనుసన్నల్లో పెరిగాడు. బేరసారాలాడే అవివేకిని నేను దరికి చేరనిస్తానా? యోగ్యుడుకనుకనే మాటఇచ్చా. అంతా సెటిల్ అయింది. ఇంక నీవు 'ఔను' అనటమే మిగిలింది. కాంచీ, చంద్రం మనసారా ప్రేమించుకున్నారుకూడా. ఇక్కడే మనింట్లో పెండ్లి ఏర్పాట్లు చేద్దాం. చంద్రం తండ్రికి రేపు ఉత్తరం వ్రాస్తా. అతడు నా ప్రాణమిత్రుడు. ఈ శ్రావణమాసంలో చాల ముహూర్తాలున్నై. ఏమంటావుబాబూ!''

"దేనికీ కాదనను. నాకు అన్నివిధాలా ఈ పెండ్లి ఇష్టమే. కానీ నాదొక్కకోర్కె" నెమ్మదిగా వెలిబుచ్చాడు నాన్న.

"ఏమిటదీ?" ఆదుర్దాగా ఉత్కంఠతతో అడిగాడు తాత.

"అదొక్కటే చిన్న కోర్కె. పెళ్ళి మా ఇంట్లో జరగాలని పట్టుపట్టింది నా భార్య కామిని. కన్యాదానం తానే చేస్తుందట. ఇంట పుట్టిన ఆడపడుచు పెండ్లి అక్కడే జరపాలట. తద్వారా వంశాభివృద్ధంట. కన్న తల్లిలా బాధపడుతోంది." తన నిర్ణయాన్ని వెలిబుచ్చాడు నాన్న. మనస్సు కకావికలయింది నాకప్పుడు.

ఈమధ్య అనుమానంలో పడ్డాడు తాత. రెండు మూడుసార్లు సెలవులకు నాన్న తీసుకెడితే సవతితల్లి బాగానే చూచిందని చెప్పాను. నేను ఎవర్ని గురించీ చాడీలు చెప్పనని తాతకు తెలుసు. అందుకే కాబోలు, తాత మౌనంగా ఉండి పోయాడు.

"ఏదో ఆలోచిస్తున్నారే? ఇష్టం లేదా? బాధగా ఉందా? మీరూ, అత్తగారూ ముందుగా దయచేసి మీ సన్నిధిలో ఈ శుభకార్యం జరిపించండి" అన్నాడు నాన్న.

"పంపక తప్పదా, నాయనా?" సంభాషణంతా వింటున్న మా అమ్మమ్మ గద్గద స్వరంతో పలికింది.

"ఇది మొదటి శుభకార్యం. మన నట్టింట్లో జరిపించాలని నా భార్య చాలా పట్టుపట్టింది. సరేనని మాటిచ్చాను అత్తగారు! పిల్లను నాతో పంపండి. మీరూ, మామగారూ పెండ్లికి ముందుగా

వచ్చేయండి.'' తప్పదన్నట్లు ఖచ్చితంగా తేల్చిచెప్పాడు మా నాన్న.

'కాంచీ! నాన్నతో వెళ్ళమ్మా!' రుద్ధకంఠంతో అన్నాడుతాత.

తీయని కలలు కంటున్న నాపై పిడుగు పడ్డట్టయింది.

ఉలిక్కిపడి ''తాతయ్యా! నేను పోను. ఇక్కడే ఉంచమని నాన్నతో చెప్పవా?'' అంటూ ఏడుస్తూ తాతయ్యను బ్రతిమాలాను.

''అడిగేది నీ కన్న తండ్రే కదమ్మా? వెళ్ళక తప్పదు. ఎక్కడో అక్కడ నీవు ఒక ఇంటి దానివయితే నా కదే తృప్తి. నీ పెండ్లి తరువాతకాని నాకు మనశ్శాంతి లభించదు'' అన్నాడు తాతయ్య.

''ఇంటి దాన్నవటమేమిటి తాతయ్యా'' దిగాలుపడి అడిగాను తాతను.

''పెండ్లి చంద్రంతోనే అమ్మా, నేనతన్ని నాతోతెస్తా. లగ్నం వగైరాలు కుదిరాక మీ అమ్మమ్మ, నేను, చంద్రం, వాళ్ళ కుటుంబం అంతా తరలివస్తాం. ఈలోగా చంద్రం నాన్నకు అన్నీవ్రాసి సిద్ధంచేస్తా. బెంగపడకమ్మా!'' నచ్చచెప్తున్నాడుతాత.

''అమ్మమ్మా? నీ వన్నా నన్ను ఇక్కడే ఉంచమని నాన్నను యాచించవా? ఇన్నాళ్ళు తల్లికన్న ఎక్కువగా సాకావు. నన్ను పెండ్లిచేసి అత్తింటికి పంపాల్సిన నీవు నన్ను ఇలా

ఒంటరిగా పంపుతావా” అమ్మమ్మ కాళ్ళకు పెనవేసుకొని మొత్తుకున్నా.

“నా మాట ఎవరు వింటారమ్మా? నా మాట చెల్లుతుందా తల్లీ” అంటూ కూలబడ్డది అమ్మమ్మ.

“నాతో మీరుకూడ రండి తాతయ్యా. మిమ్మల్ని విడిచి నేను పోలేను” అని వాపోయా. తాతయ్యను కౌగలించుకొని బిగ్గరగా ఏడ్చా. “భయంలేదులే. బయల్దేరమ్మా. శాంతా! అమ్మడు బట్టలు సర్ది పెట్టు. నీ పుట్టింటివారిచ్చిన ఆ రెండు మొహిరీలు దానిచేతిలో పెట్టు. మనం వెళ్ళేటప్పుడు కట్నకానుకలు తీసుకెడదాం.” అన్నాడు తాతయ్య.

మా తాతా అమ్మమ్మలకు పాదాలంటి నమస్కరించి కన్నీరు మున్నీరుగా కారుస్తూ, చేసేదిలేక, అడుగులు తడబడుతూ నాన్నను అనుసరించాను.

నేను మా నాన్నగారింటికెళ్ళిన 4 రోజులకు మా అమ్మమ్మ స్నేహితురాలు మా నాన్నగారి వూరు వచ్చింది. నన్ను చూడ్డానికి మా నాన్నగారింటికొచ్చింది. మా అమ్మమ్మ తాతయ్యల స్థితి అడిగాను. నేను వెళ్ళినరోజు సాయంత్రం వాళ్ళు మాట్లాడుకునేటప్పుడు అక్కడే వున్నానని, వాళ్ల సంభాషణ గురించి నాతో ఇలా చెప్పింది.

“అలా కృంగిపోతే ఎలా శాంతా!”

"అంతా భ్రమండీ! నా కూతుళ్ల నిలాగే సాగనంపా. బిడ్డల్ని గురించి కలలెన్నో కన్నా, నా కళ్ల వెలుగులో వార్ని చూచా. నా గుండెల చప్పుడే వారుగా భావించా. అదంతా రుణానుబంధమైంది. ఈ చినారి నన్నా చూచుకు బ్రతుకుదామంటే ఇలా జరిగింది." అంటూ భోరున ఏడ్చింది శాంతమ్మ.

"విచారించకు శాంతా. కాంచన సామాన్యమైన వ్యక్తి కాదు. మహా యోగ్యురాలు. మేధస్సు, వినయం, వివేకంగల మహా మనీషి. ఒకనాడు పాఠం చెప్తుంటే ఏమడిగిందో విన్నావా ?

"కోరికల వల్లే దుఃఖం అన్నాడు బుద్ధుడు. దుఃఖ రాహిత్యానికి కోరికలు చంపుకోవాలని బౌద్ధం బోధిస్తుందా ? తాతయ్యా" పెద్ద చిక్కు ప్రశ్న అడిగింది కాంచన. "అసలు కోరికలు లేని జీవితం ఎడారి వంటిదమ్మా కాంచీ ! కాని ఆ కోరికలు న్యాయానికి, ధర్మానికి కట్టుబడి వుండాలి. స్వార్థ రహితమైనవి, సమాజ శ్రేయస్సు కోరేవి అయి వుండాలి. అసలు కోరికలే లేనిచో ప్రగతి సాధించలేమమ్మా. పడగ విప్పిన కోర్కెలు పశుతుల్యమైనవి. మానవుడు దుష్ట కోరికలకు లొంగితే పతన మౌతాడు. తన్ను తాను శాశించుకోగల నిబ్బరం, ధైర్యం కలవాడే మానవాతీతుడౌతాడు. ఇది బౌద్ధమత ప్రాశస్త్యంలోని ముఖ్య సారాంశమమ్మా !" మహానందంతో బోధించా నానాడు.

"సర్వసంగ పరిత్యాగంవల్ల బుద్ధుడు మహాత్ముడైనాడు గదా ! మరి రాజ్యపాలన చేస్తూ మహాత్ముడు కాకూడదా ? తాతయ్యా" ఇలాంటి విలక్షణమైన ప్రశ్నలు వేయగల వివేకి మన కాంచన శాంతా !"

"మన హృదయాలలో మాయని గాయంచేసి వెళ్ళింది కాంచన."

"ఇక మనం మనం........" మరి శాంతమ్మ చీరె కొంగుతో కళ్ళొత్తుకుంది.

"శాంతా! కాంచన వియోగం నన్నుకూడా..............." కళ్ళద్దాలు తీసి కళ్ళు తుడుచుకున్నాడు దయానిధి.

ఆహా! ఏమి భవబంధాలో! అంత నిష్కామ యోగ్యుడు; భవబంధ విమోచనుడు సైతం తల్లడిల్లి పొయ్యాడు. ఇక సామాన్యుని గురించి.... .... ....

"శాంతీ! కాంచి లేని ఇంట్లో వుండగలమా? ఈ ఎడబాటు నన్ను దహించి వేస్తోంది. అసలు కన్నా వడ్డీ ముద్దన్నట్లు ఈ పిల్ల నా కాళ్లకు తీరని బంధమయింది శాంతా! నే తట్టుకో లేనేమో? ఆడపిల్ల ఎప్పుడైనా వెళ్లక తప్పదు కదా! అయినా కన్నవారికి ఇదొక తీరని బాధ. అందుకే మహాకవి కాళిదాసు మానవ మనస్థత్వాల నెలా వర్ణించాడో చూచావా? శకుంతలను అత్తవారింటి కంపుతూ కణ్వ మహర్షి" సర్వసంగ పరిత్యాగిని, అస్కలిత బ్రహ్మచారిని అయిన నేనే ఇలా చలించాను. దుఃఖిస్తున్నాను. శకుంతలా వియోగానికి విలపిస్తున్నాను. ఆమె నాకు నమస్కరించి 'శలవా తండ్రీ'! అన్నప్పుడు నా మనోవేదన వర్ణనాతీత మయింది. ఎందుకో నాకింత పరితాపం. కనలేదు నేను; చేరదీసి పెంచిన ప్రేమే నన్ను ఇలా దుఃఖ క్రాంతుని చేసింది. పెంచిన వారికే ఇంత కలవరమైతే ఇక నవమాసాలు మోసి కని

పెంచిన ముద్దుల గుమ్మను అత్తవారింటికి సాగనంపుతున్న ఆ తల్లి దండ్రుల వ్యథ వర్ణనాతీతంగదా! "అని కణ్వమహర్షిచే కాళిదాసు పల్కించాడు. అది అక్షరాలా నిజం శాంతా" అంటూ దుఃఖాశృవులు రాల్చాడు దయానిధి.

"సర్వం తెలిసిన మీరే ఇలా వాపోతే ఇక నేనెలా గడపాలండీ! ప్రతి పనికీ అడ్డొచ్చేది. ప్రతివిషయం చెప్పేది. నాప్రక్కన పడుకొని మీరు చెప్పిన పాఠాలన్నీ కథలు, కథలుగా వల్లెవేసేది. ఆ చక్కదనం, ఆ గుణగణాలు ఎవరినొమ్మో!'' నిట్టూరుస్తూ ఆక్రోశించింది శాంతమ్మ.

''కాంచి పెళ్ళిపోయింది. మనల్ని దుఃఖం వెన్నాడుతోంది. మరచిపోవటానికి కొన్నాళ్ళు దేశాటనంచేసి వద్దామా శాంతా!''
"ఇంతకాలం సంసారం, విద్యార్థులు, వృత్తి ఇతర కార్యక్రమాలతో సతమతమయ్యాం. ఈవిధంగానైనా ప్రపంచాన్నీ, ప్రజల్నీ చూచివద్దామండీ'' అన్నది శాంతమ్మగారు.

''సరే త్వరగా ప్రయాణ ఏర్పాట్లు చూడు. త్వరగా మనం తిరిగొచ్చి కాంచిపెళ్ళికెళ్ళాలిగదా!" ఇలా వారి బాధను వ్యక్తం చేసింది అమ్మమ్మ స్నేహితురాలు.

ఆ రాత్రికి నాన్నా నేనూ ఇంటికి చేరాం. రవీ, రంజన్‌లకు 16 సం॥ వచ్చినా వారి పరిస్థితి మారలా. వార్ని చూస్తే నాకు పట్టరాని దుఃఖం వచ్చింది.

''చదువులేదు, మంచి ఉద్యోగంలేదు. జీవితాంతం ఇలాగే కూలీ వాళ్ళలాగా బ్రతుకుతారా నాన్నా! అన్నల్ని ఇలా

చేశావేం నాన్నా" వాళ్ల యోగక్షేమాలు విని చాటుగా నాన్నతో నా బాధను వ్యక్తంచేశా.

"మీ దౌర్భాగ్యంకొద్దీ నాకు పుట్టారమ్మా. పోయిన మీ అమ్మ ధన్యజీవి. బ్రతికున్న నేను మహా పాపం చేశాను. అనుభవిస్తున్నాను." తన అశక్తత వెళ్ళబుచ్చాడు నాన్న నాతో.

"ఇప్పటికైనా వాళ్ళని భార్గవి పిన్నిదగ్గరికో, తాత దగ్గరికో ఎందుకు పంపవూ?" ఎటూ చెప్పలేక తలదించుకున్నాడు నాన్న.

నేను నాపుట్టింటికి వచ్చిన కొన్నాళ్ళు కామిని, నా సవతితల్లి ప్రసన్నంగానే రోజులు వెళ్ళబుచ్చింది. కాని ఆమెలో ఏదో అశాంతి తాండవమాడుతూ ఉంది. నా పెండ్లి విషయం ఆమె ఇన్నాళ్ళు ఎత్తలేదు! చూద్దాములే, ఆ విషయాన్ని ఆమె ప్రస్తావించకపోతుందా అని ఓపికగా ఊరుకున్నాడు మా నాన్న. ఇక ఉండబట్టలేకపోయారు. ఒకనాడు హెచ్చరించాడు భార్యతో.

"ఈ నెలాఖరుకి పెండ్లి ఏర్పాట్లు చేద్దామా?"

"....................."

"మాట్లాడవేం? పిల్లని తెమ్మని రంపపుకోత పెట్టావుకదా"!

"మనమేం ఆగర్భ శ్రీమంతులమా? పెండ్లంటే ఎంత ఖర్చు" గునిసింది కామిని.

"దానితాత అన్నీ భరిస్తానంటే ససేమిరా వీల్లేదన్నావుకదా?"

"వాళ్ళ డబ్బు వద్దన్నానా? వాళ్ళింట్లో పెళ్ళి వీల్లేదన్నానంతే." గంభీరంగా చెప్పింది కామిని. భర్త వాళ్ళనుండి డబ్బు తేలేదని ఆమె బాధ. వెళ్ళేటప్పుడు పెళ్ళిఖర్చులకని డబ్బు తెమ్మని చెప్పిందట, కాని నాన్న నోరుతెరచి తాతని అడగలేకపోయ్యాడు.

"అయితే పెండ్లికొడుకును తెచ్చే ఏర్పాట్లన్నీ వాళ్ళనే చెయ్యమని వ్రాస్తా. మనకే బాధా వుండదు."

"కాస్త ఆగండి. మావాళ్ళను రమ్మని వ్రాశా. వస్తూ అప్పుగా 2 వేలు తెమ్మన్నా. మా అమ్మా, తమ్ముడూ ముందుగా వస్తారు. మనకు కాస్త సాయపడతారు."

"ఏమిటీ! మీవాళ్ళా! అప్పా! మనమివ్వాలా! వాళ్ళిస్తారా?" నిర్ఘాంతపోయాడు నాన్న.

"మేమంత పుట్టుగతిలేనివాళ్ళమా? మీకంటే గొప్ప సంబంధాలే నాకొచ్చినై, మీవాళ్ళు బ్రతిమాలి భంగపడి ఈ పెండ్లికి ఒప్పించారు." తీక్షణంగా చూచింది కామిని నాన్నపై పట్టరాని ఆగ్రహంతో.

"అవన్నీ ఇప్పుడెందుకు, రోజూవున్న? జాతరేకదా! ముందు దాని పెళ్ళిచేసి నామాట నిలుపుకుంటా" పేచీపెట్టాడు నాన్న.

తల్లిలేని నన్నొక గుణవంతుడి చేతిలోపెడితే తనకిక ఏబాధ ఉండదనే నిర్ణయంతో ఆ రాత్రి మామగారికి ఉత్తరంవ్రాసి బల్లమీద పెట్టాడు నాన్న." అంతే, అది పోస్టుకాలేదు. తెల్లారి మనిషి లేవలేదు. కాళ్ళు, చేతులు వణుకుతునై్న. పట్టుతప్పుతునై్న.

నిస్సత్తువుగా వుందట. తల దిమ్ముగా వుందట. 8 గంటలయింది తెల్లారి. నాన్న అశక్తుడయ్యాడు.

"నాన్నా! నాన్నా! లే!" అంటూ నాన్నని తట్టిలేపా.

"కాంచీ, నాన్నకేమయింది?" అంటూ పరిగెత్తారు రవీ, రంజన్ ఆదుర్దాతో.

"నాన్నా! డాక్టర్ని తేమా!"

మాటలు పెగల్లేదు మాతండ్రికి. అన్నలూ, నేనూ హడలెత్తిపోయ్యాం. లోలో దిగమ్రింగుతూ ముగ్గురం ఏడుస్తున్నాం.

"పిన్నీ! నాన్నకేదో జబ్బొచ్చింది. అన్నయ్యను డాక్టరు కోసం పంపావా?" అన్నా ఏడుస్తూ.

"ఇంకా ఆయునకు డాక్టరెందుకు! అది పక్షవాతం. దానికి మందు లేదు. వైద్యం లేదు. ఎలాగో బ్రతికినన్నాళ్ళు ఇలాగే సాగిపోతుంది." అన్నది పిన్ని ప్రశాంతంగా.

"అదేంటి పిన్ని! అశుభం పల్కుతావ్" అంటూ పెద్దన్న రవి డాక్టరు కోసం పరిగెత్తాడు. నాకు కాళ్ళాడలా. దుఃఖంతో మాట పెగల్లా. నాన్నకేదో ముంచుకొచ్చిందని భయపడ్డా.

"పిన్నీ డబ్బులు తెమ్మన్నాడు డాక్టరు. ఇయ్యవా?" కాసేపటికి తిరిగొచ్చాడు నిస్పృహాయుడైన రవి.

"ఇంకా ఆయనపై ఖర్చెందుకూ?" ఎలాగో కొన్నాళ్లు ఇలాగే తీసుకోవాలి తప్పదు. దీర్ఘాలు తీస్తూ సాధించింది కామిని.

చేసేది లేక ముగ్గురం ఏడ్చి ఏడ్చి తెప్పరిల్లాం. నా దగ్గర అమ్మమ్మ ఇచ్చిన బంగారం అమ్మి వైద్యం చేయిద్దామనుకొన్నాను.

"మా నాన్నకు జబ్బొచ్చింది పిన్నీ!" ప్రక్కింటి మీనాక్షితో చెప్తున్న నన్ను కోపంతో చూచింది కామిని.

"ఆమె ఆరుస్తుందా? తీరుస్తుందా? ఎవరి కష్టాలు వారివి. ఎవరి సుఖాలు వారివి. అసలే కలహకంఠి, దానివూసు మనకెందుకు రా, రా! మా అమ్మ, తమ్ముడు వస్తున్నారు. అన్నీ వాళ్ళే చూస్తారు రా! రా!" గదమాయించింది నన్ను. తన వ్యవహారమంతా మీనాక్షికి తెలుసు - తన్ని గురించి ఏం చెప్తుందోనని కామినికి అనుమానమని నేనూహించా.

జట్కాబండి లోంచి తల్లీ కొడుకు దిగారు.

"అమ్మా, ప్రయాణం బాగా సాగిందా?" కామిని తల్లి నడిగింది.

"ఏం ప్రయాణాలో! ఏమిటో! ఈ రోజుల్లో శిక్షించాలంటే రైలెక్కి రమ్మంటే చాలు. అల్లుడుగారికి జబ్బు చేసింది, రమ్మని వ్రాస్తే ఎక్కడి వక్కడ పారేసి పరిగెత్తుకొచ్చా. చిల్లరిచ్చి పంపు బండివాణ్ణి ముందు" మా పిన్నిని ఆజ్ఞాపించింది తల్లి రాంప్యారి.

"చూస్తూ నిలుచుంటారేంరా! ఆ సామానంతా పట్రండీ" గదమాయించింది కామిని. రవి వెంటనే వెళ్ళి పెట్టి, గోనెసంచి,

రేకు డబ్బా, తాటాకుల బుట్టతో ముందొస్తుంటే వెంట నడిచాడు అపర గిరీశం. కళ్ళు రెండు నాకై వెతికాయి. పిల్ల మంచి పసందుగా ఉంది. తలుపు చాటునుంచి నన్ను చూస్తూ అన్నాడు.

టకటక బూట్ల శబ్దంతో దగ్గరాతోం దా ఆకారం. కామిని తమ్ముడు యుగంధర్. నల్ల పేంటులో తెల్ల చొక్కా టక్ చేశాడు. బ్లూ గాగుల్సు ధరించాడు. సన్న చుక్కల టై లాక్కుంటూ, తల దువ్వకుంటూ, గోల్డుఫ్లేక్ ముట్టించాడు.

"అలా చిక్కి పోయావేంరా తమ్ముడూ" ఆప్యాయంగా పల్కరించింది అక్క కామిని.

"ఎప్పుడూ ఏదో బిజీ కదక్కా? బోలెడు సంపాదనాయె మరి శ్రమపడాలి కదా! నిన్నే 13 లక్షలు బ్యాంకులో డ్రా చేసి పని మొదలు పెట్టా. కోటి రూపాయల కాంట్రాక్టది. నేషనల్ హైవేస్. రేపు మరో 20 లక్షలు తేవాలి. పెద్ద ఓవర్ బ్రిడ్జి కాంట్రాక్టు శాంక్షనయింది. బావగార్ని చూడాలని ఎలాగోలా పరిగెత్తుకొచ్చా. చాలా బిజీగా ఉన్నా. అయినా బావగారిమీద గౌరవంతో రావాల్సి వచ్చింది" అన్నాడు.

"కాంచీ! కాఫీ, టి ఫి న్ పట్రా!" వాచీ చూచుకుంటూ కీర్తిగంట చూస్తూ ఆప్యాయంగా అడిగాడు ధర్.

నేను ముఖం చిట్లించానప్పుడు.

"ఏయ్ పిల్లా! ఏం చేస్తున్నా? అసలు నువ్వు సినిమా స్టారయి, హీరోయిన్ కావాల్సినదానివి. మీ తాత ఒక మోటురకం."

నా వెంటపడి ఏదో పల్కరిస్తుంటే నా తండ్రి దగ్గరి కెళ్ళాను, అసహ్యంతో. అతన్ని చూస్తేనే నాకేదో ఎలర్జీగా వుండేది. అతని వేష భాషలు, నడత అంతా కృత్రిమంగా తోచేది నాకు.

తల్లి, తమ్ముడూ వచ్చినప్పటి నుంచి కామిని ఉల్లాసంగా ఉంది. ఒకనాడు మా పిన్ని దేవాలయానికి పూజకు పోవటానికి ఏర్పాట్లు సాగించింది. నన్నుకూడా తనతోపాటు గుడికి రమ్మంటూ ఒక పట్టుచీరె ఇచ్చి వెంటనే తలస్నానం చేసి రమ్మని చెప్పింది.

"మీరు వెళ్ళిరండి పిన్నీ! నేను నాన్న దగ్గరుంటా. నాన్నకెందుకో ఈరోజు చాలా మగతగా వుం" దని భయపడుతూ జవాబిచ్చా.

"రాత్రి కలవచ్చింది. అందులో మీ నాన్న అచేతనంగా పడివున్నట్లూ, దీనంగా నావైపు చూస్తూ అమ్మవారికి పూజచేస్తే తగ్గుతుందని సౌంజ్ఞతో చెప్పినట్లూ, మనమంతావెళ్ళి దేవికి కానుకలతో అర్చనచేసివచ్చినట్లూ, ఇంటికొచ్చేసరికి మీనాన్న నవ్వుతున్నాడమ్మా! అందుకే గుడికి రమ్మంటున్నా' నని మళ్ళీ అడిగింది. నేను మారుపలకలేదు. నా మనసు చికాకుగా ఉంది నా తండ్రికేమవుతుందో అని భయం పట్టుకుంది నాకు. ఇక్కడ ఒంటరిగా సవతితల్లి చేతిలో ఇరుక్కుపోయానే అనే బాధతో సతమతమవుతున్నాను. నా దురదృష్టంకొద్దీ నాన్న జబ్బుపడ్డాడనే బెంగపట్టింది నాకు.

" నీ తండ్రి ఆరోగ్యానికై దేవునికి సేవచేస్తున్నా, నామాట నమ్మవా? ఎంతైనా సవతితల్లినేలే! నాకుమాత్రం భర్త

బతకాలని, ముత్తయిదువుగా పూలు, పూసలలో తిరగాలని వుండదా?'' కళ్ళొత్తుకుంది కామిని.

"నాన్నా! నీకోసం గుళ్లోకెళ్ళి మొక్కివస్తా. నాకైతే దేవుడు, రక్షించేవాడు అనే నమ్మకాలులేవు. పిన్ని సంతృప్తికొరకే అయినా నిన్ను విడిచిపోవటానికి నాకు కాళ్లాడటంలేదు నాన్నా!!'' మానాన్న కళ్లల్లోకి జాలిగా చూశాడు. ఆ కళ్లల్లో విషాద చాయలు పొడచూపాయి; కన్నీరుతప్ప మరింకేం కన్పించ టంలా నాకు. ఏదో చెప్పబోయాడు. మాటరాలా. సౌంజ్ఞ చెయ్య బోయ్యాడు. చెయ్యిలేవలా. నాతండ్రి మౌనాన్ని గ్రహించలేక పొయ్యాను. నాన్న ఆవేదన అర్థంకాక తల్లడిల్లిపోయాను. ఏడ్చి, ఏడ్చి ఆయన కళ్ళు వాచిపోయినై. శరీరబాధకాబోలను కున్నాను. నన్నుగురించి ఆ మూగజీవి విలపిస్తోందని నాకప్పుడు అవగాహనకాలా. పోనా? వద్దా! అని తటపటాయించాను. మళ్లీ నాన్నవంక మరోసారిచూచా. నాన్న కళ్ళు కళాహీనంగావున్నై. ముఖంలో వర్చస్సు తగ్గుతోంది. దీనంగా నావంకచూశాడు.

"కాంచనా! టైమయింది త్వరగా రా''! కేకేసింది కామిని. తండ్రినివదలి పోవటానికి కాళ్లాడలా. "నాన్నా!" అని కౌగలించు కున్నాను. ఆపుకుందామని ప్రయత్నించినా నాకు కన్నీరు ఆగలా. పాదాభివందనంచేసి గుండె నిబ్బరంతో ముందడుగు వేశాను. మళ్లీ ఒకసారి వెనుదిరిగిచూచి ముందువైపుగావున్న గడపదాటా.

తలుపు బైట తాళంవేసింది కామిని. ముగ్గురం బండిఎక్కాం. బండి సాగిపోతోంది.

"ఎంత దూరం పోయినా గుడి రాదేం పిన్నీ"! అన్నా భయంతో.

మౌనం వహించారు తల్లీ కూతుళ్ళిద్దరూ.

"నాన్న ఒంటరిగా వున్నాడు. మనం త్వరగా పోవాలి" అమాయకంగా మళ్ళీ అడిగాను.

కామిని, ఆమె తల్లి ఒకరినొకరు చూచుకొని ముసి ముసి నవ్వులు నవ్వుకున్నారు. నా కంతా అయోమయంగా తోచిం దప్పుడు. పోయి పోయి బండి ఒక మండపం దగ్గర ఆగింది.

"రవీ, రంజన్ ఏరి పిన్నీ! వాళ్ళెక్కడున్నారు? ఇక్కడికే వస్తారని చెప్పావు" ఆత్రంతో అడిగా.

నా మనస్సేదో కీడు శంకిస్తోంది. హృదయమంతా ఆందోళనతో నిండిపోయింది.

"ఎప్పుడూ నీ అన్నల ధోరణేకాని, ఎప్పుడైనా తమ్ముణ్ణి, చెల్లెళ్ళనీ గురించి అడిగావా? వాళ్ళని ప్రేమతో పల్కరించావా? వాళ్ళు నీ తండ్రి పిల్లలు కారా? అంత ద్వేషం తగదమ్మా"! ఎత్తి పొడిచింది కామిని.

"దిగు! దిగు! ముందు బండి దిగు! త్వరగానే అత్తింటికి పోదువుగానిలే" ఆజ్ఞాపిస్తూ అన్నది రాంప్యారి.

నా కాళ్ళ క్రింది భూమి కృంగినట్లయింది. ఇది కలా! నిజమా! విస్తుపోయా నప్పుడు.

నన్ను దేవునికి నమస్కరించుకోమని ఆదేశించింది కామిని. నాకు దే వు ని పై, మతాలపై, కులాలపై, మూఢాచారాలపై నమ్మకం లేదు. తాతగారి బోధవల్ల నాకలాంటి హేతువాద ధోరణి గల అభిప్రాయాలుఏర్పడ్డాయి. దేవుడంటే అదొక శిలావిగ్రహమని తోచేది. మానవునిలో వున్న వ్యక్తిత్వం, మానవత్వం ఆ రాయిలో లేవనిపించేది. తలొంచుకుని నిలబడ్డా నప్పుడు, పిన్ని ఆజ్ఞను శిరసావహించి.

"ముందు ఆ పీటమీద కూర్చో! బ్రాహ్మడు మంత్రాలు చెప్తాడు" నన్ను విషపు చూపులతో చూచింది నా సవతి తల్లి కామిని.

"దేవుడి పూజకు నాకు మంత్రాలేమిటి పిన్నీ! ఆదుర్దాగా, అయోమయంగా అడిగా" వారి కుతంత్రం ఇంకా నా కర్థం కాలా.

"పెళ్ళి మంత్రాలు. ఈ గుళ్ళో నీ పెళ్ళి జరుగుతుంది"

నా పెళ్ళా? నిజంగానా? ఏమిటో చెప్పలేని అవ్యక్తాను భూతిలో పడి మాట పెగల్లా!

ఆ! ఏమిటీ! కంకరరాయి కణతకేసి కొట్టినట్లయింది నాకప్పుడు. మళ్ళీ తెప్పరిల్లి "ఏమిటీ ఘోరం పిన్నీ!" అని పిన్ని కాళ్ళు పట్టుకున్నా.

"ముండమోపి ప్రశ్న లూ నువ్వూనూ. నోరుమూసుకు కూర్చో" దబాయించింది రాంప్యారి.

తలంబ్రాలు పళ్ళెంలోపోసి, పైన మంగళ సూత్రాలు పెట్టి పట్టుకొచ్చాడు యాజ్ఞికుడు.

ఆకాశానికి ఎగరవలసిన నేను పాతాళానికి కృంగిపోయాను ఆ క్షణంలో.

పట్టుబట్టలు కట్టుకొని, భాషికం పెట్టుకొని, చెంకీ దండలు, పూల దండలు చేత ధరించి ముసి ముసి నవ్వులతో ప్రత్యక్షమయ్యాడు యుగంధర్.

కసాయివాడు కత్తితో మీది కొస్తున్నట్లుంది నాకప్పుడు. నానోట మాట రాలా. మనస్సు వికలమయింది. గుండె పగిలింది. నా గుండెను అశాంతి పిండి చేసింది. అలా నా ఆశల కోరికలపై విద్యుత్‌ఘాతం తగిలింది.

"పిల్ల మంచి ఏపుగా వుందక్కా! నీ మేలు ఈ జన్మలో మరచిపోను. తగిన ప్రతిఫలమిస్తా. త్వరగా ముహూర్తం జరిపించక్కా" మారాం చేస్తూ యుగంధర్ తొందర పడుతున్నాడు.

నేనప్పుడు ప్రతిమలా చేష్టలుడిగి నిశ్చేష్టురాలినైనా. నాలో దాదాపు చైతన్యం చచ్చి పోయింది. సూత్రం చేత పట్టుకొని నా మెళ్లో కట్టటానికి నాపై కొస్తున్నాడా ద్రోహి. "అయ్యో! అయ్యో! అన్యాయం, ద్రోహం" అంటూ నా రెండు చేతులూ ఎత్తి అరవబొయ్యాను. నా రెండు చేతులు పట్టుకుంది రాంప్యారి. మెడ పట్టుకుంది కామిని. తాళి కట్టాడు యుగంధర్. అక్షతలు చల్లాడు పురోహితుడు. ఫొటో తీశాడు ఫోటోగ్రాఫర్. రెండు దండలు పట్టుకొచ్చి తమ్ముడికిచ్చింది. ఒకటి నా మెడలో వేశాడు. రెండోది తనే వేసుకున్నాడు తన మెడలో. నా నిర్జీవ ప్రతిమని కూర్చోపెట్టి తలంబ్రాలు పోశాడు ధర్. ప్రక్కనుండి ఫోటోలు

తీయించింది రాంప్యారి. ఆశించిన అందాల రాశిని చేసుకున్నాడు ధర్. మూర్ఛ పోయాను నేను.

నా ముఖాన నీళ్లు చల్లారు. బరువుగా కనులు తిప్పి చూచా. ఏడ్పు రాలా. స్థంభించి పొయ్యా. మళ్లా సొమ్మసిల్లి పొయ్యా. తర్వాత ఏమి జరగిందో తెలియదు.

తెలివి వచ్చేసరికి నేనొక మంచంమీద వున్నా. పైన ఫేను తిరుగుతోంది. బల్లమీద కాఫీ, టిఫిన్, పండ్లు వున్నై. అదొక కొత్త ప్రదేశం.

తలచిందొకటి, జరిగింది మరొకటి. అలా నా జీవితం తల్లక్రిందులైంది. నేనూహించనిరీతిలో అలా అడవి కాచిన వెన్నలయింది నా భావి జీవితం. చంద్రంపై నేపెట్టుకొన్న కోరికలు చిగురించకుండానే వాడిపోయినై. 'చంద్రాన్నిక మరచి పోగలనా! పోలేను. మా ఆసలు అడియాసలేనా! అతనెంత విలపిస్తాడో? అతని పొందు చేరజాలని అభాగ్యురాలను. ఇప్పుడేది దారి. తప్పించుకొని పారిపోతే, వివాహితను చంద్రం స్వీకరిస్తాడా! అతడిష్టపడ్డా కుటుంబ సభ్యులు వెలివెయ్యరా! అతన్ని విడిచి మనగలనా! అన్యాయంగా అగాధంలోకి నెట్టివేయబడ్డ అబలను. అయినా సమాజం చంద్రాన్నీ, నన్ను భార్యా భర్తలుగా అంగీకరిస్తుందా? నావల్ల నా చంద్రం అపకీర్తిపాలు కారాదు. అసలు అన్నీ త్రెంచుకుని నేవెళ్లినా....ఏమో నా జీవితంలో ఎలాగూ వసంతంలేదు. అతనన్నా సుఖపడితే అదేచాలు. ఇంత దుర్మార్గాని కొడిగట్టిన ఆ కామిని, రాంప్యారీలు స్త్రీ జాతినే

అవమానపరిచే పరమనీచురాళ్ళు. వారి వంటివారి వల్లనే నారీ లోకానికి ప్రగతిలేదు. ప్రస్తుతం నా కర్తవ్య మేమిటి?

దౌర్భాగ్యుడు, పరమ కిరాతకుడైన ఆ యుగంధర్ మొహం చూస్తే అసహ్యం పుట్టుకొస్తోంది. అతన్ని తాకితే తేళ్లు, పాములను ముట్టుకున్నట్లే. నా జీవితంలో నిప్పులు పోశాడు ద్రోహి. నా నూరేళ్ల పంటలో విషం కలిపాడు. ఇప్పుడేం చెయ్యాలి? ఏమీచేయలేని అశక్తురాల్ని. ఎదుర్కోవటమా, లేక రాజీయా? తిరుగుబాటా? లేక లొంగుబాటా? నా హృదయమప్పుడు ఆటుపోటులమధ్య ఘోషించే సముద్రంలా వుంది. వొడ్డునపడ్డ చేపలాతపిస్తోంది నా మనస్సు. దుఃఖంతో ఒక్కసారిగా నిండు కుండాలా నా మనస్సు బ్రద్దలయింది. చావా? రాజీయా? అని నేను తీవ్రంగా ఆలోచిస్తున్న సమయంలో....

"కాంచనా! నన్ను మన్నించవా? నీవు మన్నించకుంటే నే బ్రతుకే చాలిస్తా."

'ఎవరిదా పిలుపు' తలెత్తి చూచాను.

సముద్రంలోని తిమింగలంలా గోచరించిందా వరుని ఆకారం, ఉలిక్కిపడ్డాను.

"కాంచనా, నా బంగారం! నిన్ను పువ్వుల్లోపెట్టి పూజించు కుంటా. నీమీద మిక్కుటమైన వ్యామోహంవల్లనే ఈ పనికి సాహసించా. నన్నుకనికరిస్తేనే, నీ కాళ్లు విడుస్తా'' రెండుచేతులతో నా కాళ్లు పట్టుకున్నాడు.

"ఇది రాక్షసత్వంకాదా. పెళ్లంటే స్త్రీ పురుషు లిద్దరి అంగీకారం వుండాలా, వొద్దా" చీదరించుకున్నాను.

"కాంచనా! నా ముద్దులగుమ్మా, నీ బంగారు మేను కౌగలించుకొని, నీతో స్వర్గసుఖా లనుభవించాలనే తీవ్రమైన కోరికే నన్నిలా పశువును చేసింది. క్షమించవా!" బ్రతిమాలుతూ, జాలిగా, మహాప్రేమను వలకబోస్తూ అర్థించాడప్పుడు.

అతడొక వయోముఖ విషకుంభంలా తోచాడు నాకప్పుడు. మగాళ్లెంతకైనా తగుదురు. నీచులు, పాపులు. నమ్మించి గొంతులు కోస్తారు. వాళ్ల శ్రేయస్సు, సుఖం తప్ప ఎదుటి వ్యక్తిని గురించి ఆలోచించరు. ఉరిత్రాడులాంటి ఈ సూత్రాన్ని తెంపి వాడి ముఖాన పారేస్తే?

ఏం! నా సుఖాన్ని కోరుకునే హక్కు నాకు లేదా! పరి పరి విధాల ఆలోచిస్తున్న సమయంలో నా భుజంపై అతడు చెయ్యేసాడు. వెంటనే ఒక జలగను తాకినట్లు గగుర్పాటు చెందింది నా శరీరం.

"నీ జీవన సహచరుణ్ణిగా వుండే అర్హత, అదృష్టం నాకు కల్గాలంటే మరో మార్గం తోచలా. నీ క్షమార్హుణ్ణి కాకపోతే నాకు మరణమే శరణ్యం కాంచనా! అందమైన నీ చెక్కిళ్ళను రోజూ స్పృశించి నీతో ఆనందం అనుభవించని జీవితం నిరుపయోగ మనే ప్రబలమైన ఆకాంక్షే నన్ని నీచాని కొడిగట్టించింది. నన్ను మన్నించి నీ భర్తగా స్వీకరించవా?" ప్రాధేయ పూర్వకంగా అడిగాడు ధర్.

"ఛీ! సిగ్గులేదు భర్త అనటానికి! ఆ పవిత్ర స్థానాన్ని మలినం చేస్తున్న కామాంధుడా" అనబోయాను.

"నా ప్రాణప్రదమైన కాంచనా! నా మాట విశ్వశించు. నీకు సర్వ సౌఖ్యాలందించి నిన్ను నా గృహరాణిని చేస్తా" దుఃఖిస్తూ అడిగాడు నన్ను.

"నేనెలాగో సర్వ నాశనమయ్యాను. ఈ క్రూర మృగాలపై పగసాధిస్తా. ఎలా! మార్గాంతర మేమిటి?" అనుకుంటూ నా విస్ఫారిన నేత్రాలతో ముఖమెత్తి యుంగంధర్ కేసి చూచా.

తీక్షణమైన నా కళ్ళు పరమశివుని దావాగ్నిలా భగ భగ మండిపోతున్నై. 'కుసంస్కారా! కుచ్ఛితుడా!' అన్నట్లున్నై నా చూపులు. అతడు నా సంస్కారపు లోతుల్ని చదవలేక తలొంచాల్సిన గతి పట్టిందా సమయంలో.

మంచిగా నేను తనకు లొంగనని గ్రహించాడు ధర్. అందుకే దొడ్డి దారిన జొరబడ్డాడు. అతని పశుత్వాన్ని నే నర్థం చేసుకున్నానంటే, అందుకు నా గాథ నిట్టూర్పులే ప్రత్యక్ష సాక్ష్యం. అత నొక పరమ కిరాతకుడైన వేటగాడుగా, నరమాంస భక్షకుడుగా నా కోమల హృదయంలో సాక్షాత్కరించా డప్పుడు. నా జీవిత అమృత భాండాని కొక విష బీజమైన వాణ్ణి వెన్నుపోటు పొడిస్తే? వాడు హంతకుడు. నేనొక మానవత్వమున్న మనిషిని. అహింసా సూత్రానికి ప్రతిరూపమైన తాత కనుసన్నలలో పెరిగిన సాధువును. ఎలా! ఎలా! ఏం చెయ్యాలి???

"కాంచనా, ఆఖరుసారిగా అడుగుతున్నా. మర్యాదగా నా దారి కొస్తావా లేదా?" కొంచెం గభీర స్వరంతో అడిగాడు. నాపై సామ దాన భేద దండో పాయాలు ప్రయోగించాలని అతని వాంఛ. ఎలాగోలా నన్ను లొంగదీసుకోలేనా అని అతని గర్వం.

చివరికి తనకు ఈ మదోన్మత్తునితోనా వివాహ బంధం? విషం త్రాగి చచ్చినా మంచిదే. నన్ను వాంఛించాడు, మోహించాడు, కామించాడు. మర్యాదగా పెళ్ళి జరగదని అడ్డుదారిన వచ్చాడు. ప్రేమకు, కామానికి, మోహానికి బేధం తెలియని జడుడు. అసలు వీడికి ప్రేమంటే ఏమిటో తెలుసా? వీడి డిక్షనరీలోనే లేదా పదం. తలొంచుకొని ఆలోచిస్తున్న సమయంలో.

"ఏం! జీవితంతో రాజీపడి సుఖ పడతావా? ఎదురు తిరిగి కష్టాల పాలౌతావా?" అధికార పూర్వకంగా ప్రశ్నించాడు.

"మనిద్దరికీ జరిగింది నిజమైన వివాహం కాదు. నన్ను దయచేసి వెళ్ళిపోనీయండి. నే నింతకు ముందే మరొకరికి నా మనసిచ్చాను. మా ఇద్దరి హృదయాలు, మనస్సులు కలిసినై. మాకు మానసికంగా పెండ్లి జరిగింది. ప్రమాణం చేసుకున్నాం." ధైర్యం చేసి చిన్నగా జవాబిచ్చా.

"అదంతా వేద కాలపు పాత ధోరణి. బలవంతునిదే రాజ్యం, భోగం. ఆ చంద్రదంగాడు పొట్టకు, బట్టకూ లేనివాడు! సన్యాసి, సన్యాసి రాసుకుంటే బూడిద రాలినట్లు, వాడు రేపు నీతో స్మశానంలో కాపురం పెడతాడు." హేళన చేస్తూ అన్నా డతడు.

"అనురాగం, ఆత్మీయత వుంటే చెట్టుక్రింద వున్నా అదే హంసతూలికా తల్పంఅవుతుంది. మనస్సొకరికి, మనువు మరొకరితో అయితే వారికి ఆ న ం ద మే కరువవుతుంది" కో ప ం తో సమాధానమిచ్చా.

"మనస్సు నా మీదికి లాగితే పోలా, అదెంత సేపు."

"అదంత తేలికకాదు. మ న స్సు ఒక్కసారే జీవితంలో మరొకరి మనస్సుతో లగ్నమౌతుంది. అది జీ వి తా ం త ం విడివడదు." నిక్కచ్చిగా అన్నా.

"దూకుడుగా అన్నీ ఏదో వే దా ం తి లా ధర్మోపన్యాసా లిస్తున్నావే? తాళి కట్టినవాడి హక్కులు, అధికారాల గురించి నాకు తెల్వదా?" స్వరాన్ని పెంచి కోపంగా అన్నాడు.

"ఎత్తుకొచ్చి తాళి కట్టిన వాడికీ, ప్రేమించి పెళ్ళాడిన వాడికీ హస్తిమ శకాంతరం తేడా వుంటుంది. నీబోంట్ల కసలు నిష్కల్మష ప్రేయసి లభించుట యెండ మావుల లాంటిది."

"ఏందే! పిట్ట కొద్ది, కూత ఘనమన్నట్లు వాగుతున్నావ్. భర్తనే గౌరవం, భయ భక్తులూ నేర్చుకో. నీవు చచ్చేదాకా భరించేవాణ్ణి నేనే." డాంబికంగా పల్కాడు.

"నా పాలిట య మ ధ ర్మ రా జు లు కాకండి! నన్ను నా మా నా న పోనీయండి!" బ్రతిమాలుకుంటూ, "మీకు యావజ్జీవం ఋణపడి వుంటా."

"చేతికందిన పంనుడు జారవిడుచుకునే అంత అవివేకిని కాను తెల్సుకో." ఇక ముందు ఇలాంటి ప్రసక్తి తెచ్చావా వీపు చిట్లుతుంది జాగ్రత్త." ఉరిమి చూచాడు నన్ను. "రంకు మొగుడు కావాలా! తాళి కట్టినవాడు కావాలా! ఏది నీతి" గర్జిస్తూ అడిగాడు.

భయంతో నేను గజగజ వణికి పొయ్యాను. కంటికీ మంటికీ ఏకధారగా ఏడ్చా. వొళ్ళు తెలియని ఆవేశంతో ధర్ కాళ్ళు పట్టుకొని బ్రతిమాలా. ఘొల్లున హృదయ విదారకంగా మళ్ళీ మళ్ళీ ఏడ్చా. లేడి పిల్ల కన్నీరు వేటగాడి హృదయాన్ని కరిగిస్తుందా! నాపట్ల అదే జరిగింది.

"ఆలోచించుకో" తలుపు తాళం వేసి టకటక మంటూ బూట్ల ధ్వనితో వెళ్ళాడు ధర్.

చంద్రానికి, నాకూ సయోధ్య కుదిరే యోగం నా నుదుట లేదు కాబోలు. ఎందుకు లేదు? ఈ ద్రోహి నా దేహానికి తాళి కట్టాడు కాని నా మనస్సును ఆకర్షించగలడా! నాకు జరిగిన అన్యాయానికి ప్రతీకారం చేసి పారిపోతే! ఏమో, చంద్రం నన్ను స్వీకరిస్తాడో లేదో? అతని తల్లిదండ్రులు, బంధువులు అతన్ని వెలి వెయ్యరా? చంద్రానికి వారిని ఎదిరించే ధైర్యముందా? ఉన్నా, సమాజం హర్షిస్తుందా? సమాజాన్ని కాలదన్ని మనగలమా? ఎలాగో నా జీవితం పతనమయింది. అమాయకుడైన అతన్ని కూడా బలి చేయుడం ద్రోహమేమో? ఈ దుర్మార్గుడు నా అందాన్ని కాంక్షిస్తున్నాడు. కాని నాపై నిజమైన ప్రేమ అతనికి లేదు.

ఇతని మాటలన్నీ కట్టు కథలు. ఇతను పచ్చినెత్తురు త్రాగే కసాయివాడు. 'ఖలునకు నిలువెల్ల విషము గదరా' అన్నట్లు ఈ విషనాగు నా పతి. ప్రేమా, త్యాగం, అనుబంధం, ఆప్యాయతలకీ, భావాలకే ప్రత్యర్థులు ఈ తల్లీ పిల్లలు. ఇలా పడి ఉండేకంటే చావే మంచిది. ఆ రోజెప్పుడో! నా కంటే మా అమ్మే ధన్యాత్మురాలు."

ఇలా నేను రకరకాల ఆలోచనలతో తీవ్రంగా సతమతమయ్యే సమయంలో కామిని తెల్లని చీరె, పూలు చేత పట్టుకొని నన్ను సమీపించింది. కామినిని చూచిన నాకు యెదా గుండె పడ్డది. చచ్చినట్లు చేష్టలుడిగి శిలా ప్రతిమలా అయిపోయాను. కామిని హృదయం శిలా సదృశం. ఆమెలో ప్రేమ, అనురాగం, స్పందన కంచు కాగడా వేసి వెతికినా ఏకోశానా లేవు. పగ సాధించే రాక్షసి. ధనం కోసం ఏ అకృత్యమైనా చెయ్యగలదు. అద్భుతంగా నటించగలదు. కొంపలార్పటంలో అందెవేసిన చెయ్యి. నా అంద చందాలు చూచిన ఆమెకు ఈర్ష్యా, అసూయా కల్గినై. తన భర్త నన్ను మా తాత ముత్తత్వల దగ్గర వుంచాడనే నేరారోపణతో అతని నెత్తురు త్రాగేదట రోజూ. తనకు అంద విహీనులు పుట్టారనే ఆశాభంగం వాటికి తోడైంది. అసలు ఆమె 'శాడిష్టు' గా పుట్టిందనేది నగ్నసత్యం. పుట్టింట్లో తమ్ములకు, మరదళ్ళకు, అత్తా కోడళ్ళకు తంపులు పెట్టేదిట. ఇక్కడ ఇరుగు పొరుగుతో, పనివాళ్ళతో కూడా అంతే. భర్తను, సవతి పిల్లలను కాల్చుకు తినేది. ఆమెకు సహకారి, అగ్నికి ఆజ్యం తోడైనట్లు ఆమె తమ్ముడు నరమాంస భక్షకుడు చేయి కలిపాడు. ఆ ఇద్దరికీ నా తండ్రీ, పిల్లలు, మా కుటుంబం ఆహుతై పొయ్యాము.

చివరికి నన్ను ఈ పెళ్ళి పేరుతో బలి చేసిందా పయోముఖ విషకుంభం.

"ఏమే! ఆ పూలు పెట్టుకుని, ఆ చీరె కట్టుకుని శోభనం గదిలోకి పో" గుడ్లురిమి చూస్తూ అన్నది నా సవతి తల్లి.

"పిన్నీ! నాకన్యాయం చెయ్యకు. నా మానాన నన్ను బ్రతకనీ!" అంటూ కాళ్ళకు చుట్టేశా.

"బాగుందీ వరస. మగడు, కాపురం లేకుండా ముండమోసి బ్రతుకుతావా ఏం?"

"అది కాదు పిన్నీ! నాకీ పెండ్లి ఇష్టం లేదు. నేను, చంద్రం పెళ్ళి చేసుకుందా మనుకున్నాం. మా తాతయ్య ఏర్పాట్లన్నీ చేశాడు. నీవు తెమ్మన్నావని చెప్పి నాన్న నన్ను పట్టుకొచ్చాడు. నన్ను తాతగారింటికి పంపవా పిన్నీ" నా కళ్ళవెంట నీళ్ళు జల జల రాలినై.

"పెళ్ళి ఒకడితో, కాపురం రంకు మొగుడితోనా! బాగుంది, బాగుంది నీ నైజం. మాటలు నేర్చిన సెరజాణవు. పిట్ట కొంచెం కూత ఘనం అన్నట్లుంది నీ వ్యవహారం. మా వంశంలో ఇలాంటి రంకు వ్యవహారాలంటే రోత." ఈసడించుకుంది నన్ను.

"అలా అనకు పిన్నీ! నీ కూతుళ్ళకూ, నాకూ తేడా ఏముంది? నేను మాత్రం నీబిడ్డను కానా!" హృదయ విదారకంగా ఆక్రోశించాను.

"నా పిల్లయితే నామాట కాదంటుందా చెప్పు! నీ తండ్రి ఒక కంట్లో బెల్లం, మరో కంట్లో సున్నం పెట్టుకొని, నీకూ-మాకు పక్షపాతం చూపేవారు. అందుకే పక్షవాతమొచ్చి నోరు, చెయ్యి పడిపోయిన్నై. లే! లే! త్వరగా తగులడు. ఇప్పటిదాకా నీ శోభనం గది అలంకరించి వొచ్చా! "సొమ్మొకడిది సోకొకడిది అన్నట్లు సుఖమంతా నీది, వెట్టిచాకిరీ నాది. పద! పద! నా కవతల బొచ్చెడు పని వుంది."

"నన్ను కాస్త ఆలోచించుకోనీ పిన్నీ" రెండు కాళ్లూ గట్టిగా రెండోసారి పట్టుకున్నా.

"ఏందే! ఆలోచన! మొగుడు కాడికి పోవే అంటే ఊరెంబడి తిరుగుతా నంటావు! గుణం తక్కువ దానా! నా తమ్ముడికేం తక్కువని! కులం తక్కువా? గుణం తక్కువా? పద పద" తిడుతూనే అంది.

"అయ్యో! అయ్యో! నాకు చావైనా రాదే! నా తల పగిలి పోదే! మా అమ్మ నన్నెందుకు ఇంత అందంగా కన్నదో!" తల గోడకేసి కొట్టుకుంటున్న నన్ను బలవంతాన ఈడ్చుకెళ్ళి గదిలోకి నెట్టి తలుపు గడియ వేసి తాళం పెట్టింది.

పూల పాన్పు అందంగా అలంకరించి వుంది. అగరు వత్తుల వాసన గది నిండా అలముకుంది. గోడల నిండా అర్ధనగ్న చిత్రాలు, ప్రేయసీ ప్రియుల గాఢాలింగనాల దృశ్యాలు వ్రేలాడు తున్నాయి. తళ తళా మెరిసే వెండి గ్లాసు నిండా పాలున్నై. రకరకాల స్వీట్లు, పండ్లు టేబుల్ మీదున్నై. నేను తలుపు ప్రక్క

గోడకు జారిగిలా పడివున్నా కంటికీ మంటికీ ఏకధారగా ఏడుస్తూ.

"అతను మీదిమీది కొస్తుంటే వెల వెల బోతూ ఏమిటీ అఘాయిత్యం" అనుకున్నా.

గ్లాస్కో లాల్చీ, సిల్కు పంచ ధరించాడు ధర్. నున్నగా దువ్విన క్రాపు నల్లగా మెరుస్తోంది. అత్తరు, సెంటు వాసన గుబాళిస్తోంది. తెల్లని మల్లెదండ చేతికి కుచ్చుగా కట్టాడు. పరమానందంతో నన్ను సమీపిస్తున్నాడు.

"మై డార్లింగ్! కాంచనా! ఐ లవ్‌యూ" అంటూ మృదువుగా సంబోధించాడు" అవ్యాజమైన ప్రేమ నటిస్తూ. ఆకలిగొన్న పులిలా గోచరించిం దతని ఆకారం నాకప్పుడు. భుజం మీద చెయ్యివేసి, శరీరం స్పృశిస్తుంటే నాకు వళ్ళంతా తేళ్ళు జెఱ్ఱులు పాకుతున్నట్లుంది.

అతను నన్ను పాన్పు దరికి చేరుస్తుంటే, గిల గిలా తన్నుకు పోతున్నా నేనప్పుడు. మెత్తని పాన్పు పైకి నన్ను ఎత్తుకొచ్చి పరుండ బెట్టాడు. ముళ్ళ మీద వున్నట్లుగా వుందా పరుపు నాకే. చీరె పట్టుకు గుంజుతుంటే నాకు అతనొక ఉన్మత్తునిలా కనపడ్డాడు. నేనేమన్నా అరణ్య రోదన. నా మొర వినే దెవ్వరు? సహాయ పడేదెవ్వరు ?

అమిత ఉద్రేకంతో నా మీద మీద పడ్తున్నాడు ధర్.

బాణం దెబ్బతిన్న పక్షిలా కొట్టుకుంటున్నాను నేను. అతని పైశాచికత్వం పరాకష్టకు చేరింది. పెనగులాటలో అలసిపోయాను.

నాకు చైతన్యం చచ్చిపోయింది.

ప్రతిమలా నిశ్చేష్టురాలనై పడివున్నాను. అదనుచూచి కాటువేశాడు. అనాఘ్రాత పుష్పాన్ని - అలా నలిపేశాడు. అలా నన్ను చెరిచాడు. అలా ఆ పున్నమిరేయి నాపాలిటి కాళరాత్రి అయింది నర్మదా!

అలా తన కామ వాంఛ తీర్చుకొన్న అతనిపై నాకు జుగుప్స, తిరస్కారం, అసహ్యం కల్గినై. నా అందం, నా నిస్సహాయస్థితి నా పతనానికి దారితీసినై నర్మదా" కాంచన రాతిని కరిగించేలా ఏడుస్తుంటే మహానిబ్బరం, ధైర్యంగల నర్మద మనస్సు వెన్నలా కరిగిపోయింది.

# 10

ఎలుకల బోనులాంటి ఇంట్లో భల్లూకం లాంటి భర్తతో నా కాపురం మొదలయింది, "గతిలేక శరీరాన్ని అప్పగిస్తున్నావా? నామీద వాంఛ కలిగిందా? మర్నాడు రాత్రి నన్ను పరీక్షించాలని అడిగాడుధర్."

"తోలుబొమ్మలకు వాంఛలేముంటాయి" నిర్లిప్తంగా అన్నాను,

వీడికి కోరిక అంటే ఏమిటో, ప్రేమ అంటే ఏమిటో తెలుసా? వట్టి పశువు. ఈ మృగంతో నా జీవితం ఎలా తెల్లవారాలి? ఏమిటి గమ్యం? దానికి మార్గం? గత్యంతర మేది? త్వరలో ఏదోఒకటి నిర్ణయించుకోవాలి. తీవ్రంగా ఆలోచిస్తూనే వున్నా. అవకాశం దొరికితే పారిపోవాలనే ధ్యేయంతోనే వున్నా.

నేను వుంటున్న దేవూరో తెలియదు. అతనికే ఉద్యోగమో తెలియదు. చిన్న ఇంట్లో ఒక భాగంలో కాపురం పెట్టాడు. మంచి మంచి బట్టలు, పూలు, మిఠాయీలు తెస్తూండేవాడు. ఇంట్లోకి సరుకులన్నీ తెచ్చి పడేశేవాడు. ఏ రాత్రో వచ్చి పోతూ వుండే వాడు. బైటికి వెళ్ళే టప్పుడు తాళం వేసు కెళ్ళేవాడు. మా ఇంటి ఎదురుగా ఒక కిళ్ళీ కొట్టుంది. ఆ కొట్టువాణ్ణి నాకు కాపలా పెట్టాడని నా కనుమానం. భార్యా భర్తల ఆప్యాయతా లేదు, అవ్యాజానురాగంలేదు. అప్పుడప్పుడు నన్ను అతను పొగడుతుంటే నాకదంతా నాటకీయంగా వుండేది. ఎక్కడ పుట్టాను! ఎలా పెరిగాను! పరిస్థితుల కెలా బానిసనైనాను! అనుకున్నదొకటి, జరిగింది మరొకటి. జీవితమంతా అడవి కాచిన వెన్నెలయింది. తాత, అవ్వ, తండ్రి, అన్నల సంగతే తెలియదు. అదొక జైలులా వుంది నా ప్రాణానికి. చద్దామా? ఎప్పుడు? ఎలా? నిరంతరం ఆలోచిస్తూనేవున్నా - ఈలోగా గర్భవతినైనా, కరువులో అధిక మాసమా? అన్నట్లు ఇదొక మార్పు. తాదూర సందులేదు, మెడకొక డోలట! అలా అంతా తారుమారయింది. చివరికి నా బ్రతుకు పంజరంలోని రామచిలకలాగా తయారయింది.

మాతృత్వం ప్రతి స్త్రీకి అమృతపు జల్లే కావచ్చు. కాని నాకు మాత్రం అది ఆశనిపాతమే అయింది.

రాను రాను యుగంధర్ ఇంటికి రావడం తగ్గించాడు. 2, 3 రోజుల కొకసారి రావటం మామూలయింది. ఏ అర్ధరాత్రికో వచ్చి బలవంతంగా తన అవసరం కాస్తా తీర్చుకొని పొయ్యేవాడు. నా యోగక్షేమాల విషయం అడిగేవాడుకాదు. గర్భిణినని ఏమాత్రం శ్రద్ధ చూపే వాడుకాదు. ప్రత్యేకంగా మాంసంకూర వండించుకుని పూర్తిగా తినిపొయ్యేవాడు. ఏవో, ఎందుకో మందులు వాడుతూ వుండేవాడు. తాను ఘనకార్యాలుచేసి కాళ్ళు పిసిగించుకొనేవాడు. 7, 8 సార్లు తిట్టటం, తన్నటంకూడా జరిగినై. నేను మాత్రం చిత్తరువులా చూస్తూ తటస్థంగా వుండేదాన్ని.

తనకేదో పెద్ద వుద్యోగమని, అది విశ్రాంతిలేని పని అని మొదట్లో కల్లబొల్లి మాటలు చెప్పి నన్ను నమ్మించాడు. రెండు సార్లు మాత్రం సినిమాకు తీసుకెళ్ళాడు రెండో ఆటకు. అది తప్పితే వీధి మొగమే నే నెన్నడూ చూడలా. ఎప్పుడూ నీట్‌గా ముస్తాబై బైటికెళ్ళేవాడు. అనాకారియైనా మేకప్పువల్ల జబర్దస్తీగా వుండేవాడు. నాకు మాత్రం పగలు-రాత్రి తేడా లేదు. చిగురించని యెడారిలా అయింది నా కాపురం. నేను అందగత్తెనుగదా! ఎవరు చూస్తారో, ఏంజరుగుతుందోనని అమేషా కనిపెట్టి వుండేవాడు. నేను రెండో మనిషినే చూచి ఎరుగను దాదాపు ఆరు నెలల వరకు.

ప్రక్క భాగంలోకి కాపుర మొచ్చిన అలికిడి అయిందొక నాడు. కిటికీలోంచి వీధివైపు చూచా. ఒక యువతి, ఒక యువకుడు

చెరి ఒక సంచితో ప్రక్కవాటాలో దిగారు. జనశూన్యమైన ఆ ఇంట్లో జనసంచారం కలిగినందుకు నాకు పరమానందంగా వుంది. ఎవరబ్బా! ఎందుకొచ్చారు? పలకరిస్తే? ఏమో? అసలే ఈమధ్య చిఱ్ఱు బుఱ్ఱు లాడుతున్నాడుధర్. క్రితం రాత్రి జరిగిన ఒక సంఘటన నాకప్పుడు గుర్తు కొచ్చింది.

"ఏమే! ఓయ్! పలకవే! నువ్వు మనిషివా? పశువ్వా? ఇంట్లో ఏ రంకు మగడితో కులుకుతున్నావ్? తలుపు దబా దబా బాదాడు ధర్. రాత్రి 12 గం॥ లప్పుడు అలా ఘీంకరిస్తుంటే రోడ్డు మీద ఎవరైనా విని నవ్వుతారేమోనని భిడియపడ్డా. బాత్‌రూమ్ నుండి నే రావటం 2 నిమిషాలు ఆలస్యమయింది. నేనదే చెప్ప బొయ్యా. ఇంతలో చేతిలోని బాటిల్‌తో నా నెత్తిన మొత్తాడు. "మొగాణ్ణి, పైగా నీ మొగుణ్ణి, అంత చులకనా నేనంటే." అంటూ అరిచాడు.

నే పలకలా - ఉలకలా మౌనంగా తలవొంచుకున్నా. నా మౌనం అతగాడి అహంపై దెబ్బతీసింది. దాంతో మండి పడుతూ—

"పొట్టపగిలేలా తినడం, అడ్డంగా పెరగడం. నీవల్ల నాకేం లాభంలేదు. పెట్టుబడంతా దండగౌతుం" దంటూ నా మీదిమీది కొస్తున్నాడు. నేనా నరరూప రాక్షసుణ్ణిచూచి భయపడలా. నేనంత కంటే అతణ్ణిగురించి ఆశించిందేమీలేదు కనుక. అయితే, నావల్ల లాభమా! అంటే, అర్థంకాక తికమకపడ్డా.

"భోంచేస్తారా? వడ్డించేదా? తెప్పరిల్లి నెమ్మదిగా హీన స్వరంతో అడిగా."

"నాక్కావల్సిందదికాదే! రా! రా! చెయ్యిపట్టిలాగాడు నన్ను. నామీద ప్రేమలేదని, నా దేహంకోసమే వస్తుంటాడని తాళికట్టిన నాడే నాకు తెల్సు.

"గర్భవతినండీ" వెనక్కు పోబొయ్యా.

"నామాట కెదురు చెప్పగల సాహసముందా నీకు" నిన్ను కట్టుకుంది మేపటానికా? నా అవసరాలు తీర్చటానికా? ఒక తోపు తోశాడు నన్ను. ఆ కర్కోటకుడు రోజూ ఏదో మిషమీద నన్ను హింసించటం రానురాను పెరుగుతోంది. మొదట్లో చావటానికి సిద్ధపడ్డ నేను ఇప్పుడందుకు సిద్ధంగా లేను. పుట్టబొయ్యే బిడ్డను పిండం రూపంలోనే నశింపుచేయుటానికి నేనొడిగట్టలా. నాటినుండి ఎన్ని చిత్రహింసలకు పాల్పడినా, జీవితంలో జరుగుతున్న మార్పులకు నిర్లిప్తంగా రాజీ పడటమే ముఖ్య విధిగా భావించాను నర్మదా."

ఒకరోజు జ్వరం వచ్చింది. కక్కులతో సొమ్మసిల్లి పడి ఉన్నాను. మందిచ్చే దిక్కులేదు. అలనా పాలనాచూసే నాధుడు లేడు. నిస్త్రాణతో, నిస్తేజంగా, చైతన్య రహితంగా నా గదిలో ఎంతసేపు ఉన్నానో నాకే తెలియదు. గదిబైట వరండాలో వాళ్ళ సంభాషణ వినిపిస్తోంది నాకు.

"ఏరా తమ్ముడూ! అవసరంతీరాక అల్లుడు వెధవన్నట్లు నెలకు రెండు వందలు ఇస్తానని బొంకి నన్నే మోసంచేస్తావట్రా!

దీని ప్రతిఫలం అనుభవిస్తావులే" అది నా సవతి తల్లి గొంతులా వుంది. అరవకే అక్కా! ఆ కాంచీ ముండ వింటుంది. దానికి మూడు రోజులుగా కక్కులు, జ్వరం వచ్చి పడివుంది. లేస్తే మన గుట్టు బయటపడుతుంది. నెమ్మదిగా అడుగు." అని నా గది తలుపు దగ్గరగా వేసి వరండాలోకి వాళ్ళు వెళ్ళారు. "అక్కా నీమేలు ఈ జన్మలో మరచిపోగలనా? బంగారు గుడ్ల బాతులాంటి కాంచనను నాకర్పించావు. కానీ ఇంతవరకు పొదగలేదంటే నమ్ము అక్కా."

"ఏం ఎదురు తిరిగిందా? ఆ తండ్రీ కూతుళ్ళతో మనం వేగలేం. అయినా నీ మగతనమేమయిందిరా?"

"ఉండవే అదిప్పుడు పొట్టతో వుందే!"

"ఆహా నీ అదృష్టం పండిందిలే. చక్కని పిల్లలు పుడతారు."

"ఏమో నాలాగా పుడితే!"

"సరేగానీ ఏంచేస్తున్నావిప్పుడు? ఎలా జరుగుతుందిరా?"

"వ్యాపారం మందగించింది అక్కా. ఈ ప్రభుత్వాధిపతులతో, పోలీసులతో సతమతమయి పోతున్నాను. మునుపటి లాభాలులేవు. పైగా కొద్దిపాటి లాభాలలో వాళ్ళకు వాటాలు ఇవ్వాలి. ఇంత చేసినా తప్పులుపట్టడం మానరు. ఇదో విషవలయం అక్కా. అబ్బ ఈ వ్యాపారం చేసేదానికన్నా అడుక్కు తినేది మేలు. అడుగడుగునా గండాలే, అడకత్తెరలే. ఒకడుకాదు, ఇద్దరుకాదు, అన్ని ప్రభుత్వశాఖల ఉద్యోగుల తాకిడీ ఉంటుంది

మాకు నిభాయించడం కష్టంగా ఉంటున్నది అక్కా. అందువల్లనే నీకిచ్చిన మాట నిల్పుకోలేకపోయాను. ఇక ఇలా జరగనీయను. నా మాట నమ్ము. ప్రతినెలా 1వ తేదీకి చేరేటట్లు మనియార్డర్లు పంపుతాను."

"ఈ కథంతా నాకెందుగ్గానీ నాసంగతి తేల్చి చెప్పు. రేపు పోవాలి. ఆ ముసలాడు గుటుక్కుమనేట్టున్నాడు రేపో మాపో. పిల్ల బొందలు నా ప్రాణాలు చీరేస్తున్నారు. డబ్బుకోసమే వచ్చా. నీవిచ్చిన 5 వేలు ఏనాడో హతం అయినై. నెల నెలా పోష్టువాణ్ణి అడిగి అడిగి విసుగెత్తి పరుగెత్తుకొచ్చా.

"ఈరోజే అమ్మ గోల పడలేక అయిదొందలు పంపా. ఈ వంద పుచ్చుకో. నెల నెలా మూడొందలు ఖచ్చితంగా పంపుతా"

నా దగ్గువిని మాటలు కాసేపు ఆపివేశారు.

డబ్బుకోసం నన్ను ధర్‌కి అంటగట్టింది అనే అనుమానం నిజమయింది. ఇద్దరూ కలిసి కుట్రచేశారనే విషయం రూఢి అయింది. ధర్ ఏదో అవినీతికరమైన వ్యాపారం చేస్తున్నాడనేది అబద్ధం కాదని నిర్ణయించుకున్నా. ఈ దుష్టులిద్దరూ ఎక్కడ చేరితే అక్కడ సర్వనాశన మౌతుంది. నా దురదృష్టంకొద్దీ నేను వాళ్ళ వాతపడ్డానని రోదిస్తున్న సమయంలో "దాని తాతా, భార్గవి వాళ్లకు మన ఆచూకీ, పెళ్లి వ్యవహారం తెలిసిందా? ఆ శాంతమ్మ, ఆ ముసలాడు దీని సంగతి విని చచ్చారా?" కుతూహలంగా అడిగాడు ధర్.

"నీ పెళ్ళిచేసి నేవెళ్ళా. కాంచీ వివాహ విషయం గురించి దీని తాతనుండి రోజూ ఒక వుత్తరం వచ్చేది. అన్నీ చింపి పారేసేదాన్ని! ఒకనాడెవరో విద్యార్థి వచ్చాడు. వాణ్ణి నానా మాటలు అడిగి దాని రంకు మగడివా అని గెంటేశా."

"దాని ప్రియుడు చంద్రం వున్నాడులే, వాడే వచ్చి వుంటాడు. మంచిపని చేశావు. ఈ పిట్ట ఆచూకి కోసం పసిగడదా మని వచ్చి వుంటాడు. దాన్ని వీడూ, వీణ్ణి అదీ 'లా' చేశారట" వెకిలిగా నవ్వాడుధర్. "తర్వాత సంగతి విన్నావా? దీని పినతల్లి భార్గవి ఊడిపడిందొకనాడు. ఏంజరిగిందో? ఏంచేశానో చెప్పనా?" చెప్పు, చెప్పక్కా.

* * *

"ఇంత రాత్రి వేళ ఒంటరిగా ఎలా వచ్చావమ్మా? స్టేషనుకు మనిషినైనా పంపేవాడిని కదా? అలా తత్తరపడి పోతున్నా వేమిటమ్మా! ఏంజరిగింది" దయానిధి ఆకులానుండి వచ్చిన భార్గవినిచూచి ఆతురతతో ప్రశ్నించాడు.

"జరగరానిదే జరిగింది నాన్నా!" అన్నది భార్గవి.

"అదేమిటమ్మా! అంత ఘోరకలి ఏమిటో చెప్పు."

"అదే మన కాంచన పెండ్లి గురించే. దాని విధివిలాసం అలా అయిందినాన్నా. అసలే తల్లిలేని పిల్ల. నోట్లో నాలికలేని ఉత్త అమాయకురాలు. తెల్లని వన్నీ పాలు, నల్లనివన్నీ నీళ్ళు అని నమ్మే మాయామర్మాలెరుగనిది. దానినోట్లో ఆ సవితి తల్లి దుమ్ముపోశింది నాన్నా"

బావురుమంది భార్గవి పిన్ని....

కాంచన వెళ్ళాక దయానిధీ, శాంతమ్మా అనేక క్షేత్రాలు, అజంతా ఎల్లోరా, తాజ్‌మహల్ లాంటి వినోద కేంద్రాలు దర్శించి వచ్చి మూడు నెలలయింది. అప్పటినుండి కాంచన పెండ్లి విషయమై ఎన్ని వుత్తరాలు వ్రాశినా సమాధానంలేదు. సమాచారం తెలియలా. పిల్ల గురించి భయపడ్డారు. చివరికొకనాడు "నే వెళ్ళి కాంచనను తెస్తా నాన్నా; ఆ పెండ్లి వేడుక ఇక్కడే జరిపిద్దా" మని బయలుదేరి అకులా వెళ్ళింది భార్గవి. కామిని ఇంటికి వెళ్ళింది భార్గవి. కాంచన కోసం భార్గవి కళ్ళు ఇల్లు నలుమూలలా వెదికాయి. దొడ్లోకూడా చూశాయి. జాడలేదు. భార్గవి గుండె గుభేలుమంది. 'నా బంగారు తల్లి ఏమయిందీ?' అనుకుంటూ గదిలో కొచ్చి బావ బద్రీనాధ్‌ని చూచి నిశ్చేష్టురాలయింది. ఆ ప్రాణం కొనవూపిరితోవుంది! అపస్మారకంలో ఉన్నాడు బద్రీ. చూచే దిక్కూ మొక్కూ లేదు. వైద్యం జరుగుతున్న జాడ లేదు. ముఖం కదిలించి "బావా! బావా! నేను భార్గవిని. ఇలా అయిపొయ్యా వేం? ఉత్తరమైనా లేదు. పిల్లలేరీ? కాంచి ఏమయిందీ! చివరకు నీది ఇంత నికృష్టపు బ్రతుకయిందా?

బద్రీ కళ్ళు తెరిచి భార్గవి వంక వెఱ్ఱిచూపు చూచాడు "బావా! బావా!" అంటూ భార్గవి ఏడుస్తున్న సమయంలో పెద్దగా రొదచేస్తూ ఊడిపడింది కామిని.

"కొట్టు కట్టేసి గంటయినా ఆ రవీ, రంజన్‌గాళ్ళింకా ఇంటికి చావలా. ఆడామగా పనులన్నీ నే చేయలేక చస్తున్నా" అంటూ బజారునుండి పండక్కు తను తెచ్చుకున్న రెండు చీరెలూ బల్లమీద పెడుతూ భార్గవినిచూచి మూతిముడిచింది కామిని.

"అక్కా! బావకేం జబ్బుచేసిందమ్మా! మా వుత్తరాలకు జవాబే రాలేదని, చూచి చూచి వచ్చానమ్మా! కాంచి ఎక్కడి కెళ్ళింది? పిల్లలంతా బాగున్నారా?" ఆత్రుతతో అడిగింది భార్గవి.

"ఆయనకు పక్షవాతంవచ్చి మంచానపడి పీక్కుంటున్నాడు. ఆ ప్రాణం ఎప్పుడు గుటుక్కు మంటుందోనని దాని కన్నె చెర విడిపించాలని హడావుడిగా పెళ్ళిచేయించా" అంటూండగానే.

"ఆ! ఆ! ఎంతపని చేశావమ్మా! మేమంతా కాంచికోసం అల్లాడిపోతున్నాం. అది మా కంటి వెలుగు; మా ఇంటిదీపం. మా అమ్మా, నాన్నా దిగులుపడి అల్లాడిపోతున్నారు. ఇంతకూ ఎవరితో జరిపావు పెళ్ళి?" భయపడుతూ, ఆదుర్దాతో అడిగింది భార్గవి.

"నా తమ్ముడి కిచ్చి చెయ్యమని దాని తండ్రి చివరి కోర్కెగా చెప్పాడు. వ్యవధిలేక గుళ్ళో పెళ్ళి చేయించా. ఏం! నా తమ్ముడికన్నా దొడ్డవాణ్ణి తెస్తారా?" ఈసుగా చూచింది కామిని. భార్గవికి ఒళ్ళంతా కారం పూసినట్లయింది. "అమాయకురాల్ని, మసిపూసి మారేడికాయను చేసి ఇలా దగాకోరు పన్ను చెయ్యటానికి నీవు పిల్లలు గల దానివి కావా?'' కోపంతో మండిపడ్డది భార్గవి.

"కూతురి పెళ్ళికి అధికారి తండ్రా? తాతా? పోదాంపద కోర్టుకాడికి. అసలు నువ్వెవ్వరు? దాన్ని కన్నావా? ఫో! ఫో! అంటూ నాలుగు దులిపింది కామిని.

"పిల్లలొచ్చేదాకా నేపోను, వాళ్ళను నాతో తీసుకెడతా."

"వాళ్ళ తండ్రి వస్తుంటే వాళ్ళు నీతో రావాలా? రేపు కర్మా, గిర్మా చేసేదెవరంటా? ఈ ఇంటిపై, ఈ పిల్లలపై నీకే అధికారం లేదుపో" అసహనంతో మాట్లాడుతోంది కామిని.

"కాంచీ ఎక్కడుందో, ఏవూరో? అడ్రసన్నా చెప్పమ్మా"

"నా తమ్ముడు పెద్ద ఆఫీసరు. ఇవ్వాళొకచోట రేపొకచోట 'టూర్లు' తిరగాలి. నాకసలేం తెలియదు. తల్లి చావు పిల్లలయినా, దాని అదృష్టంపండి వాడి పెళ్ళామయింది. దిక్కుమాలినదాన్ని ఎవడాశిస్తాడు?" ఆమె ధోరణి భార్గవి భరించలేకపోయింది. బావదగ్గరికెళ్ళి మరోసారి చూచి బైటకొచ్చింది. పిల్లలొస్తారని వాకిట్లో తారట్లాడుతోంది.

"దేనికైనా హద్దూ, పద్దూ వుండాలి. నా కుటుంబ వ్యవహారంలో నీ జోక్యమేమిటీ? ఇది సంసారుల లక్షణం కాదు" తలుపు దభీమని వేసివచ్చింది కామిని.

ఇక భార్గవి సహించలేక ఆ గాఢాంధకారంలోనే రైలెక్కి శాంతిగ్రాం చేరింది - తల్లినీ, తండ్రినీ చూచి కాంచన కథ చెప్పి భోరున ఏడ్చింది భార్గవి.

"ఇంతకూ అందరంకలిసి దానినీగతికి తెచ్చాం. తండ్రి రమ్మనటం, నే పొమ్మనటం, అంతా కాకతాళీయంగా జరిగినై. ఆ పిల్ల అక్కడా, చంద్రం ఇక్కడా జీవితాంతం ఏడుస్తారు. ఇందుతో నా ప్రమేయమే హెచ్చుగా వుంది, భార్గవీ"

"కాంచీ వెళ్ళాక ఆకలీ, నిద్రా రెండూ కరువై ఏడుస్తున్నా భార్గవీ! దాని రాక నా బిడ్డ విశాలిని మరపించింది. నా కంటిలో పాపగా మెరిసింది. అమ్మమ్మా! అంటూ క్షణమైనా విడిచేదికాదు. నోట్లో నాలికలేని పిల్ల. చచ్చిపోయిన నా బిడ్డ, బ్రతికివున్నా కాంచీ''....

"అలా అనకమ్మా! కాంచిని గాలించి తెద్దాం. మన ముగ్గురం బ్రతికివుండగా"....

"తాతయ్యా నేపోనని కాళ్లు చుట్టేసుకున్న పిల్లను తల నిమిరి నీకు చంద్రతో తప్పక పెండ్లి చేస్తానని వాగ్దానంచేశా నానాడు. నమ్మించి దాని గొంతు కోశాం. ఇప్పుడు దాన్నా అఖాతం నుండి బైటపడేసేందుకు నా సర్వశక్తులూ వొడ్డి ప్రయత్నిస్తా''

"మన ప్రయత్నాలిప్పుడు ఫలించే దశ దాటిపోయింది నాన్నా''

పొంగివస్తున్న దుఃఖాన్ని దిగమ్రింగుతూ అన్నది భార్గవి.

"పట్టపగలే సూర్యునిలా ప్రకాశించే నా చిన్నారి కాంచిని పగిలిన గాజుముక్కలా పెంటకుప్పమీద విసిరిన ఆ కామిని ధనమూ, బ్రతుకూ, రెండూ అశాశ్వతాలే. మిగిలేది, మన మనస్సుకు తృప్తినిచ్చేది మనం చేసే త్యాగఫలాలే. భార్గవీ!''

"త్యాగము అంటే కుసంస్కారుల డిక్షనరీలోనే వుండదు నాన్నా!"

"ముత్యపు చిప్పలోని వర్షపు చినుకు ముత్యమవుతుంది. ఆ బోతుమీదపడ్డ వర్షం నేలపాలౌతుంది.

"నీ ధర్మపన్నాలు ఆ నరమాంస భక్షకులకు కర్దమవుతయ్యా నాన్నా!"

"వయోవృద్ధుణ్ణి, భవబంధాలు లేనివాణ్ణి, ముత్యంలాంటి కాంచిపై నాకెందుకో ఎనలేని వాత్సల్యం వుండేది భార్గవీ!"

"ఆ పిల్ల రూపవయోగుణాలలాంటివి నాన్నా" అందరికీ తల్లో నాలుకలా మెసిలేది. ఎవ్వరినీ నొప్పించేది కాదు. ఎంతటి కష్టమైనా హృదయంతో ఇముడ్చుకోగల ఆ చిన్నారికి సాటి ఎవ్వరు నాన్నా"

"ఒక్కసారి దాన్ని చూచి జరిగిన అన్యాయానికి ఓదార్చాలని వుందమ్మా."

"ఏదైనా గతించిన దానికి వగచి ప్రయోజనంలేదు. మనమిప్పుడు చేయగలిగింది ఏమీ లేదు నాన్నా"

"ఎక్కడుందో, ఎలావుందో, అసలు తల్లితోపాటు సుదీర్ఘ విశ్రాంతి తీసుకొని ఈ అనంత వాయువుల్లో కలిసిపోయిందో?"

"అలా అపశకునాలు అనకు నాన్నా"

"వీడు ఆ యుగంధర్ మహాక్రూరుడమ్మా! మేకవన్నెపులి. అధః పాతాళానికి దిగిన పరమనీచుడు. వాడి పేరు వుచ్చరిస్తే మనంకూడా పతనమౌతామమ్మా"

దయానిధీ, శాంతమ్మా, భార్గవీ కాంచి కోసం గాలించారు. దయానిధి శిష్యులందరికీ వ్రాశాడు. చేసేదిలేక పలిగిన గుండెతో తల్లడిల్లిందా ముసలిప్రాణం. పెంచినప్రేమ ఎంత ఘాటైనదో! కామిని భార్గవి పిన్నికి చేసిన అవమానాన్ని వివరంగా చెప్పింది తమ్ముడుధర్‌తో. డబ్బు ఏర్పాట్లు మాట్లాడుకొనివెళ్ళింది.



ప్రక్క వాటాలోకి వచ్చిన ఆవిడను చూడాలనే కుతూహలం నాకు ఎక్కువైంది. మనుషులను చూడటానికి నోచుకోని నాకు ఆ ఉత్కంఠ సహజమేకదా! ఇతరులతో మాట్లాడటానికి వీలు లేకుండా యుగంధర్ ఇంటికి తాళం వేసుకొని వెళ్తున్నాడు. కాకపోతే మా ఇంటిలో రెండు వాటాల వారికీ ఉమ్మడి దొడ్డి ఉంది. కనుక దొడ్లో ఆడవాళ్ళం మాట్లాడుకోవడానికి అంత ఇబ్బంది లేదు. దొడ్లోనుంచి ప్రక్కవాటా ఆమెను పలకరించా ఒకనాడు.

"రాండి వదినగారూ! కూర్చోండి"

నేలమీద తువ్వాల పరచింది ఆమె.

"నీ పేరేమిటమ్మా"

"బీనాదేవి"

మళ్ళీ ప్రశ్నించటానికి మోమాట పడ్డాను. బీనాదేవి మంచి చలాకీపిల్ల. మనిషిని చూడగానే వ్యక్తిత్వాన్ని మదింపుచేయుగల దిట్టగా కన్పడింది.

ఇరువురిమధ్య మౌనాన్ని ఛేదిస్తూ.

"వదినా అన్నగారు ఇంట్లో లేరా" ఇంట్లో వుంటే దొడ్డి గుమ్మాన వచ్చి నాతో మాట్లాడే హక్కు నీకు లేదని ధ్వనిస్తోం దామె పసజాలం.

అబ్బ! ఎంత సూక్ష్మ గ్రాహి! ఈ పిల్లకు 18 ఏళ్ళకన్నా లేవే! చాలా కొంటెగా, మళ్లీ గౌరవంగా మాట్లాడగల ధీశాలి. ఆనందం కలిగింది నాకు అలాంటి స్త్రీతో పరిచయం అవుతున్నం దుకు. చనువుగా మాట్లాడుతోంది. పరవాలేదనిపించింది.

"ఏంపనిమీదొచ్చారమ్మా! మీదేవూరు? ఆయన నీ భర్త గారేనా?'' కరువుతీరా ప్రశ్నలు కురిపించాను.

ఎన్నాళ్లయిందో! మనుషులతో మాట్లాడి. "నీవు అన్యథా తలచకపోతే''....

''ఆ, తలచకపోతే ఏమడుగుతావు వదినా!''

''..............."

మరి అడగవేం?

"అబ్బ ఈ పిల్లతో నే తట్టుకోలేను బాబు. తికమక పెడు తోంది" అనుకున్నాను.

" ఆ! అర్థమయింది వదినా! పిల్లలెందరని కదూ నీ అనుమానం!" పెద్దగా పకపకా నవ్వింది దేవి.

లేడిపిల్లలా పరిగెత్తి కాగితం ముక్కతో కాసిని శనగగుగ్గిళ్లు తెచ్చి ముందుపెట్టి చిన్న గాజుగ్లాసుతో మంచినీళ్లిచ్చి 'తీసుకో వదినా' అంది అప్యాయంగా.

"ఏమమ్మా, సామాను గట్రా ఏమీలేవు. ఎలా కాలక్షేపం చేస్తున్నావో! వారమైనా నిన్ను పల్కరించనందుకు సిగ్గుపడుతున్నా దేవి! ఏమన్నా కావాలంటే అడుగు తల్లి."

"ఆ, కావాల్సినవన్ని అడుగుతా! నీ సాయం నాకు చాలా కావాలి" ముందు నీ పరిస్థితి సరిదిద్దుకోగలిగితే-అన్నట్లుచూచింది దేవి నావైపు, "ఆ! ఏమికావాలో చెప్పనా?"

"ఆ, సర్వం అడుగుతా కానీ" నాకేదో మహా.... ఇంటిమీద సామాను మీద సర్వహక్కులు వున్నట్లు, నాకు సాయం చేసేట్లు....! "ఈ చేదు నిజాన్ని బైటపెట్టానని బాధగా వుందా వదినా!"

"లేదమ్మా నిష్కపటి, సచ్ఛీలంగల పిల్ల నర్మ గర్భింతంగా మాట్లాడలేదని, నాకు తెలుసు"

"వదినా! మన జీవితాలు ఏటికెదురీతలు. అరిటాకుజీవితాలు. రాత్రి మీవారి ఉరుములు మెరుపులు విన్నానమ్మా!"

నాకు ఆశ్చర్య మయింది. ముక్కూ, మొగం తెలియని తనతో సూటిగా ఆప్యాయంగా మాట్లాడుతోంది. ఎన్ని రకాల జీవితాలున్నై ఈ పృధ్విలో! కొన్ని విషాదాంకితాలు, మరికొన్ని సుఖమయాలు, ఇంకా కొన్ని అటూ ఇటూ అనుకున్నాను.

"వదినా! నీ మనస్సు గాయపరచానా?"

పరధ్యానంగా ఆలోచిస్తున్న నేనుత్రుళ్ళిపడ్డాను. "కాదమ్మా! ఇంత చిన్నపిల్లవి ఎంతో జీవితానుభవమున్న వాళ్ళ తీరులో మాట్లాడుతున్నావని.''

"పరిస్థితులే జీవితానుభవా న్నిస్తాయి వదినా! అవ్వే మమ్మల్ని ఈ స్థితికి తెచ్చినై. పరిసరాలను మనం అదుపులోకి తెచ్చుకొనుటే ముందడుగు. మనం వాటికి లొంగిపోవటమే తిరోగమనం. పురాతన భావాలు, సంప్రదాయం వ్యక్తిత్వానికి గొడ్డలిపెట్టు. అవి మనపై ధ్వజమెత్తి దెబ్బతీస్తున్నై. వాటిని కూకటి వ్రేళ్ళతో పెళ్ళగించాలంటే ఒక రాంమోహనరాయ్, ఒక వీరేశలింగం పంతులు, ఒక గురజాడ మళ్ళీ పుట్టాలి. ఈ సమాజంలో మూఢాచార నిర్మూలన ఎంత కష్టమో! వాటి స్థానే ఆధునికతను ప్రవేశపెట్టటం అంతకన్నా దుర్ఘటం. కానీ ఎప్పుడో, ఎక్కడో అక్కడ ఈ ప్రయత్నాన్ని ప్రారంభించాలి కదా! దానికి చిత్తశుద్ధి, గుండె నిబ్బరం, పట్టుదలా వుండాలి. మా ఇద్దరి జీవితాలూ అలాంటివే. పెను తుఫానులో పడి క్రుంగి కృశించకుండా ధైర్యంతో అపజయాల్ని ధిక్కరించి బైట పడ్డాం వదినా!''

"అదేమిటి దేవి! ఇంత పిన్న వయసులోనే అంత గత చరిత్ర నీకుందామ్మా!" నమ్మశక్యం కావటంలేదు. మరోలా అనుకోకు తల్లీ. మనస్ఫూర్తిగా అడుగుతున్నా నీ కథ చెప్పవా?"

క్షణంలో దేవి ముఖకవళికలు మారినై. గత స్మృతి కళ్ళలో మెదిలింది. కొద్దిగా చలించింది. వెంటనే ధైర్యాన్ని చిక్కబట్టి

జరిగిందంతా చెప్తోంది. కాని చెప్పే తీరులో క్రొత్తదనం ఉంది. అదేదో కథ చెప్తునట్లు నిర్లిప్తంగా సాగించింది కథనాన్ని.

పరమ శ్రోత్రియుడు, అగ్రహారికుడు, దేవాలయ ధర్మకర్త, భూస్వామి రామావధాని. అతని ఏకైక పుత్రిక బీనా దేవి. 15 సంవత్సరాలు నిండినై. మెట్రిక్ పాసై పట్నం కాలేజీ చదువు కెళ్ళింది. తాతలనాటి అగ్రహారాలకు వారసుడు అవధాని. వడ్డీ వ్యాపారంలో సిద్ధహస్తుడు. అప్పు చెల్లించలేక బీద రైతులు పొలాలు, కుంటలు అవధానికి ధారాదత్తం చేసి, వాళ్ళ పొలాల్లో వాళ్ళే కూలిపని చేస్తూ, గంజి నీళ్ళతో ప్రాణాన్ని నిల్పుకోవడం ఆనవాయితీ అయిందా గ్రామంలో.

సుబ్బన్న తండ్రి అప్పన్న హరిజనుడు. అవధాని ఇంటి పాలేరు. భార్య పురుడు కష్టమై పట్నం పోవటానికి అప్పు పడ్డాడు అవధానికి. అది చెల్లక సుబ్బన్నను అవధాని ఇంట్లో వెట్టిచాకిరీ క్రింద జమ కట్టాడు తండ్రి. అప్పన్న, భార్య, కొడుకు సుబ్బన్న జీవితాంతం ఎండా, వాన, రాత్రి, పగలు, లేక చాకిరీ చేస్తూనే ఉన్నారు. సుబ్బన్న కొడుకు రఘురామ్. తన గతి వాడికి పట్టరాదని పట్నంలో మామ అధీనంలో వుంచి, వాణ్ణి హరిజన హాష్టల్లో పెట్టి చదివించాడు సుబ్బన్న. వాణ్ణి అవధానికంట పడకుండా పురిటికి పుట్టింటి కెళ్ళిన భార్య అప్పలమ్మచేత బిడ్డను మామ కిప్పించి అప్పలమ్మను మాత్రం తిరిగి తెచ్చుకున్నాడు సుబ్బన్న.

ఆరోజు హాష్టలు డే. హాలంతా చక్కగా అలంకరించారు. అబ్బా! ఎంత సహజత్వం ఉట్టిపడుతున్నది పల్లె పడుచు, బొమ్మలో!

ముంగురులు గాలికి చెదిరినట్లు నుదుట అల్లిబిల్లిగా ఉన్నై. గళ్ళచీరె పిక్కలదాకా మడిచి గోచీ పెట్టింది. నల్ల రవికె చేతులు మోచేతులదాకా వున్నై. మెళ్ళో పూసలపేరు, తల్లో పూవులదండ, చేతికి లంబాడీ గాజులున్నై. అవి నెత్తిన నీళ్ళ కుండను తాకుతున్నై. కడియాల పాదాలు ముందొకటివెనుకొకటి నడుస్తున్న పోజులో వున్నై. కాటుక కండ్లలో ఆ తేజస్సు అద్భుతం. ఎవరబ్బా ఈ ఆర్టిష్టు? ఆచూకీ తీయటానికి బీనాదేవి క్లాసు మేటు ముకుందాన్ని అడిగింది.

"అతడొక బీద ఆర్టిష్టు. మా కొబ్బరితోటకు వాళ్ళ తాత మాలీగా వుంటాడు. నేనే వాడిచేత ఈ బొమ్మ వేయించా."

అతణ్ణి ఆదరించేవారులేక అనామకుడిగా వున్నాడు. అర్థబలం లేదు. అధికార బలం అసలే లేదు. అట్టడుగు జాతివాడగుటచే నిర్వీర్యుడుగా పడి వున్నాడు.

"అతన్ని నే చూడాలి ముకుందం" బీనాదేవి తన క్లాసుమేటును కోరింది.

"రేపు సాయంత్రం 4 గం. లకు మా యింటికి రా దేవీ! వాణ్ణి పిలిపిస్తా" తన అడ్రసిచ్చి వెళ్ళాడు ముకుందం.

రాత్రంతా కళ్ళలో మెదిలింది ఆ చిత్రం ఆమెకు. ఆ చిత్రకారుని గురించి ఊహిస్తోంది. నిద్ర పట్టలా! బి. ఏ. కాగానే తను ఏం చెయ్యాలి? నాన్న తన్ని పై చదువులు చదవ నివ్వడు. ఈ పాటికే ఏ ధనవంతుణ్ణో, శ్రోత్రియుణ్ణో కుదిర్చే

ఉంటాడు. అసలీపాటికి లగ్నం పెట్టాడేమో! అతి బలవంతంమీద ఇంతదాకా ఎలాగో నా పెండ్లిని ఆపగల్గా. ఇక్కడ విద్యార్థులు తన డబ్బు, హోదా చూచి వెంటాడుతున్నారు. తనకైతే ఇంకా చదవాలని ఉంది. నా గురించి తల్లి శారదాంబ అసలే నాన్నతో వాదించలేని అశక్తురాలు. మడి, వంట, పూజలు, వ్రతాలు-వ్యక్తిత్వం లేని ఉత్స విగ్రహం మా అమ్మ. ఈ ఆలోచనలతో ఉక్కిరి బిక్కిరైంది బీనాదేవి.

ఎప్పుడు తెల్లవారుతుందా, ఎప్పుడు ప్రొద్దు వాటారుతుందా అని తహ తహ లాడి పోయింది బీనాదేవి. ముకుందం ఇంటికి సాయంత్రం హుటా హుటీ నడకతో చేరింది.

"రండి, మీ సంగతే చెప్తున్నా రఘురాంతో! రఘురామ్! ఈమె బీనాదేవిగారు. నా క్లాసుమేటు. ప్రకృతి సౌందర్యాన్ని ఆరాధించగల సౌందర్య పిపాసివు" రఘురాంకి పరిచయం చేశాడు.

"నమస్కారమండీ" అన్నాడు ఆ కళాకారుడు.

"విశాలమైన నుదురు. సన్నని మీసకట్టు. ఆకర్షణీయమైన జుట్టు. నాజూగ్గా ఉన్న అవయవ సౌష్టవం. అబ్బ! ఎంత సుందరాకారుడు." అని యోచిస్తున్న దేవితో ముకుందం "రఘు మహా విశ్వాసపాత్రుడు, నిగర్వి, కార్యశూరుడు దేవీ!" అని చెప్తున్నాడు. ఆలోచిస్తున్న దేవి తన యోచనల్ని కట్టిపెట్టి,

"ఏం చదివారండీ? ఎలా అబ్బింది మీకీ కళ? తెలిసికోవాలని కుతూహలంగా ఉందండి; మీ కభ్యంతరం లేకపోతే................

"స్కూలు ఫైనల్ చదివానండీ. నా పేరు రఘురాం. పై చదువు చదివే శక్తిలేక మానేశాను. నా క్లాసుమేటు తండ్రి పెద్ద కళాకారుడు. ఆయనవద్ద కుంచె లందివ్వడం, రంగులు కలపటం లాంటి పనులకు 30 రూపాయల జీతానికి పని చేస్తుండే వాణ్ణి. 2, 3 సం॥ల తర్వాత ఊహతో నేనే చిన్న చిన్న కొండలు, చెట్లు, పిట్టలుగీసేవాణ్ణి. ఏదోలెండి. ఎందరోమహానుభావులు........"

"ఆర్టు పరీక్ష కెళ్ళరాదండీ. పెద్ద వుద్యోగం, పెద్దలతో పరిచయాలు వస్తై". ఉత్సాహంగా అడిగింది దేవి.

"చాలా నిరుపేదనండి. ఎవరన్నా అడిగితే గీస్తాను. తృణమో పణమో ఇస్తే సంతోషం, లేకుంటే............"

అతని ఆత్మాభిమానానికి, నిజాయితీకి మెచ్చుకుంది బీనాదేవి.

"అబ్బ! కళకెంత గతిపట్టింది! నే సాయం చేస్తా. ఆర్టు పరీక్ష కెళతారా?" సంతోషంగా అడిగింది.

తలవంచుకొని మాట్లాడలా రఘురాం.

"మళ్ళీ కలుద్దామండీ! ముకుందం, వస్తానోయ్. థాంక్స్"

అలా వస్తూ పోతూ 6 నెలలు గడిచినై. వారి పరిచయం ప్రేమగా మారింది.

ఆరోజు దేవికి బి. ఏ. ఆఖరి పరీక్షయింది. ఆమె తండ్రి "Start Immediately" వైరిచ్చాడు. ఆలోచించి, ఆలోచించి

తని నిర్ణయాన్ని రఘుతో చెప్పి అతి బలవంతంమీద దాంపత్య జీవితాని కొప్పించింది దేవి.

రఘు నిరీశ్వరవాది. అతనిది నిర్మల మనస్తత్వం. పెళ్ళి క్రతువు లేకుండా కలిసి సహజీవనం సాగిద్దామనే పురోగమన వాది. బీనాదేవి పట్టుదలపై స్వగ్రామం వచ్చారిద్దరూ.

"ఇతనే నా కాబోయే భర్త" తండ్రికి చూపించింది. బాగానే వున్నాడే! స్ఫురద్రూపి, చక్కని కళాకాంతు లుట్టిపడుతున్నై. 22 సం॥ లుంటై" అని గుర్తించి "ఏం చదివాడు? ఏ కులంవాడు? ఎంత ఖరీదుచేసే ఆస్తి పాస్తులున్నై. తల్లి తండ్రు లెవరు?" ప్రశ్నల వర్షం కురిపించాడు తండ్రి.

"ఏం కులమో మొహంమీద వ్రాసిపెట్టి ఉంటుందా? ఆస్తిపాస్తుల లెక్కలు నే పట్టించుకోను. అవి సుఖసంతోషా లిస్తయ్యా? అతని తల్లి దండ్రుల ఉనికి మనకెందు నాన్నా? మనకావలసింది అతని సంస్కారం, విజ్ఞానం, కాని గోత్రాలు కాదు. విద్య విషయం ఆలోచిస్తే మానసిక వికాసం, మానవత్వం లేని విద్య నిరుపయోగం. మా ఇద్దరికీ ఇష్టమయింది. కలిసి కాపురముంటాం. దానికి మీరందరూ సమ్మతించాలి నాన్నా."

ఆ సమాధానానికి వుగ్రుడవుతున్నాడు రామావధాని.

"బాగుందీ వరస! పెండ్లాడేది మేమా మీరా?" తండ్రిని రెట్టించి సూటిగా అడిగింది దేవి.

"ఇన్నాళ్ళు కని పెంచి పెద్దచేసిందంతా పోయింది. ఇవాళ ఇలా నామీద సవాల్‌కి నీకెన్ని గుండెలే!" అగ్గిమీద గుగ్గిల మయ్యాడు రామావధాని.

"నన్ను కని పెంచమని నేను కోరలేదు. అదేదో గొప్ప త్యాగంగా వర్ణిస్తారేమిటి దానికి నేనేదో రుణపడినట్లుగా! మీ చర్యలవల్ల కృతజ్ఞులమై వుంటాంకాని, మీరు కన్నంతమాత్రాన" ఏదో చెప్పబోతుండగా.

"నన్ను అభాసు పాల్చేసి పోతే పర్యవసానమేమిటో ఊహించావా? ఆలోచించుకున్నావా? నన్ను ధిక్కరించినవాళ్ళ గతులు చూస్తున్నావుగా" కబడ్దార్, జాగ్రత్త అన్నట్లు హుంకరిస్తున్నాడు.

"అమ్మా వెళ్ళొస్తానమ్మా!" నేనశక్తురాల్ని అన్నట్లు ఇద్దరివంకా చూచింది తల్లి శారదాంబ. ఇటు వక్కగానొక్క కూతురు, సుగుణవతి, ఆత్మాభిమాని? అటు భర్త. ధన, కుల, అధికార మదాంధుడు, ఏంచేసేది? ఎవరికి చెప్పేది? అడుగు ముందుకేస్తే నా పీక నులిమేస్తాడు. నా దురదృష్టంకొద్దీ ఇతని పాల్బడ్డా. నా బిడ్డనొదిలి జీవించగలనా! నా ఆశారేఖ, దేవి!

"అమ్మా! నాన్నకు నువన్నా చెప్పమ్మా!" దేవి పిలుపుతో తన ఆలోచనల్ని కట్టిపెట్టి ఇద్దరివైపూ మరోసారి చూచింది.

"వెడల్పాటి ఛాతి, అందమైన కళ్ళు, ఉంగరాలజుట్టు నూనూగు మీసాలతో ఛాయతక్కువైనా రఘురూపం ఆకర్షణగా ఉంది. లక్షణంగా వున్నాడు. తన మగడు ఏనాడూ తనను వంట మనిషికన్నా గౌరవించి ఎరుగడు. తనది ఉత్తమ కులమట. శశిరేఖను ఉంపుడుగత్తెగా తెచ్చి 10 సం॥ రాలయింది. తనేనాడూ

ధిక్కరించి ఎరుగదు. ఏటా శశిరేఖ కడుపు తీయించుకుంటుందని వూళ్ళో పుకార్లు. నడిచేది తప్పుడుదారైనా పర్వాలేదు. కానీ సాక్ష్యం లేకుండా చేసుకుని ఊళ్ళో ఘరానాగా వుంటారు. నా బిడ్డనాన్న సుఖపడితేచాలు, ఈ వాతావరణానికి నేనెలాగూ బలి అయినా! వెనుకటి స్మృతులన్నీ నెమరేసుకుంటున్న శారదాంబను "అమ్మా దీవించవా? కులాల్లో ఏముందమ్మా గుణం ప్రధానంకాని. విజ్ఞానం విశ్వవీధుల్లో విహరిస్తుంటే మనలో ఇంకా ఇక్ష్వాకులనాటి మనః ప్రవృత్తి మారాలా, వద్దా? ఇందులో తప్పేముందమ్మా! వాళ్ళ రక్తానికీ మన రక్తానికీ తేడాలున్నయ్యా? చేసింది తప్పా, నువ్వనాన్న చెప్పమ్మా" గొంతు బొంగురుపోయింది దేవికి. మనస్సులోనే మనసారా వాళ్ళిదర్నీ దీవించింది తల దించుకొని కన్నీరు తుడుచుకుంటూ తల్లి.

"మేం చచ్చామనుకున్నావా?" హుంకరించాడు తండ్రి.

"పెళ్ళి చేసుకునేది, కాపురంచేసేది నేను. పెళ్ళి నూరేళ్ళ పంటంటారే, మరి మేము ఎన్నుకుంటే తప్పేమిటి నాన్నా?"

"మన సంప్రదాయం, వంశగౌరవం సమాజాన్ని అధిగమిస్తావా? దీని ఫలితం ఎలా పరిణమిస్తుందో ఊహించావా?" కండ్ల వెంట నిప్పులు కురిపిస్తూ అన్నాడు అవధాని.

"నేనవన్నీ అడిగి తెలుసుకోలేదు. నా కవసరంలేదు. సమాజానికి, సంప్రదాయానికి, అప్రతిష్ట తెచ్చే పని నేనేమీ చెయ్యలా" ఖచ్చితంగా జవాబిచ్చింది దేవి.

"ఎలా బ్రతుకుదామని నీ ఆలోచన."

"ఇద్దరం సంపాదించుకొని బ్రతుకుతాం"

"కులగోత్రాలు, ఆస్తిపాస్తులు తెలియనివాడికి నా పిల్ల నివ్వను. ఆఖరిసారిగా చెప్తున్నా. నీకు నేను కావాలో ఆ కుల భ్రష్టుడు కావాలో తేల్చుకో."

"ఇక్కడ పిల్ల నివ్వటం, పుచ్చుకోవడం ప్రసక్తి లేదు. మర్యాదగా చెప్పి చేసుకుందామని వచ్చాం."

అవధాని రౌద్రాకారం దాల్చాడు. కూతుర్నేమీ అనలేక రఘుమీద విరుచుకు పడ్డాడు.

"పిల్లని మోసం చేస్తావా? ఆస్తికోసం"? చిందులు తొక్కేడు అవధాని. తలొంచుకు నిలబడ్డాడు రఘు.

"మౌనం అర్ధాంగీ కారం అన్నట్లు నీ ముఖమే చెప్తోంది.

నా పిల్లని పెండ్లాడే తాహతు నీకుందా? ఈ గ్రామాధికారి, పవిత్రమైన బ్రాహ్మణ వంశం మాది, లక్షలాది ఆస్తిపాస్తులున్నై, ఏ ఆగర్భ శ్రీమంతుడో ఈ ఇంటికి ఇల్లరికం రావాలిగాని; అసలు ఇంతకూ మీ తండ్రి ఎవరు? ఏ వూరు?" గర్జించాడు అవధాని.

గొడ్లను మేపుతున్న సుబ్బన్న కేకలు విని పరిగెత్తు కొచ్చాడు. సన్నివేశం చూచి మొద్దుబారి పొయ్యాడు. తర్వాత ఎప్పటికైనా తెలిస్తే బిడ్డ కపాయమని వెఱచి "బాబుగారూ,

నా కొడుకండీ! ఇంత కాలం మా మామకాడ పెరిగాడండీ.''
విషయం కాస్త కాస్త బెదురు చూపులతో చెప్పాడు.

కుర్చీలోంచి దిగ్గున లేచాడు రామావధాని.

''ఏరా! ఎంత కండకావరంరా! ఎంత బరితెగించారురా! నా వుప్పు తిని, నాకే ఎసరు పెడతార్రా! వాడొక సంకరజాతి వెధవ. వాడితోనా మాకు సంబంధం. ఇప్పటి కయిందేదో చాలు. ఇక మీ ముఖం చూపకండి.

''ఎంత గుండె ధైర్యంరా మీకు! సింహంతోరా పోరాటం మీకు? కబడ్దార్! పొండి పొండి!'' సింహగర్జన చేస్తూ, ''పోవే లోపలికి. చదువు పేరుతో కొంప కూల్చావు. అగ్నిహోత్రుల రామావధానిని నేను. నిప్పులాంటి వంశమని తెలియదా! వాడెవడే, హరిజనుడు పేరుచ్చరించినా మైలపడిపోతా'' అన్నాడు కూతురితో.

''నాన్నా! నీ కూతురు పిరికిపంద కాదు. నీ ఆజ్ఞకు భయపడి నా ప్రాణానికి ప్రాణమైన నా సహచరుణ్ణి వదలుకోటానికి నేనేం కానిపని చెయ్యలా. ఇద్దరం ప్రేమించుకున్నాం. జీవిత భాగస్వాములం అవుతున్నాం. నీతులు చెప్పి, గోతులు తవ్వేవాళ్ళం కాము. చెప్పేవన్నీ శ్రీరంగనీతులు, దూరేవన్నీ దొమ్మరి గుడిసెలు లాంటి అవినీతి పనులు మా జీవిత ధ్యేయాలు కావు.''

''ఏమే ధర్మపన్నాలు వల్లించే తాహతుందా నీకు! నా మాట వింటావా, నీ జీవితం స్వర్గతుల్యం చేస్తా. పెడచెవిన పెట్టావా,

ముళ్ళకంపలో పడి, విల విలా కొట్టుకు చస్తావు. ఆలోచించుకో. చివరిసారిగా అవకాశమిస్తున్నా" అవధాని పిలక ముడివేస్తూ అరిచాడు.

"పోదాంపద రఘు!" చెట్టాపట్టాలతో, కట్టుబట్టలతో వడివడిగా సాగిపొయ్యా రిద్దరూ.

శారదాంబ, సుబ్బన్న, విన్నవారు, కన్నవారు నిశ్చేష్టులైనారు. అవధాని మాత్రం "ఇంతటితో అయిందా వీళ్ళపని! నీ కొంపని కూలుస్తా! జాగ్రత్త!" అంటూ పళ్ళు పట పట కొరుకుతూ, ఇంట్లోకెళ్ళి 'ఢభీ' మని తలుపేశాడు అవధాని.

♦ ♦ ♦ ♦

"లేచొచ్చారుటగా! అంతేకాదు పెండ్లి తంతంటే వారికి నమ్మకం లేదట." వాళ్ళిద్దరూ చిలకా గోరింకల్లా కాపురం చేస్తున్నా ఇరుగు పొరుగు ఈసడింపు తప్పలా. తమతో తెచ్చిన కుంచే వారిద్దర్నీ పోషిస్తోంది. 3 నెలలు గడిచినై.

"కటిక నేలమీద పడుకున్నా గంజినీళ్ళు త్రాగినా అన్యోన్యంగా బ్రతుకుతున్నాం వదినా!"

"కష్టసుఖాలు కావడి కుండలన్నట్లు కష్టాలు కలకాలం కాపురం వుండవులే దేవీ" అన్నాను నేను.

తదాది అప్పుడప్పుడు కలిసికొని మేమిద్దరం కొంత మనశ్శాంతి పొందుతున్నాం. కాస్త అండదండలుగా వుంటున్నాం.

రెక్కలు తెగిన పక్షులైనా అన్యోన్యత వుంటే చెట్టు నీడే వారికి హంస తూలికా తల్పం కాదా? ఆస్తులు, అంతస్తులు అన్యోన్యాన్ని ఆనందాన్ని ఇవ్వగలవా? దేవీ రఘులు అతి బీదతనంలో కూడా అతి గొప్ప అన్యోన్య ప్రేమాతిశయాలతో దాంపత్య జీవితం గడుపుతున్నారు.

బీనాదేవి ఒకరోజున హడావిడిగా దొడ్డితలుపు తట్టింది. యుగంధర్ ఇంట్లోలేడు. మంచిదయింది. లేకపోతే ఎంత గొడవయ్యేదో?

"ఏమిటమ్మా ఏమైనా ప్రమాదం ముంచు కొచ్చిందా?" అని అడిగాను బీనాదేవిని.

"మా వూరి వార్తలు అప్పుడప్పుడు తెలుస్తున్నాయి వదినా! మా అమ్మ దాసి అన్న అప్పుడప్పుడు వచ్చి చెప్పి పోతూ ఉంటాడు. ఇవాల్టి వార్త భయంకరంగా ఉన్నదమ్మా. విని భరించలేక పోయాను. నీతో చెప్పుకుంటే, దుఃఖ భారం తగ్గుతుందని పిలిచాను వదినా."

"ఏమిటమ్మా ఆ దుర్వార్త."

"నేను మోసగాణ్ణి కాదు బాబు" అని ఎంత మొత్తుకున్నా వినక రఘు తండ్రిని మా నాన్న గుంజకు కట్టించి చిత్రహింస పాల్జేశాడట. రౌడీలను ప్రేరేపించి అతని తల్లిని ఘోరావమానాల పాలు చేయించాడట. అంతటితో ఆగక, మా అమ్మ బ్రతిమాలుతున్నా వినక రఘు అంతు చూస్తానని గర్జిస్తున్నాడట." నాకేదో భయంగా ఉంది వదినా."

"భయపడకమ్మా! ఎంత కసాయి వాడైనా నీ తండ్రి కదమ్మా. అల్లుణ్ణి చంపుకుని కూతురికి వైధవ్యం తెస్తాడా ఎంత అప్రాచ్యుడైనా. ఏమైనా మీ ఇద్దరి జోలికి రాడులే, ధైర్యంగా ఉండు" అని దేవికి నచ్చచెప్పి వంపాను.

ఒకరోజు రక్తసిక్తమైన రఘు శరీరాన్ని దేవి కప్పగించి వెళ్ళారు పోలీసులు. రోడ్డు ప్రమాదమని కొందరు, హత్య ని కొందరూ అందరూ తలొకరకంగా చెప్పుకుంటున్నారు. కేసూలేదు; పోలీసుల జాడలేదు; ఆలనా పాలనా లేదు, ఆచూకి తీసినవారూ లేరు.

"హరిజనుడు బ్రాహ్మణపిల్లను చేసుకుంటాడా! బాగా జరిగింది శాస్తి" అంటున్నాడొక శ్రోత్రియుడు జందెం త్రిప్పుతూ.

"వాళ్ళుమాత్రం మనుషులుకారా? వారిలో మానవలక్షణాలు లేవా? వారికి మేధస్సులేదా? వారికీ తదితరులకూ ఏమిటితేడా?" అన్నాడొక ఆధునిక యువకుడు.

"ఏదైనా సవర్ణులు, అవర్ణులు వివాహాలు చేసుకునే కాలం ఇంకా రాలేదయ్యా" అన్నాడొక కుహనా సంస్కారి.

"పెండ్లిండ్లు చేసుకోవచ్చు, కాని ఇలా ఎవరి అండదండలు లేకుండా ఎవరికి వారుగా కలసి జీవిస్తుంటే ఇలాగే పరిణమిస్తుంది" గొణిగాడు సంస్కర్తముఖం పెట్టి మరో పెద్దమనిషి.

రఘు మరణవార్త రఘు తండ్రికి తెలియజేయమని తన పుట్టింటి ఊరిలో ఒక పెద్దమనిషికి ఫోను చేయించింది బీనాదేవి. సాయంత్రానికికూడా ఎవరూ రాలేదు.

నేను వెళ్ళి దేవి ప్రక్కన కూర్చుని ధైర్యం చెప్పాను. దేవి వస్తుతః ధైర్యస్తురాలు. గుండె చిక్కబట్టుకుంది. కర్తవ్యం ఆలోచించుకుంది. ఇద్దరము కలసి శవాన్ని బండిమీద వేసుకొని స్మశానానికి తీసుకెళ్ళి దహనం చేసి వచ్చాము.

రాత్రి పదింటికి యుగంధర్ వచ్చాడు. బహుశః ఎదురుకొట్టుకెళ్ళి వాడిద్వారా తెలుసుకున్నాడు కామోసు. రాగానే మొదలు పెట్టాడు కేకలు; తిట్లూ.

"ఏమే వాడు నీ రంకు మొగుడా? వాడికీ నీకుగల సంబంధమేమిటి? నీవు వెళ్ళి ఆ పీనుగను తగలేసి వచ్చావు. నీ కెంత సాహసమే! మొగుడు ఇంట్లో లేకపోతే నీదే ఇచ్ఛారాజ్యమా! హద్దూ పద్దూ ఉండక్కరలేదా? అమాయకురాలిలా ఇన్నాళ్లూ నటించావు. నాలిముచ్చువు. చాలా ఉన్నాయి. నీ లక్షణాలు, ఒకటొకటే బయటపడుతున్నాయి. ఇప్పుడిప్పుడే తెలుస్తోంది నీ నైజం. నీకంత ప్రేమ ఉంటే వాడితోపాటు సహగమనం చెయ్యలేక పొయ్యావు? లేచొచ్చిన ముండ కనుక దిక్కూ మొక్కూ లేకుండా పోయింది. కనుకనే వాడూ ముదికిచావు చచ్చాడు. వాడి చావుకు నీవు గింజుకుంటున్నావు." అంటూ నా జుట్టుపట్టుకొని గుంజాడు. చెంప ఛెళ్ళుమనిపించాడు.

"నిండు ప్రాణాన్ని అంటరాని వాడనీ, గతిలేనివాడనీ బలిగొంటే సంతోషించేవారంతా పవిత్రులా?" కోపాన్ని దిగ మ్రింగుతూ అన్నాను.

"ఆ! నాకెదురు సమాధానం చెప్పే సాహసం నీకుందా? ఆ కులభ్రష్ట కావాలో నేనే కావాలో తేల్చుకో. అర్థమయిందా!" ఉగ్రుడైనాడు. ఆ రోజు తెల్లవార్లూ తిడుతూ సాధిస్తూనే ఉన్నాడు యుగంధర్.

కోడి కూయక ముందే లేచి రహస్యంగా బీనాదేవి ఇంట్లో కెళ్ళాను. దేవి స్పృహ లేకుండా ఒక్కతే పడిఉంది. లేపి కాస్త కాఫీ, రొట్టెముక్క ఇచ్చాను. "కష్టాలు మనిషికి కాక మానుకు వస్తాయా! నేనున్నాను నీకేం భయంలేదు. నేను హామీ ఇస్తున్నాను" అన్నాను.

"ఎలా బ్రతికేది వదినా! ఎవరి కోసం బ్రతకాలి? రోజులెలా గడిపేది! నాకేం మిగల్లేదమ్మా రెండు నెలల గర్భం, వైధవ్యం తప్ప" అన్నది ఘొల్లున ఏడుస్తూ.

"అయ్యో! ఈమె నూరేళ్ళ బ్రతుకూ ముగిసింది. ఇక మిగిలింది ఆ చిన్న నలుసు! కాలమెంత విపరీతం! నిస్సహాయురాలు, పైగా గర్భిణి. ఎలా బ్రతకాలి?" నా బుర్ర గిర్రున తిరిగింది. నా కాళ్లు గజ గజ వణికిసై.

"దేవీ! నీకు పురుడు పోస్తా. నిన్ను, నీ పిల్లనూ నా సర్వస్వం వడ్డీ అయినా బ్రతికిస్తా. నీవు మాత్రం

ఏ అఘాయిత్యానికీ పూనుకోరాదు. నీ రఘుపై ఒట్టు వేయి" అన్నాను గుండె నిబ్బరం చేసుకొని.

రఘు పేరు వినగానే ఆమె వైఖరి మారింది.

"సరే" అని దేవి నాకు మాట ఇచ్చింది. నాకు నా తండ్రి ఇచ్చిన రెండు గాజులు ఇనాళ్ళుగా యుగంధర్ కంట కనబడకుండా దాచుకున్నాను. అవి మా అమ్మవి. వాటిని దేవికిచ్చి అమ్మి కుట్టుమిషన్ కొనుక్కోమన్నాను.

దేవి కుట్టు పనిమీద పొట్ట పోసుకుంటూ, టైపు పరీక్షకూడా ప్యాసయింది ప్రసవించేనాటికి. ఆసుపత్రిలో పురుడు పోసుకుంది సలక్షణంగా. ఆడపిల్ల కలిగింది ఆమెకు. తిరిగివచ్చి నా పాదాలను స్పృశించి నమస్కరించింది దేవి.

# 12

జీవితంతో రాజీ పడ్డాను. చివరకు ఎంతవరకు సర్దుకు పోయానంటే యుగంధర్‌ను భర్తగా అంగీకరిస్తూ, అతగాడిని 'ఏమండీ' అని సంభోధించే స్థాయికి చేరాను. అతనిని విడిచి వెళ్ళితే, సమాజం చిన్నచూపు చూస్తుందనే భయం, నా కడుపులో పిల్లను బ్రతికించుకోలేననే అధైర్యం, నా బిడ్డకి ఏదో ఒక మగ దక్షత ఉండాలనే ఆకాంక్ష, నా అన్నవారు తృణీకరిస్తారనే అనుమానం, తరతరాలుగా స్త్రీ జాతికి నరనరాన జీర్ణించుకు పోయిన పిరికితనం, చావుకు సిద్ధం కావటానికి అవసరమైన తెంపరి తనం లేమి-ఒకటేమిటి అన్నీ కలసి నన్నీ స్థితికి తెచ్చాయి.

ప్రేమలేని దాంపత్యానికి, భర్త కర్కశత్వానికి అలవాటు పడిపోయాను. ఉన్నంతలో కొద్దిపాటి సుఖాలకు అర్రులు చాచ మొదలు పెట్టాను. ఒకనాడు....

"పురిటికి పుట్టింటికి పంపరా? మొదటి కాన్పు కదా! భయపడుతూ గోముగా అడిగాను భర్తను."

"నీ అమ్మా నాన్న చచ్చారు. నీ కాడ పలికే దిక్కెవరే?"

"మా నాన్న పోయాడండీ? మాటన్నా చెప్పలేదు. చూపన్నా అందలేదు. నేనేం పాపం చేశానండీ! నా కోసం ఆ మూగజీవి ఎంతగా అలమటించి పొయ్యాడో? కన్నతల్లి లేనేలేదు. తండ్రి శవాన్నైనా చూడనోచని మహా దౌర్భాగ్యం నాది." రెండు చేతులతో మొఖం కప్పుకుని వెక్కి వెక్కి ఏడ్చాను.

"చచ్చిన వాళ్ళను చూస్తే వాళ్ళు బ్రతుకుతారా? ఏడిస్తే ప్రాణాలొస్తయ్యా? వెఱ్ఱిదానా! రుణం తీరింది పొయ్యాడంతే" ధర్ కట్టెవిరిచి పొయ్యిలో పెట్టినట్టు పల్కాడు. ఏమాత్రం మానవతా దృష్టిలేని ధర్ దుర్మార్గాలన్నీ కలిసి కట్టుగా ఆ వ్యక్తి రూపంలో పుట్టాయేమో!"

కొన్నాళ్ళు తండ్రి దిక్కు లేని చావుకు ఏడ్చి ఏడ్చి నిభాయించుకున్నాను. "అమ్మమ్మా, పిన్నీ వున్నారు కదండీ! అక్కడికెళ్ళి పురుడు కాగానే తిరిగొస్తానండీ! ఒంటరిగా వుండే సమయం కాదిది" ప్రాధేయ పడుతూ మరోసారి అడిగాను.

"అక్కడ నీ ప్రియుడు చంద్రం నీ విరహాగ్నిలో బడి దగ్ధమై పోతున్నాడనా? ఇదివరకే వాడికీ నీకు సంబంధం కలదని కర్ణాకర్ణిగా విన్నా. అయినా నిన్ను చేపట్టా. నీ కన్నె చెర విడిపించా. ఇక వాణ్ణి మరచిపో. వాడు బ్రహ్మచారిగా బ్రతుకుతానని శపథం చేశాడట" చాలా అసభ్యంగా సమాధాన మిచ్చాడు.

"అంత కర్ణ కఠోరమైన మాటలు మీరెలా పల్కగలరండీ!" చెవులు మూసుకున్నాను.

"ఇక మీ తాత సంగతి చెప్పేదా? వినగలవా?

ఆ ముసలాడు చేజేతులా నిన్ను మీ నాన్నతో పంపి నిన్ను ఈ నరకంలోకి త్రోశాడట. ఆ దిగులుతో వాడి ఊపిరి తీసిందట మీ అమ్మమ్మ. గతిలేక కూతురి పంచ చేరిందట. ఇక ఆ మొండి గోడల మధ్య కంటావా పో!" హేళనగా నవ్వాడు ధర్.

"ఎందుకండీ! అంతంత విషపుమాట లంటారు....."

"తాతయ్యా, నీ అండకూడా పోయిందా! కడుపులో పెట్టుకుని పెంచావు. తల్లిని మరపించావు. దాన, దయా, ధర్మ, గుణాలను మా బోంట్లకు ప్రసాదించి ధన్యాత్ముడవైనావు. నీ కాలి చెప్పులమైనా నీ రుణం తీరదు. నీ అండ దండలు లేకపోతే నేను ఆనాడే చచ్చేదాన్ని. ఆనాడు పోయినా బాగుండేదేమో. ఈ నీచ స్థితి తప్పేది." లోలోనే దుఃఖాన్ని దిగ మింగుతూ "ఏకాకి నైనాను తాతయ్యా" అని ఆక్రోశించాను.

"అలా దిగాలు పడ్డావేం. అయినా ఆడదానికి పుట్టింటిపై అంత మోజెందుకో! మగడెంత చేసినా విశ్వాసం వుండదు ఆడదానికి. పుట్టింటి మమకారం అంత మధురమా! నీ కిక్కడేం తక్కువయింది? తిండీ, గుడ్డా, నీడా సలక్షణంగా వుంటే పసికూనలా 'తాతయ్యా' అని విలపిస్తున్నావు? మీ తాతయ్య కావాలా? పో! పోతే ఈ గడప తొక్కనీయను." రుసరుసలాడుతూ తలుపు తాళం పెట్టుకొని వెళ్ళాడు. నెలలు నిండినయి. ఏ ఆలనా-పాలనా, ముద్దు- ముచ్చట ఎరుగను. ఒకనాడు నా మూల్గువిని దేవి వచ్చింది. తెల్లవార్లూ ఉపచారం చేసింది. ఇంట్లోనే కలలన్నీ కన్నాను. దేవి కనురెప్పలా కాపాడి సాయం చేసింది. దేవి నాకు, నేను ఆమెకు ఒకరికొకరు తోడునీడైనాము. కంటి రెప్పలా తల్లీ పిల్లల్ని కాచుకుని వుండేది.

"ఆడాళ్ళే పుట్టారా? రంగు, రూపం బాగున్నాయ్యా" లొట్టలేసుకుంటూ అడిగాడుధర్. పిల్లల్ని చూచి తృప్తిపడ్డాడు. రెండు ఝాములయిందపుడు. ఎలా కన్నావు? డబ్బుకావాలా? ఎవరి సహాయం? వగైరాల గురించి మాటైనా అడగలా. కాఫీగ్రా గురించి అసలే పట్టించుకోలే. పసందైన పిల్లల్ని చూచుకున్నాడు. తృప్తిపడ్డాడు. నల్లపిల్లలైతే ఏమయ్యేదో! పిల్లల్ని మళ్ళామళ్ళా చూచాడు. అచ్చం నా పోలికే అని గ్రహించాడు? బంగారంలాంటి చాయ, చెంపకు చారెడేసి కళ్ళు, నల్లని శిరోజాలు, కాలివేళ్ళు, చేతివేళ్ళు సన్నగా పొడుగ్గా వున్నై. ఒకరికిద్దరు. తనరొట్టె విరిగి నేతిలో పడ్డదని అదృష్టమంటే అలా కల్సి రావాలనే భావం అతని ముఖంలో గోచరించింది. ఏదో మహా పెన్నిధి లభించినట్లుగా

పొంగిపోతున్నాడు. పిల్లలను తాకి ఎంతో మృదువుగా ముద్దు పెట్టుకున్నాడు.

పిల్లలు పుట్టాకా తరుచుగా ఇంటికి రావడం పోవడం పెరిగింది. ఇంట్లో పిల్లలకి పాలు, విటమిన్లు, టానిక్కులు, బాగా తెచ్చేవాడు. నాపై కాస్త ఆగ్రహం తగ్గింది. అనుగ్రహం కల్గింది.

"కాంచీ! త్వరగా రావాలి"! రాత్రి పొద్దుపోయి వచ్చి కేక పెట్టాడు ఒక రోజు. ఏ పనిలో ఉన్నానో నేను ముందు పలకలేదు.

"ఏం! విన్నావా లేదా!" గద్దిస్తూ అడిగాడు.

ఈ కేకలు ఎందుకు పెట్టాడో నాకు తెలుసు. తన కక్కుర్తి కోసం పాట్లు అవి.

"పచ్చి బాలింతనండీ! వొళ్ళింకా గట్టి పడలా" బితుకు బితుకు లాడుతూ సన్నగా అన్నాను. నడికట్టు ఇంకా వుంది. చెవుల్లో దూది, కండ్లకు కాటుక పెట్టుకుంటూనే ఉన్నాను. మనిషిని బాగాచిక్కిపోయి పల్చబడ్డాను. ఇంట్లోపని, పిల్లలపని, నిద్రలేమి వల్ల బాగా అలసిపోతున్నాను. నా ముఖంలో ఈఅలసట కన్పిస్తూ ఉన్నది. అయినా అతని కామదాహం తీర్చక తప్పటంలేదు.

"నువ్వే కన్నావా ఏం? పది మందిని కన్నవారు సైతం పరవళ్లు తొక్కే పరువంతో భర్తలను ఆనందింపజేస్తారు. ఏనాడూ నాకు ఏముద్దూ, ముచ్చట తీరలేదు నీవల్ల" చీదరించుకున్నాడు కాని పట్టు విడవలా. తన పని తాను పూర్తి చేసుకునేవాడు. తన

తృప్తి తీరితేచాలు. ఏనాడూ భార్య నొకనాడైనా లాలించి ఎరుగడు.

కవల పిల్లలను లతా, లావణ్యా అని పిలిచేదాన్ని. ఇద్దరికీ 9 నెలలు నిండినై. తప్పటడుగులువేస్తూ అమ్మా! అత్తా! అంటూ ముద్దులు కురిపిస్తున్నారు. రోజూ దేవి ఎత్తుకొని ముద్దాడి వెడుతూ వుండేది.

ఒక రోజున "వదినా! అలా పాలిపోయి వున్నావేం" దేవి రెట్టించి అడిగింది. నేను జవాబు చెప్పలేదు.

"అర్థమయిందిలే. ఎన్నో నెల" అర్థోక్తిగా అడిగింది.

"అరు నెలలు నిండినై" ముక్తసరిగా చెప్పాను.

"ఇన్నాళ్లు చెప్పలేదే"

"ఏం ఘనకార్యం అని చెప్పాలి" విరక్తితో అన్నాను.

"నేసహాయం చేస్తూంటాకాని, కాస్త విశ్రాంతి తీసుకుంటూ ఉండు!" దగ్గరుండి రోజూ రెండు పళ్లు, గ్లాసుడు పాలు తాగించి వెళ్ళేది దేవి.

దేవి కంట పడితే చిట్లు బుట్లు లాడేవాడుధర్. ఆమె ఏదో సంఘద్రోహం చేసినట్లూ, తాను మహాత్ముడైనట్లూ పోజు పెట్టేవాడు. అయినా నా మొహం చూచి దేవి నన్ను తన కంటి పాపలా కాపాడేది.

రెండో పురుడుకూడా దేవి చేతిమీదుగానే జరిగింది. చెంబెడు నీళ్లు పోసి తల్లినీ పిల్లనీ కాపాడింది.

కన్న మూడో రోజు ఇంటికొచ్చి "మళ్ళా ఆడదే పుట్టిందా? రంగూరూపంబాగున్నయ్యా" గుటకలు మ్రింగుతూ అడిగాడుశ్రీధర్.

లేదంటూ తల త్రిప్పాను. అచ్చం అతని పోలికే అనుకుంటా. "నల్లముండ పుట్టిందా? దండగ, నాఖర్మ. దేనికైనా అదృష్టముండాలి. రుసరుస లాడుతూ పొయ్యాడు.

అర్థంకాలా నాకు. అలా అంటాడేమూ అనుకున్నాను. "ఆడది, అందునా నల్లది అంటే అంత లోకువా? జన్మనిచ్చిన నాకు బరువా? నా తల్లిగుణం ప్రధానం కాని రూపం కాదు కదా? ఆ మాటకొస్తే తను అందగాడా? దిబ్బ ముక్కు, దూడ పెదాలు, మెట్టనుదురు, గరుకు బొచ్చూ, నేరేడు పండు రంగు ఆ పోలిక తోనే ఈ పిల్లపుట్టింది. తన్నుతాను నిరసించుకోడుగాని నోరూ వాయీ లేని పిల్లపై నిరాదరణ చూపుతున్నాడు. కన్నపేమైనా లేని వింత మనిషి" మనస్సులో విసుక్కున్నాను.

మూడో పిల్లంటే నాకు జాలిపుట్టింది. 'నీలిమ' అని పేరు పెట్టుకుని ముద్దుగా 'నీలీ' అనిపిలిచేదాన్ని. నీలికి మూడేళ్లు నిండినై. ఏనాడూ తండ్రి తాకి ఎరుగడు. ఏడిస్తే విసుగు, చీదరింపు, నాతో గిల్లి కజ్జాలాడేవాడు. నీలి పుట్టుకా నామీద కోపం, ద్వేషం పెరిగాయి. లతా, లావణ్యలకు మంచి బట్టలు, ఆటబొమ్మలు, మిఠాయి, తెచ్చేవాడు. నీలికి గుడ్డిగవ్వైనా ఇచ్చేవాడుకాదు. ఆ పిల్లనల్లగా తన పోలికలతో పుట్టింది.

అది నా తప్పా? ఆ పిల్ల తప్పా? నీ పోలికతో పుట్టిందని ఎదిరించే తాహతు నాకు లేదు. అర్థంచేసుకోగల విజ్ఞత అతనికి లేదు. గుడ్ల నీళ్ళు గుడ్లనేనింపి కాలక్షేపం చేస్తున్నాను. నాకెప్పుడు తీరుబడేవుండేదిలేదు. ముగ్గురు పిల్లలూ, ఇంటి పనులవల్ల భర్త దుష్కృత్యాలను, చిత్రహింసలను గురించి బాధ పడటానికి కూడా కాలం లభించడంలా నాకు. కాలం దొర్లిపోతోంది. చిన్నపిల్లకి 5 ఏండ్లు నిండినై.

"అమ్మా! నాన్న ఎప్పుడూ నన్ను నల్లీ, నల్లీ అంటూ చీదరిస్తూ ఉంటాడెందుకమ్మా! ఒక్కరోజైనా ముద్దాడడు. చాక్లెట్లన్నా కొనిపెట్టలా. ఎప్పుడూ చిరిగిన బట్టలు, మాసిన జుట్టూ, మొన్న కాఫీ పారబోశానని ఎన్నిదెబ్బలు కొట్టాడు! తన ఎదటికిరావద్దని రోజూచెవి మెలిపెట్టాడమ్మా. నేనేంచేశానమ్మా" ఎక్కిళ్ళు పెడుతూ రోదిస్తుంది నీలిమ ఒకనాడు.

"నాన్నగార్ని అల్లా అనకమ్మా. తనకు మనమంటే చాలా ఇష్టం. పైకి అలా వుంటారేగాని".... మరి మాట పెగల్లా తన పక్కలో అయిదేళ్ళ పిల్ల అలా ఏడుస్తుంటే ఏ తల్లి అలా భరించ గలదు? ఏడ్చి ఏడ్చి నిద్రపోయింది నీలిమ. కళ్ళు మూత పడలా నాకు.

సాయంత్రం జరిగిన సంఘటన నా కళ్ళల్లో మెదిలింది.

"ఒసే నల్లిముండా! బూట్ పాలిష్ అలా పులిమావేమే. వర్తిరోతపీనిగెవి. పుట్టగానే చచ్చినా పొయ్యేది" గొడ్డును బాదినట్లు బాదాడు తండ్రి.

"పసిదాని స్వచ్ఛమైన ఆలోచల్లో పల్లేర్లు చల్లకండీ! రూపం కంటే గుణం దొడ్డది. అందచందాలు పుట్టుకతోవస్తై. అవి మార్చుకోలేం. గుణగణాలు మనం సరిదిద్దుకోగలంకదా! పసి హృదయాల్లో పన్నీరు చల్లాలికాని విసపు జల్లులు చల్లొచ్చా! ఆ లేత హృదయాన్నలా రోజూ గాయపర్చకండీ. చిన్ననాటి మనోభావాలు జీవితాంతం చెరగని ముద్రలండీ" బాధను భరించలేక మనోవ్యధ బహిర్గతంచేస్తూ అడిగాను.

"నోర్మూసుకుని పడివుండక నాకు హితోక్తులు చెప్పే సాహసం వచ్చిందే! పెద్దజ్ఞానబోధ చేస్తూన్నావే. మహ కన్నావులే నీగోర్రముండని! దాని పేరెత్తినా, దాన్ని చూచినా నాకు పరమరోత. దాన్నెక్కడైనా దాసిముండగా కుదుర్చు." పెద్దగా అరిచాడు.

"మీదెంత పాషాణ హృదయమండీ! మీరు కన్న బిడ్డమీద కూడ మీకు వాత్సల్యం లేదు". నా ముఖంలో విషాదచాయలు గోచరించాయి. తల్లి తనని అగౌరవించినా, దూషించినా అంతగా పట్టించుకోదు. కాని తన బిడ్డను కించపరిస్తే అగ్గిమీద గుగ్గిలం అవుతుంది. ఏనాడూ భర్తను ఎదిరించనిదాన్ని నాముద్దుల పిల్లనలా హింసిస్తుంటే సహించలేక పోయాను.

"ఏం గీతాభోధ అయిందా? ఇంకా ఉపదేశిస్తావా? హద్దు దాటితే ..........."

"కావాలంటే నన్ను హింసించండి. కాని ముక్కుపచ్చ లారని..........."

"ఏం, మితిమీరిపోతున్నావు? ఇంకానయం. ఆజెర్రి ముండకు చక్కని మొగుణ్ణి తెమ్మన్నావుకాదు. నీవు నీకూతుర్ని బాగా పోషిస్తున్నావు. డబ్బు, శ్రమ, చాకిరి తప్ప అదెందుకూ పనికిరాని ఇంటి కుక్క. దానివల్ల మనకేంలాభంలేదు" అవహేళనచేశాడు.

"ఆ పిల్ల మీ కూతురు కాదా! కన్నాక మనం చూసేదివాళ్ళ ఆలనా పాలనా కాని వారి అందచందాలు కావుకదా!"

"ఛో, నీవు ఆ గోడతో సమానం. నీ సూక్తులు వెట్టివి. నీతో నాట్యము వేస్తు చేయలేను." గభాలున తలుపేసి వెళ్ళి పొయ్యాడు ధర్. దిగాలుపడి కూర్చున్నానునన్ను పరాభవించి ఆయన అలా వెళ్ళి పోయినందుకు.

నాబిడ్డ నీలికిఅందం లేకపోయినా మెత్తని స్వభావముంది. ఉషః కాంతిలా కల్మషంలేని మనస్సుంది. అణకువ, మర్యాద కలపిల్ల. తల్లికెంతో సాయపడుతుంది. నాకు పిల్లంటే ప్రాణం. కనురెప్పలా కాపాడుకునేదాన్ని. తీరిక చేసుకొని నీలికి చదువు చెప్పేదాన్ని. మంచి మంచి నీతి కథలు, మహాత్ముల చరిత్రలూ చెప్తూవుండేదాన్ని.

# 13

ఎందువల్లో ఆరోజు యుగంధర్ ఇల్లు వదలి వెళ్ళలేదు. రాత్రి 11 గంటలయింది. ఎవరో వాకిలి తలుపులు దబా దబా బాదుతున్నారు. యుగంధర్ గాఢ నిద్రలో ఉన్నాడు. నేను ఆదరా బాదరా వెళ్ళాను వీధివాకిలి వద్దకు.

"ఎవరూ" అన్నాను.

"నేను అమ్మణ్ణిని, త్వరగా తలుపు తీయండి". ఆడగొంతు వినిపించింది. ఆడవాళ్ళేగదా అనే ధైర్యంతో తలుపు తీశాను. ఒకస్త్రీ ఒక్కదాటున ఇంట్లోకి వచ్చింది.

"యుగంధర్! ఎక్కడున్నావు? త్వరగారా" అంటూ కేక పెట్టింది, తలుపు గడియ వేసివచ్చి.

నేను ఆమెను చూచాను. ఎత్తైన మడమల బూట్సు, పెదిమలకు చెంపలకు రంగు, చేతులులేని జాకెట్టు, బాబ్డ్ జుట్టు, విదేశీ నైలాన్ చీర, గోపురంలాంటి సిగముడి. సినీతార మేకప్‌లో వుంది. వయస్సు 35 ఏళ్లు ఉంటాయి. పైలా పచ్చీసు మనిషిలా ఉంది. "ఎవరామె? ఎందుకొచ్చినట్లు, ఈ అర్ధ రాత్రి యుగంధర్ కోసం? ఆమెకు యుగంధర్‌కు ఏమిటి సంబంధం? ఈమెకు యుగంధర్‌తో ఇంత చనువేమిటి?" ఇలా ఎన్నో ప్రశ్నలు నామెదడులో మెదిలాయి.

తినబొయ్యేముందు రుచి అడగడమెందుకని కుతూహలాన్ని అణచిపెట్టుకున్నాను.

ఇంతలో యుగంధర్ లేచి కళ్ళునులుముకుంటూ వచ్చాడు. ఆమెను చూడగానే స్తంభించి పోయాడు. ఏదో తప్పుచేసిన వాడిలా ముఖంపెట్టాడు.

"అమ్మణ్ణీ! ఇలా అర్ధరాత్రి అనుకోకుండా పరుగెత్తుకొని వచ్చావు? ఏమిటి హడావుడి? కబురుచేస్తేనే రాకపోయాను" అన్నాడు యజమాని ఆజ్ఞను సర్వదా పాలించే భృత్యునివలె.

నాకిదంతా అగమ్య గోచరంగా ఉంది.

'ఈమె నా భర్త యజమానురాలా' అనే సందేహంనన్ను పీడించ మొదలైంది.

యుగంధర్ తేరుకుని "కాంచీ, రెండు స్ట్రాంగు కాఫీలు తీసుకొనిరా" అని నాకు పురమాయించాడు. నేను అక్కడ ఉండటం అతనికి ఇష్టంలేదని గ్రహించాను. అయినా నాకెందుకీ గొడవ అని వంట ఇంట్లోకే వెళ్ళాను.

"కూర్చో అమ్మణ్ణీ" అని ఆహ్వానించాడు యుగంధర్.

"కూర్చోడానికి రాలేదు. విషయం తెలియజెప్పి తేల్చుకొని పోవడానికి వచ్చాను" అన్నది ఆస్త్రీ.

"ఏమిటీ విషయం! చెప్పరాదూ" ప్రాధేయపడుతున్నాడు.

"చెప్పడానికేముంది? నీకు తెలుసుకదా, టౌను పోలీసు డిప్యూటీ సూపరింటెండెంటు మారాడని. క్రొత్త అధికారితో మనకు ఇంకా లావాదేవీలు ఏర్పడలేదు. ప్రతి అధికారీకొత్తగా ఉద్యోగం చార్జి పుచ్చుకోగానే ముమ్ముందు తడాఖా చూపించాలిగా! అదే జరిగింది ఇపుడు కూడా" అన్నది ఆమె నింపాదిగా.

"ఇంతకూ ఏం జరిగింది? అన్నాడు ధర్.

"ఏం జరుగుతుంది? మామూలుగా జరిగేదే ఈసారి జరిగింది. కాకపోతే మన దగ్గర మామూళ్ళుతినే స్టేషను రైటరు

సకాలానికి సమాచారం అందజేయలేక పోయాడు. దాంతో దాడి జరగక తప్పలేదు".

"దాడికొస్తే వచ్చేరులే. ఎవరూ దొరకలేదు కదా?" అని ఆదుర్దాగా అడిగాడు ధర్.

ఏమిటి వ్యాపారం? ఎలాంటిదాడి అది? వంట ఇంట్లోంచి మాటలు వింటున్న నాకు అర్ధంకావటం లేదు.

"దొరకకపోతే బాగుండేదే! కాని ఎప్పుడూ మనంఅనుకున్నట్టే జరుగుతుందా! మన ఆస్తి అంతా పోయింది. నేనూ ఖాసిమా మిగిలాము." ఏడుస్తున్న కంఠధ్వని అది.

"ఊరుకో అమ్మణ్ణీ" బాధపడకు. మళ్ళా సంపాదించవచ్చు వెధవ ఆస్తి. నీవు భద్రంగా ఉన్నావు, అదే పదివేలు. ఈరోజు నాకు వంట్లో బాగుండక ఇంటికొచ్చాను. నేను ఉంటే ఇంత ప్రమాదం ముంచుకొచ్చేది కాదు" అన్నాడు సగర్వంగా ధర్.

"అవును నీకేం, చెప్తావు మహా తేలికగా. నల్గురుమనుషులను పోగుచేయడం, వారిని వాడుకోవడం ఎంత కష్టమో నీకు ఇంకా తెలియడం లేదు".

"నాకా తెలియనిది. నీకు మనుషులను పోగుచేసికొని వచ్చేది నేనుగాక మరెవ్వరు? ఆ కష్టం నా కన్నా నీకు ఎక్కువ తెలుసా" చిరాగ్గా అన్నాడు ధర్.

"నిజమేననుకో. పోగుచేసిన జనం గట్టిసరుకై తేకదా? అంతా

తాలు సరుకు. వాజమ్మలు. సంపాదించలేరు; దాక్కోనూ లేరు. దారికిపోయారు దద్దమ్మలు" అని వాపోయింది అమ్మణ్ణి.

"ఇంతకూ ఏమిటి నీ దోరణి? నేను మంచివాళ్ళను చెర బట్టలేదనేగా నీవనేది? చెరబట్టిన వాళ్ళను నీ కప్పగిస్తున్నాను. వాళ్ళను అదుపులో ఉంచవలసింది నీవు. తీర్చిదిద్దుకో వలసింది నీవు. నాచేతనైనంత సాయంచేస్తూనే ఉంటిని." ఫిర్యాదు చేస్తున్నట్లుగా మాట్లాడాడు ధర్.

మాటలు స్పష్టంగానే ఉన్నాయి. కాని అర్థం నిగూఢంగా ఉంది. విషయమేదో నాకు అంతుపట్టలా.

"అదికాదు ధర్! మాలతి దారిలోనికే రాలేదు. మాధవికి కడుపునొప్పి. లతకు ఆడవాళ్ళ జబ్బు. హేమకు ఎప్పుడూ విడవని తలనొప్పి. లక్ష్మి నిన్నగాక మొన్న వచ్చిన క్రొత్త మొగం. సరస్వతికి తెచ్చుకున్న రోగంకాక గర్భస్రావం చేయించా. ఇలాంటి వాళ్ళతో ఎలా వేగేది?" అనునయ పూర్వకంగా పలికింది అమ్మణ్ణి.

"ఏమిటి ఇందరు ఆడవాళ్ళతో వారుచేసే వ్యాపారం?" నాకేమీ తోచడంలా. ఈ విషయాలెప్పుడూ వినలే.

"అమ్మణ్ణీ! నన్ను తప్పు పట్టేవిధంగా అన్యాపదేశంగా మాట్లాడితే నేను ఊరుకోను. ఇంచుమించుగా వాళ్ళందరినీ నీవద్దకు చేర్చింది నేను. మాలతిని పెళ్ళిచేసుకొని తెచ్చి కంపెనీలో చేర్పించింది నేను. అత్తగారితో పోట్లాడి టౌనుకు వచ్చిన మాధవిని

మస్కాకొట్టి మన ఇంటికి తెచ్చి ఆమెనా గోతిలోనికి తోసింది నేను. సినిమాలో చేరదామనే గంపెడాశతో వచ్చిన లతను చేరదీసి భ్రష్టురాలిని చేసింది నేను. ప్రక్క కంపెనీలో బాగా సంపాదిస్తున్న హేమకు నా సామర్థ్యంతో నాదగ్గరకు రాబట్టింది నేను. రెండోఆట సినిమానించి ఇంటికివెళ్తున్న లక్ష్మిని అమాంతం ఎత్తుకొచ్చి మన కంపెనీలో పెట్టి ఆమెను, నయానా- భయాన దోవలోనికి తెచ్చింది నేను. ఇక సరస్వతి అంటావు, ఆమె నొక్కతినే నీవు సంపాదించావు. ఏదైనా నీవు చెప్పినట్లు విని ఆమెను బలత్కారించింది నేనేకదా! ఇన్ని చేసిన నన్ను నీవు సాధిస్తే, నేను ఊరుకోలేను. నావళ్లు మండిపోతోంది." అన్నాడుధర్ కోపంగా.

దాంతో అమ్మణ్ణి రెచ్చిపోయింది కామోసు! కంఠస్వరం హెచ్చించింది.

"ఏమిటి నీవనేది? కాస్తోకూస్తో కష్టపడ్డావేమో! ప్రతిఫలం అందుకు పదిరెట్లు అన్ని రకాలూ పొందావు. పైకానికి పైకం, మనుషులకు మనుషులూ అన్నీ హక్కులు నీకు. నేనేమీ నిన్ను దగాచేయులేదే. మొదటినుంచీ వ్యాపారంలో నీసగం వాటా నీకు అందజేస్తూనే ఉంటిని"

'ఆడవాళ్లను దారిలోనికి తెచ్చేవృత్తా నా భర్తది? అంటే ఆడవాళ్లను బలాత్కరించి వారిశీలాన్ని హరించి వారు పడుపు వృత్తికి ఇష్టపడేలా చెయ్యడమే ఈయనచేసే మహత్కార్యం? అమ్మణ్ణి వీరిని చేరదీసి పడుపు గృహాన్ని నడిపే భోగ్రిధల్‌కీపరా?

ఇదా వీరి సంబంధం? ఇదా వీడి సంపాదనా? ఎంత ఘోరం! ఎలాంటి నీచుడికి భార్యనై బ్రతుకుతున్నాను. భూదేవి సీతా అమ్మవారిని తీసుకొని పోయినట్లుగా నన్ను తనలో కలుపుకోకూడదా? అని వాపోయాను.

ఈ సమయంలో వాళ్ళ ముఖాలు చూడాలని నాకు మనసైంది.

రెండు కాఫీ కప్పులతో హాలులోనికి ప్రవేశించి చెరో కాఫీ కప్పు ఇచ్చి వాళ్ళను తేరిపారజూచి వెళ్ళిపోయాను.

ఇద్దరూ పోట్లాడుకుంటున్నట్లు మాట్లాడుతున్నారు. కాని ఇద్దరి మధ్యా ఏదో ఆత్మీయత ఉన్నట్లు ద్యోతకమవుతున్నది. ఏమిటివారి అనుబంధం? ప్రేయసీ ప్రియులా? భార్యాభర్తలా? లేక కేవలం వ్యాపారంలో భాగస్తులా? అచ్చం భాగస్తులయితే అంత చనువు, అభిమానం ఉంటాయా? కాని కొద్దిసేపట్లో అదే తెలుస్తుంది కదా? నేను నిద్దరపోతున్నాననే నమ్మకం వారికికల్గితే అని నాకు తోచింది. వెంటనే హాలులోనికి వచ్చి

"ఏమండీ! నేను నిద్రపోతున్నాను. మీకేమీ ఇంకేమీ అక్కరలేదుకదా. పిల్లలు హాలులోనే నిద్రపోయారు. తరువాత గదిలో పడుకోబెట్టండి" అని చెప్పి పడకగదిలోనికి పోయాను.

ఈలోగా నన్ను తేరిపార జూచింది. ఆమెకళ్ళలో ఆశ్చర్యం చోటుచేసుకుంది.

వాళ్ళెంత తక్కువ స్వరంతో మాట్లాడుకుంటున్నా చెవులు నిక్కబొడుచుకొని వింటున్న నాకు విన్పడుతూనే ఉన్నాయి మాటలు.

"ధర్! ఈమెను నాకెప్పుడూ చూపించనేలేదు? ఇన్నాళ్ళు. ఎప్పుడు తెచ్చావు ఈ పిట్టను? మన కంపెనీలో ఎందుకు చేర్పించ లేదు ఇంతవరకూ! ఏమిటి అన్యాయం?" అని నిలదీసింది అమ్మణ్ణి.

ధర్ స్వరంలో వణకు స్ఫురించింది.

"అమ్మణ్ణీ! నన్ను అనుమానిస్తున్నావా? కొత్త గొడ్డును మచ్చిక చెయ్యొద్దూ? పైగా రెండు ఈతలది. దారికి తెచ్చేటప్పటికి మూడోపిల్ల. నీకేం తెలుసు మా మదవాళ్ళ బాధలు?'' అని బ్రతిమాలుతున్నట్లు జవాబు చెప్పాడు ధర్.

"ధర్! నా దగ్గరనా నీమాటలు. గోడకట్టినట్లుగా అబద్దాలు ఆడటం మీమగాళ్ళకేం చేతనవుతుంది? దొరికి పోతారు. ఈమె మీద మోజుపడి నీవు స్వంతానికి దాచుకున్నావు. ఈ మాత్రం గ్రహించలేనంత తెలివి తక్కువదాన్ని కాదు. కాని వ్యాపార వస్తువుమీద మోజు పెంచుకోవడం వ్యాపార లక్షణం కాదోయ్.'' అన్నది అమ్మణ్ణి ధృఢంగా.

"ఎంత మంది ఆడవాళ్ళను నేను తెచ్చి కంపెనీలో చేర్చ లేదు! ఎవరినైనా నేను వేరే ఉంచుకున్నానా! నిన్ను, నేను అన్యాయం చేస్తానా! ఎలాఅనగలిగావు ఆమాట? ఇంతకూనీవెవరు,

నేనెవరు? నీది, నాది అని మనకు భేదం ఏనాడైనా ఉండిందా? నీవు చేసే ఈ వ్యాపారం ఎవరికోసం, నాకోసం కాక? నేను ఇంత మంది ఆడవాళ్ళను తెచ్చి నీకప్పగించేది ఎవరికోసం, నీకోసం గాక? ఏమిటీ విషపు మాటలు? ఎందుకే ఈ అభిప్రాయ భేదాలు? ఇన్నాళ్ళు పొరపొచ్చం లేకుండా కాపురంచేశామే. నువ్వేనా నన్ను అపార్థం చేసుకోవాల్సింది?" అంటూ నచ్చ జెప్తున్నాడుధర్.

"అదికాదోయ్, ఎంతైనా పాతరోత- క్రొత్త రుచి అన్నారు కదా! క్రొత్త మోజులో నన్ను మర్చిపోతున్నావనే బాధతో అంటున్నా. అంతేగాని నీమనసు నాకు తెలియదా?" అంది అమ్మణ్ణి? కాని ఆ మాటలలో ధర్ మాటలను విశ్వసించిన ధోరణి లేనే లేదు. పెదవుల మీదనుంచి వచ్చిన పలుకులవి.

"తేలిపోయింది వీళ్ళ సంబంధం. వీళ్ళు వ్యాపారంలో భాగస్తులేకాదు: వీళ్ళిద్దరికి భార్యాభర్తల సంబంధం ఉంది. పెళ్ళి ఆయిందో లేదోగాని నిశ్చయంగా వారిది పెద్ద అనుబంధమే. కాకపోతే దాంపత్య సంబంధం ముందా, లేక వ్యాపార సంబంధం ముందా అనేది తేలని ప్రశ్న. విత్తు ముందా, చెట్టు ముందా అనే సమస్యలాంటిది ఇది. ఇంతకూ ఏ సంబంధం ముందైతే నాకేమి? ఏదాయి అయితేనేమి పండ్లూడ గొట్టుకోవటానికి" అని నిశ్చయించుకున్నాను.

"అమ్మణ్ణీ ఇన్నిఏళ్లుగా మనం ఒకటిగా బ్రతుకుతున్నా నా మనసు నీకు అర్థంకాలేదా? నాకు నీ మీదగాక మరొకరి

మీద మోజు ఉంటుందా? కాకపోతే వ్యాపార దృష్టితో కొన్ని నాటకాలు ఆడాల్సివచ్చి వేరుగా మరో ఇంట్లో ఉంటున్నాగాని, నన్ను అర్థంచేసుకోవా" అని ప్రాధేయపడి బ్రతిమిలాడే ధోరణిలో పలికాడు ధర్.

" అది కాదోయ్! ఇంతకాలం మన కంపెనీలో ఉన్న సరుకు వేరు. ఈమె వేరు. ఈమెలాంటిది ఒక్కతే పదిమంది పెట్టు. ఎందుకీ డజన్ల పిట్టలు! ఒక్క రామచిలుక చాలదూ వందల సంఖ్యలో ప్యాసింజర్లను రాబట్టటానికి. ఇలాంటి చిలకను ఒక్క దాన్ని పోషించుకుంటే మన బ్రతుకులు సలక్షణంగా పైభోగంగా వెళ్ళిపోతాయి అనే నేనది."

"ఓపిక పట్టు అమ్మణ్ణీ! తొందరపడి పని చెడగొట్టుకో కూడదు. నామీద నమ్మకం లేదా నీకు" ప్రశ్నార్థకంగా అడిగాడు ధర్.

"ఏమిటోయ్ ఈ మాటలు" అని కంఠాన్ని కులికించింది అమ్మణ్ణి.

తరువాత మాటలు వినపడలా నాకు, వారి గుసగుసలు కువకువలు తప్ప.

ధర్ పడకగదిలోనికి రాలేదు ఆ రాత్రి. హాలులోనే అమ్మణ్ణీ తనూ............

# 14

"అమ్మణ్ణి వచ్చిపోయిన మర్నాడు నాబుర్ర వేడెక్కింది. ఇప్పటి నైచ్యస్థితి వేరు. ఒక పశువు కామదాహానికి బలిఅయి, సంఘంలో భార్య అనే హోదాతో బ్రతుకుతున్నాను. ఇకముందు ఈ మాత్రపు స్థాయికికూడా నోచుకోలేనా? ధర్ నన్ను అమ్మణ్ణి కంపెనీలో చేరుస్తాడా? అసలు అందుకనేనా నన్ను పెండ్లిచేసుకుంది? ఛఛ! ఎంత నీచుడైనా అలా ప్రవర్తించడు! మరి అతడే చెప్పాడుగా మాలతిని పెండ్లిచేసుకుని మోసపుచ్చానని? నన్ను మాత్రం అలా అన్యాయం చేయడని హామీఏముంది? ఆ పరిస్థితే వస్తే నాగతేమికాను? నా పిల్లల భవిష్యత్తు ఏమవుతుంది." ఈ ప్రశ్నలకు సమాధానాలు దొరకక సతమవుతున్నాను.

ఇన్ని ప్రశ్నలూ కొంత కాలానికి మాయమయ్యాయి. ఒకటే ప్రశ్న మిగిలింది. "ఇపుడు ఏంచెయ్యాలి? ఇపుడు ఏంచెయ్యాలి? ఇపుడు ఏంచేయాలి!"

కాంచన కథను ఓపికగా వింటున్న నర్మదకు వ్యథ కలిగింది. ఇక వినలేక పోయింది.

"చాలు అక్కా! చాలు ఎన్ని కష్టాలు అనుభవించావు నీవు. ఎన్ని ఇక్కట్లు పాలయ్యావు నీవు. ఎంత ఘోరదురవస్థలో వున్నావు? ఎలాంటి నీచుని భార్యగా బ్రతికావు. ఎలా ఓర్చుకోగల్గావు. నేనైతేనా............"

"అమ్మా! నర్మదా! వాక్యం మధ్యలో ఆపేసావేమి! చెప్పవమ్మా చెప్పు నీవు నాస్థితిలో ఉంటే ఏమిచేసేదానివో. నేను నీవద్ద నేర్చుకుంటానమ్మా!" అన్నది కాంచన.

"అక్కా తొందరపడి నీ మనస్సుకు బాధ కలిగించాను. మన్నించు అక్కా" బ్రతిమాలింది నర్మద.

"కాదమ్మా! నాకు బాధలేదు! కోపం అంతకన్నా లేదు. నాలో అన్ని ఉద్వేగాలు నశించి పోయినవమ్మా. ఇంతకు నీ వైతే ఏమి చేస్తావో చెప్పవూ" అంది కాంచన. చెప్పకతప్పదన్నట్లు.

"అక్కా! క్షమించు. నీవు ఇప్పుడు కోరుతున్నది చెప్పను కాని నీవు ఒకప్పుడు కోరింది చెప్తానమ్మా."

"నీవు ఇలా ఒంటరిజీవితం ఎందుకు గడుపుతున్నావని అడిగావు కదూ? నా కథ నీకు కొంతవరకు మునుపుచెప్పాను. ఇపుడు మిగతాది పూర్తి చేస్తాను. నాకథ నీకు ఉపయుక్తమైతే సంతోషిస్తాను అక్కా!"

"అంతకన్నా కావలసిందే ముందమ్మా! నేనే అడగాలను కాని మోమాట పడ్డానమ్మా. తరచి తరచి అడగటానికి నాకు చొరవ వుంది. నీవు నా చెల్లెలులాంటి దానివి. నాకుతుహలాన్ని తీర్చవామ్మా" అన్నది కాంచన.

"చిట్టి అనే అమ్మాయి నర్సుకోర్సులో చేరిందన్నానే ఆ చిట్టే నర్మద. ఇకవిను తరువాత కథ." అంటూ నర్మద తన కథను ప్రారంభించింది ఎవరికథో అన్నట్లుగా-

నర్మద నాలుగు సంవత్సరాల నర్సింగుకోర్సు పూర్తయింది. ఫస్టుక్లాసులో పాసయింది. అందరికీ ఆత్మీయురాలయింది. ఎవరికి ఏవిధంగా తోడ్పడదామా అనేది ఆమె ధ్యేయం. నర్సింగు కాలేజీ స్నాతకోత్సవానికి డాక్టర్లను, హాస్పిటల్ టెక్నీషియన్సుకూ ఆహ్వానాలు పంపారు. అందువల్ల ఈ ఉత్సవానికి కలుద్దామని అందరూ వచ్చారు. జలజ ఇపుడు మెడిసిన్ నాలుగవ సంవత్సరం చదువుతోంది. నర్మద ప్రత్యేకంగా జలజను ఆహ్వానించి వచ్చింది.

నర్సింగు కాలేజి ప్రిన్సిపాల్, సభా ప్రారంభకుడు, సూపరింటెండెంటు సభాధ్యక్షులుగా ఆసీనులైనారు. వేలమంది విద్యార్థి, విద్యార్థినులు హాజరైనారు. వందేమాతరం ఆలాపనతో సభ ప్రారంభమయింది. ఆ సంవత్సరం నర్మదకు గోల్డుమెడల్ వచ్చింది. అంతా పూలదండలతో ముంచెత్తారు. ఆమెనందరూ అభినందించారు. మిగతా విద్యార్థినులకు డిగ్రీలు పంచబడ్డాయి. చివర సాంస్కృతిక కార్యక్రమంలో నర్మద వ్రాసిన గేయనాటిక 'ముందడుగు' ప్రదర్శన జరిగింది. పాత సంప్రదాయాలను కట్టిపెట్టి స్త్రీ పురుష సమానత్వం కోసం పోరాటమే దాని ఇతివృత్తం. ఆస్తులు- అంతస్తులుకాదు, కావాల్సింది సంస్కారం. భార్యాభర్తలిద్దరూ పరస్పర ప్రేమ గౌరవాలతో సంచరిస్తూ సమాజానికి తోడ్పడాలని దీని భావం. ఇందులో నాయకి నర్మద. అందరూ ఆశ్చర్య చకితులైనారు. ఆమె నటనాచాతుర్యానికి, సహజమైన ఆమె హావభావాలకు విభ్రాంతులైనారు. ఆమెను మెచ్చుకున్నారు వచ్చినవారంతా.

వెల్లూరు హాస్పటల్ ఎక్సరే డిపార్టుమెంటు అధికారిగా పనిచేస్తున్న కిశోర్‌కుమార్ 2 సంవత్సరాలుగా నర్మదమీద మోజుతో వున్నాడు. వెయ్యి రూ॥ల జీతంమీద ఉద్యోగం వచ్చిందనివిని మరీతొందరలో వున్నాడు. ఈనాటి సభకు ప్రత్యేకంగా ఆమెతో పరిచయంకోసమే వచ్చాడు. సభకాగానే అంతా హడావిడిగా వెళ్ళిపోతున్నారు. పెద్ద పూలదండతో వాకిలి ప్రక్క నిలబడ్డాడు కుమార్. నర్మద వస్తున్నదాన్ని ఆపి దండవేసి....

“హల్లో! కంగాౄట్యులేషన్సు”

“ఎంత బాగా యాక్టుచేశారు. నటనలో మీకుమీరే సాటి. స్త్రీ పురుషసమానత్వ విషయంలో మీతోనేను ఏకీభవిస్తున్నానండీ!”

“నేను మొదట్నించీ సోషలిష్టు భావాలుకలవాణ్ణి. అందులో ముఖ్యంగా స్త్రీ పురుష సమానత్వాన్ని వాంఛించే వాణ్ణేనండీ. పురుషుల్లో అభ్యుదయ భావాలు కలవారు చాలా తక్కువ. మనిద్దరి భావాలు ఒకటిగావున్నై. అందువల్లే మీరంటే నాకు చాలా గౌరవభావం కల్గింది. మీరేమీ అన్యధా భావించకపోతే నా కారులో మిమ్ము గిగబెట్టి వస్తా” మందహాసంచేస్తూ ఎగాదిగా చూచాడు.

“చాలా థాంక్సు అండీ! నాకు రోజూ నడిచి వెళ్ళటమే అలవాటండీ” అంటూ వడివడిగా వెళ్లిపోయింది నర్మద.

మర్నాడు సాయంత్రం నర్మద క్వార్టర్సుకొచ్చాడు కుమార్. పిచ్చాపాటి మాట్లాడి "మీరు శలవలకు మీ ఇంటికి వెడతారా? ఎప్పుడు! మళ్లా ఎప్పుడొస్తారు" కుమార్ ఎంతో ప్రేమతో అడిగాడు.

"రేపు సాయంత్రం వెడతానండి. నాకు ఉద్యోగమిస్తూ ఉత్తరువు ఇచ్చారు. ఈ హాస్పటల్లోనే 15 రోజుల్లో చేరాలి. మావాళ్ళందర్నీ చూచి చాలాకాలమయింది. ఎలా వున్నారో, ఏమో! ఇంకో పది రోజులు టైము అడిగి వుండివద్దామని వెడుతున్నా. ఈనెలాఖరులోగా ఉద్యోగంలో చేరతాను" సూటిగా జవాబిచ్చింది.

"మీది చాలా అదృష్ట జాతకమండి. ఇక్కడ వుద్యోగం కోసం పడికాపులు కాస్తారు. తపస్సు చేస్తారు. పెద్దలద్వారా సిఫారసులు పడతారు. అఫ్‌కోర్సు, మీ ఉద్యోగం పూర్తి మెరిట్‌మీద వచ్చింది అనుకోండి" పొగిడాడు కుమార్.

"దానిదేముందండీ. నాకన్నా తెలివిగలవారు, సహృదములు చాలామంది వున్నారు? నేననగా ఎంత? ఏదైనా డ్యూటీలో వుండగా మంచిగా వుండగలిగితే, పెడదారి పట్టకుంటే ఆనాడు శ్లాఘించండి." సగౌరవంగా సమాధాన మిచ్చింది నర్మద.

మరోలా అనుకోకండి. "మీకు జీతం ఎంత? డి. ఎ. లు, ఇతర బెనిఫిట్సు బాగా ఇచ్చారా?" కుతూహలంగా అడిగాడు.

"స్టాఫ్ అసిస్టెంటుగా వేశారండీ? కొద్ది సంవత్సరాల్లో చీఫ్ అవ్వొచ్చు. వెయ్యి రూపాయల జీతం. క్వార్టర్సు. ఇతర డి. ఏ,

డ్రిస్సు వగైరాలన్నీ వుంటై. ఏదో ఇదంతా అలెగ్జాండరు గారి దయవల్లే జరిగింది. ఇప్పుడు వారింటికి పోబోతున్నాను, వారికి ధన్యవాదాలు చెప్పటానికి''

''మీరు బిజీగా వున్నట్లున్నారు. రేపు వస్తా. మీ కిష్టముంటే నా కారులో అలెగ్జాండరుగారి ఇంటివద్ద దింపుతా''.

''వొద్దండి! ముందు జలజతో చెప్పి, తర్వాత అక్కడికెడతా'' తాళంవేసి వెళ్ళి పోయింది. ఆమె ముఖంలో ఏ ఉత్సాహం కనపరచలా.

'కొంచెం నాటు సరుకులాపుందే! అయినా ప్రయత్నిద్దాం' అనుకుంటూ వెళ్లాడు.

ఆ సాయంత్రం తలారు స్నానంచేసి తలారుచ్చుకుంటూ పేపరు చూస్తుంది నర్మద. పాదధ్వని విని తలెత్తి చూచింది. చక్కని సూటులో నీటుగా ముస్తాబై వచ్చాడు కుమార్.

''కూర్చోండి''

''నాతో ఏంపని ఇతనికి? అసలు విషయమేమిటి? ఇలా ఎందుకు వస్తున్నాడో, ఏమో? రకరకాల మనుష్యులుంటారు'' అనుకున్నది. అగౌరవ పర్చడం అసభ్యమని, పొమ్మంటే బాగుండదనీ ఆలోచిస్తుంది నర్మద.

''ఏదో ఆలోచిస్తున్నారు? ఈరోజు సాయంత్రమే కదా మీ ప్రయాణం?''

తన వుద్యోగం, హోదా, తల్లిదండ్రుల గొప్పతనం ఏకరువు పెట్టాడు. కాస్త చికాకనిపించినా సభ్యత కాదని వింటోంది

నర్మద. ఎన్ని విషయాలు చెప్పినా ఆసక్తిగాని, ఉత్సాహం కాని కనపర్చలేదు నర్మద.

"చూడండి" సందేహిస్తున్నాడు.

"మీతో ఒక విషయం ప్రస్తావిస్తా. ఒక 10 ని॥లు మాట్లాడ గలరా! చొరవ తీసుకొంటున్నందుకు అన్యథా తలచకండి." మాట్నిపడి పోయింది నర్మద.

"నేను చాలాకాలంగా నాకు తగిన వ్యక్తి దొరకక వివాహ ప్రసక్తి తేనీలేదు. మావాళ్ళూ, నన్ను బ్రతకనియ్యటం లేదు. కట్నాలు, లాంఛనాల రేటు వేలు దాటుతున్నాయి. ఈ రోజుల్లో ఏవరాలతో రోజూ ఒక ఫొటో, లాంచనాలతో ఒక ఉత్తరం పంపుతున్నారు. కానీ నా అభిరుచులకు తగిన వ్యక్తి లభిస్తేనే వివాహం, లేకపోతే బ్రహ్మచర్యమే నాజీవితధ్యేయం. ఇన్నాళ్ళకి మీలో నా ఆశయాలు గోచరించినై. ఇది నా అంతరాత్మ ప్రబోధం. మీ జీవిత సహచరుణ్ణిగా వుండే అదృష్టం, అర్హత నాకున్నయ్యా?" గుటకలు మ్రింగుతూ చెప్పాడు కుమార్.

"నాలో మీకు నచ్చేంత సంస్కారం యేముందండీ? నేనూ అందరిలాంటి దాన్నే! నాకు ప్రత్యేక లక్షణాలు ఏమున్నై? నన్ను మీరు అపార్థం చేసుకుంటున్నారు. అసలు నేనింతవరకు నా పెండ్లిని గురించి ఆలోచించలేదు. నాకిప్పుడంత తొందర లేదు; అవసరమూ లేదు. నేను ఒంటరిగానైనా జీవించగలను!" నింపాదిగా సమాధానమిచ్చింది.

"ఇది లోకమండీ! అదీగాక దాపంత్య జీవితం ప్రకృతి సహజం. యుక్తవయస్సులు జతకట్టటం సామాజిక నీతి. మానవ ప్రవృత్తుల్ని పెడదారి పట్టించడం భావ్యంకాదు. ఈరోజు కాకున్నా రేపైనా మీరు కుటుంబ జీవితం కోరుకోరా?

"నా ప్రకృతి వేరు. నేను తట్టుకోగలనండీ! ఇంకో ముఖ్య విషయం: నా తండ్రి బహుకుటుంబీకుడు. బాధ్యతలు కలవాడు. వయస్సు మళ్ళినవాడు. నేను వారికుటుంబ బాధ్యతంతా నానెత్తిన వేసుకున్నా. నా అనేదంతా నా తమ్ముల చదువు, చెల్లి పెండ్లి, పెద్దల పోషణ- వీటికే వెచ్చించాలి నా జీతమంతా. అవి ఇప్పట్లో తేలవు! అంతదాక నా పెండ్లి ప్రసక్తి వుండదండీ"! మెల్లగా లోనికి నడిచింది నర్మద.

"మీ ఇంటి అడ్రసివ్వండి. వివాహం జీవితంలో ముఖ్య భాగమండీ! అందులో స్త్రీకి చాలా ముఖ్యం. ఆలోచించండి; అవకాశాలు తరచుగారావు ఎవరికైనా." హెచ్చరిస్తూ వెళ్ళాడు కుమార్.

శలవల కొచ్చిన నర్మద తమ్ములకు, పెద్దలకు కానుకలు ఇచ్చి క్షేమసమాచారాలు విచారించింది. జలజ శలవలకొచ్చిందని నర్మద వెళ్ళి వాళ్ళ నాన్నగారికి నమస్కరించి కృతజ్ఞత చెప్పింది. జలజ ఈరోజుండి వెళ్లమంది. వాళ్ళమ్మకు ఇష్టముండదని గ్రహించి "కాదు జలజా" ఈరోజు చెల్లికి పెళ్ళివారొస్తారట. ఇంకా 20 రోజులుంటాగా" అంటూ వెళ్లింది నర్మద.

గేటుతీసి లోనిదృశ్యం చూచి నివ్వెరపోయింది. కుమార్ తన తండ్రితో మాట్లాడుతున్నాడు. ఏమి చెప్పాడో ఏమో, నాతల్లి దండ్రులు కాఫీ టిఫిను ఇచ్చి కబుర్లు చెప్తున్నారు.

"పెద్ద ఉద్యోగస్తుడు, పిల్లాడు రూపసి; నీవు కావాలని కోరి వచ్చాడు. పైసా ముట్టడట. తల్లిదండ్రుల పేరుప్రతిష్టలు కలవారట. మనం కాదంటే లక్షమంది" లోనికొచ్చిన నర్మదతో తల్లి లాలనగా అంది.

"కాదమ్మా! నా కిప్పుడు పెండ్లి వద్దు. స్వతంత్రంగా వుంటాకొన్నాళ్లు. తీరిగ్గా అన్నీ విచారించకుండా, ఆలోచించకుండా ముందడుగు వేయరాదు. నా తమ్ముల చదువు, చెల్లి పెండ్లి కావాలి. మీయెడల బాధ్యత, తాతఅవ్వల బాధ్యత- అన్నీ తీరాకే నా పెళ్ళి అని ప్రతిజ్ఞ చేసుకొన్నా. అందాకా ఆ ఊసెత్త వద్దు" గట్టిగా కుండబ్రద్దలు కొట్టినట్లు చెప్పింది నర్మద.

"కట్నాలతో కొంపలుకూలే రోజుల్లో దమ్మిడీ కాశించనివాణ్ణి కాదంటావేమమ్మా! నీవు ఇలా ఎదిగి పెండ్లి లేక ఉద్యోగం చేస్తూ ఒంటరిగా తిరుగుతుంటే నేనసమర్థుణనే విషయం నన్ను వేధిస్తుందమ్మా! కొంత టైము తీసుకొని ఆలోచించి చెప్పు." తండ్రి ఆవేదనతో అన్నాడు. 2, 3 రోజుల్లో కనపడతానని కుమార్ వెళ్ళాడు.

"టెలిగ్రాం అందుకున్నాడు తండ్రి"

"నర్మదా! ఈరోజు కుమార్ తల్లిదండ్రులతో వస్తున్నాడట. కాస్త లిబరల్‌గా ఆలోచించమ్మా! ఈపేద తండ్రి కోరికతీర్చమ్మా.

నన్ను కూతురు రక్తం తాగే నీచుణ్ణిగా పదిమంది ఆడిపోసుకో నీకమ్మా" రుద్ధకంఠంతో ఆక్రోశించాడు తండ్రి. తల్లీ తాత అనేక విధాల బ్రతిమాలి భంగపడి తోడులేని జీవితం వప్పులేని వుప్పు లాంటిదని తమ అనుభవాలతో, రకరకాల ఉపమానాలతో చెప్పారు.

సావిట్లో అంతా కూర్చొని కబుర్లాడుతున్నారు. చెల్లి లోనికొచ్చి "అక్కా నిన్ను తెమ్మన్నారే! రావా! అంటూ గంతులేస్తూ సరదాగా వచ్చింది.

"పద వస్తున్నా"

"నా మాటలు వినండి జాగ్రత్తగా! నాది ఒకే ఒక నిర్ణయం జీతంలో మూడువంతులు నాతల్లి కి, మిగిలింది నాకు. ఈనిర్ణయంలో మార్పు లేదు. ఈ విషయంలో నన్ను నా అభిప్రాయాన్ని మార్చుకోమని ఎవరూవత్తిడి చేయరాదు." గట్టిగా ఘంటాపథంగా చెప్పింది అందరి సమక్షంలో నర్మద.

నివ్వెర పొయ్యారు అబ్బాయి తల్లితండ్రులు. స్తంభించి పొయ్యారు తన తల్లి తండ్రులు.

"నేనాశించేది మిమ్ముకాని, మీడబ్బుని కాదండీ!" కుమార్ గంభీరంగా అన్నాడు.

"పెండ్లి చాలా నిరాడంబరంగా జరగాలి. రిజిష్టరు పెండ్లి చేసుకుంటాకానీ మామూలు హంగామా పనికిరాదు" అన్నది నర్మద.

ఇదేమి చోద్యమోనని గుసగుస లాడారు పెండ్లివారు.

"ఎలాగైనాసరే అభ్యంతరం లేదు. నాకసలు సంప్రదాయాలన్నా, శాస్త్రాలన్నా చాలా అయిష్టమండీ. అందుకే మీరు నచ్చారు" సంతోషంగా సమాధానమిచ్చాడు కుమార్.

"ఏ పరిస్థితిలోనూ మనం ఒకరిమీద ఒకరం అధికారం చెలాయించరాదు. సమానహోదాతో, సమాన ప్రతిపత్తితో మనగల్గాలి. నాకలాంటి స్పష్టమైన భావాలున్నై" కృత నిశ్చయంతో అన్నది నర్మద.

పెండ్లి అయింది. కలిసి కాపురమున్నారు. అనుకున్న ప్రకారం కాలం గడుస్తోంది. ఈ ధోరణిలో 1 సం॥ గడిచింది. కుమార్ షోకిలాగా తిరగటం, త్రాగటం, సినిమాలతో జల్సారాయుడిగా వుండడం నర్మదకు కష్టమనిపిస్తోంది. అయినా పట్టించుకునేదికాదు. ఎవరిస్వేచ్ఛ వారికుండాలి. ఇద్దరన్నాక ఒకేమాట, ఒకేచోట అనుకోవడం అసమంజసం. ప్రతి విషయంలో తను గిల్లికజ్జాలు పెట్టుకునేదికాదు. తన వుద్యోగంలో డ్యూటీ ఎలాగో, కుటుంబంలోకూడా భార్యగా సహృదయంతోనే వుండేది. భర్తను గౌరవించేది. తాను గౌరవింప బడాలని ఆశించేది. తనుగా ఏ పొరపాటు చెయ్యలేదు. ఒప్పందం ప్రకారం ముప్పాతిక జీతం వెంటనే ఇంటికి పంపేది. క్రమంగా కుమార్ చిట్టి బుట్టి లాడటం మొదలయింది. ఏదో వంకబెట్టుకొని సాధిస్తూ ఉండేవాడు?

"సంవత్సరం తరువాత భరించరాని నసగా తయారయింది కుమార్ నడవడి నర్మదకు. పురుషుడన్న అహంకారం అతన్ని అడుగడుగునా వెన్నాడింది- తాను యజమానినని తనఆజ్ఞ జవదాటరాదనే అహంతో. "ఈ రోజు నుండి నువ్వింక మీవాళ్ళకు డబ్బు పంపటానికి వీల్లేదు. నాకు ఊరునిండా అప్పులైనాయి. మా అమ్మ తనకు ఆర్థిక సహాయం కావాలని కబురు పెట్టింది. సొమ్మొకడిది సోకొకడిది అన్నట్లు బరువు బాధ్యతలు నావి. అనుభవం అత్తవారిది. బాగుంది వరస!"

ఇప్పటికి 1 సంవత్సరంగా సాగుతోంది వ్యవహారం. "నా ఆజ్ఞయినా పాటించాలి లేదా ఎవరిదారి వారిది." ఆడది ఏంచేస్తూందిలే అణగి మణిగి వుండక అడుగు బైటపెడితే దాని గతి అధోగతేగా! అనుకున్నాడుకుమార్.

"రేపటిలోగా ఏసంగతి తేలిపోవాలి." నిప్పులు కక్కుతూ దబాయించాడు.

వెలవెల పోయింది నర్మద.

"మన బాసలు మరచిపోయారా?"

"కనుకనే సంవత్సరమల్లా భరించా. సంపాదించే దానివని కట్నకానుకలు కాలదన్నుకున్నా. నీవే మన కుటుంబ పరిస్థితి నర్థం చేసుకోగలవని ఆశించా. తనకు మాలిన ధర్మమా? నీకు మొగుడు కావాలో నామాట కావాలో తేల్చుకో". గర్జించాడు కుమార్.

తర్వాత కొన్ని నెలలుగా మా ఇద్దరి మధ్య వైరుధ్యం పెరగసాగింది. మా ఇద్దరి జీవితాల్లో వైషమ్యాలు తప్ప ఏనాడూ భార్యాభర్తల పవిత్ర అనుబంధం, అన్యోన్యం, ఆత్మార్పణలాంటి భావాలు జొరబడలా. తన బాధ్యత తానే తెల్సుకొంటాడని సహించి వూరుకున్నా. రెండు మూడుసార్లు సలహాలివ్వబొతే ఆడ దానివి నువ్వు సలహాలిచ్చేదానివా? అన్నట్లు తృణీకరించాడు.

ఇక ఈ వ్యక్తితో వాదించి ప్రయోజనం లేదు అని తేల్చుకున్నా. అతని చర్యలతో రోజు రోజుకూ నాబుర్ర వేడెక్కి పొయ్యేది. మనమార్గం మనమే చూచుకోవాలనే నిర్ణయంతో అతని వ్యక్తిత్వాన్నిగూర్చి, లోపాన్ని గూర్చి ఇక మార్చటం అసంభవం. క్షణకాలంకూడా కలిసి వుండలేం. ఆలోచనలతో బుర్ర పాడుచేసుకోవటం మంచిదికాదు. ఇక తాడోపేడో తేలాలి. అని నిర్ణయించుకుంది నర్మద.

తన జీవితాన్ని సంపాదనను భర్త ఆశించటం కాదు అచ్చటి సమస్య; అందులో ఇమిడి ఉన్న ముఖ్యాంశాలు: (1) వివాహానికి విముఖంగా ఉన్న నర్మదను నమ్మించి ఇపుడు మరోలా మాట్లాడడం. (2) ఆనాడు ఆమె సంపాదనపై ఆమెకే హక్కని బహిరంగంగా చెప్పి ఈనాడు కాదనడం.

(3) ఇన్నాళ్ళు కాపురం చేసింది. తన మాటనుకాదని ఆమె ఏమీచెయ్యలేదు; తన ఆజ్ఞను ఆమె ఔదల తాల్చక తప్పదు.

"స్త్రీ నిస్సహాయ స్థితిని వాడుకుందామనే కుటిలేచ్ఛ. ఆమె తను మాన ప్రాణాలకు తానేకదా అధిపతిని" అనే అహంభావ మన స్తత్వం ప్రదర్శించడం.

చివరకు తేలిందేమంటే ఏ స్త్రీ పురుష సమానత్వాన్ని కుమార్ ఆనాడు అంగీకరించాడో, దానిని ఈరోజు కాలరాశాడు. అంతేకాదు విశ్వాస హీనుడుగా ప్రవర్తించేవాడు.

ప్రశాంత మనస్సుతో నిశ్చలంగా ఆలోచించి భవిష్యత్తు గూర్చి తెల్సుకుంది నర్మద. దుర్నీతిపరుడితో వుండేకంటే స్వేచ్ఛా వాయువే కావాలని కోరుకుంది.

పొద్దున్నే లేచి అలెగ్జాండర్ను వద్దకువెళ్ళి విషయమంతా వివరించింది. నర్మద పక్షమే న్యాయమని సలహా చెప్పాడు. పది గంటలకల్లా లాయరునోటీసిప్పించింది విడాకులకోసం. దాంతో పాటు తన క్వార్టర్సు ఖాళీచెయ్యమని రిజిష్టరు ఉత్తరం పంపింది. రాజీకని కబురు పంపాడు భర్త. రాజీలేదని తన మనస్సురాయి చేసుకుంది. కాని లాంగలా. ఈ విషయం తెల్సుకొని ఆమె తల్లీ తండ్రివచ్చి ఏడ్చి బ్రతిమాలారు. కోప్పడ్డారు. పట్టువిడవలా. 2 సంవత్సరాల తర్వాత విడాకులు పొందింది నర్మద.

"అమ్మా! ఇపుడు అర్థమయింది నీ ఒంటరి తనం" అన్నది కాంచన.

"అక్కా మనకు వ్యక్తిత్వం లేదా? మగవాళ్ళకు, మనకు తేడా ఏమిటి? ఎవరి పరిధిలో వారుంటేనే గౌరవ మర్యాదలు.

గట్టుతెగితే నీరు పొంగుతుంది. తర్వాత ఎవరాపగలరు? మనలోంచి తిరుగుబాటు రావాలి. రానంతకాలం మనల్ని ఆటబొమ్మల్లా పనిముట్లలా వాడుకుంటారీ మగజాతి. వివేకం, విజ్ఞానం కల కొందరైనా మార్చుకోవాలి. దానికి మనమే మారాలి. మనం చెప్పుకిర్రింద తేలులావుంటే మనమీద స్వైరవిహారం చేస్తారు. అనాదిగా ఆడదాని అగచాట్లకు కారణం మనం లొంగుబాటు చూపటమే. విడాకులు పొందిన నాబోటిదాన్ని స్త్రీలే చేయెత్తి చూపుతారు. కాని ఆ వెనుక దాగియున్న బాధామయ జీవితాన్ని చూడరు. చూడలేరు. మనలో ఐక్యత లేమియే మనదుర్దశకు కారణం. ఇకనైనా మనం మేల్కొనాలి. భర్తచేత అమ్మబడ్డ చంద్రమతి; వ్యభిచరించటానికి భర్తను మోసుకెళ్ళిన సుమతులను భారతనారీ సంస్కృతులకు మణిపూసలుగా పేర్కొనే రోజులు మారాలి. పాత సంస్కృతి పటాపంచలై ఆధునికత ప్రవేశించాలి. ఆనాడే స్త్రీకి అభ్యుదయం; పురోగమనం" ఉద్రేకంగా మాట్లాడుతోంది నర్మద.

"నీహృదయంలో మండుతున్న దావాగ్ని నాకర్థమయింది నర్మదా; నీగుండెపై తగిలిన నమ్మొట పోటుకు నీవు హతాశురాలవైనావు. నీ నిశ్చలత్వానికి నేను నిన్ను అభినందిస్తున్నానమ్మా! కానీ నాబోంట్లకాధైర్య స్థయిర్యాలు లేనందుకు..........."

"అక్కా! పరిస్థితులే మనలో మార్పుతెస్తాయి." "చిన్నదానివి, వయస్సులో వున్నదానివి, వంటరిగా ఈ సమాజంలో ఎలా జీవిస్తావు నర్మదా? నీతి, కట్టుబాట్లూ ఆడదానికైనా ఉండొద్దా? "ఆతురాలిగా అనునయిస్తూ అడిగింది కాంచన.

"నీతి అంటే ఏమిటి? స్త్రీకొక నీతి, పురుషునికొక నీతి వుంటుందా? నీతి అంటే శుక్ర నీతా? వారి జాక్షులందు, వైవాహిక ములందు, ప్రాణ, విత్త, మానభంగమందు బొంకవచ్చుట. ఇది ఏ శతాబ్దపు నీతి అక్కా! ఎలా జీవిస్తానో విను.

"అసలు స్త్రీకి పెళ్ళేజీవిత పరమావధి అనుకోటం పెద్ద పొరపాటు. అంతకన్నా విలువైనది తను వ్యక్తిత్వంగల మనిషిగా జీవించడమే. ప్రాణం విలువకన్నా జీవిత విధానం మిన్న. భర్త అనురాగంకన్నా మించినది సేవవల్లవస్తుంది. సేవలో స్వార్థం వుండదు. అది శాశ్వతమైనది. జీవితం ఎలాగో ఒకలాగు జీవించడానికి కాదు. ఉన్నతాశయాల కోసం బ్రతకటం. అప్పుడే జీవితంమీద ఆశకల్గుతుంది. అదే జీవితధ్యేయం. వ్యక్తి మనుగడకి ఊపిరి. అందుకే నే చావకుండా, కర్కోటకుడి కపటనాటకానికి బలికాకుండా వున్నా".

"పతి దుర్మార్గుడైనా పడతికి ఇహ పర సాధనము పతియే తల్లీ" అనే ఆ శాస్త్రకారుల వేళ్లునరికి, నాలికకోసి, ఆ సాహిత్యాన్ని తగలబెట్టాలి."

"అక్కా! నా సలహా వింటావా లేదా? పురుషద్వేషం కాదు మనది. అతని స్వార్థాన్ని ద్వేషించాలి. జీవితంలో ఏ కష్టమొచ్చినా ఎదుర్కొనే ధైర్యముండాలి. మనల్ని నమ్మించి ద్రోహించేస్తే మనం తిరగబడాలి. మనల్ని ఎవరో రక్షిస్తారనుకోవటం భ్రమ అర్థంచేసుకున్నావా అక్కా."

"టైమయిందని" గబగబా డ్రెస్‌చేసుకుని పరుగెత్తింది నర్మద.

"ఈ సుగుణాలరాశి వెనుక ఎంత అగాధముంది? భర్త దుష్టప్రవృత్తే స్త్రీజాతికి సుడిగుండం. కుమార్, యుగంధర్‌లాంటి మగాళ్ళెంత నీచానికైనా వెనుదీయని కుచ్ఛితులు. స్త్రీని ఆట వస్తువుల్లా అనుభవించి, పీల్చి పిప్పిచేస్తున్నారు. దీనికి మూలం స్త్రీలలో జాగృతిలేదు. అది స్త్రీల అజ్ఞానం, అవివేకంవల్లే వారిలా స్వైర విహారం చేస్తున్నారు. ఇది తరతరాల బానిసత్వం. స్త్రీలలో వికాసం, ప్రగతి కలగాలంటే ఆత్మవిమర్శ ముఖ్యం. తద్వారా మార్పుకోరుతారు."

"జీవితానికి ఉత్కృష్టం కావాలన్నా, నీచంగా బ్రతకాలన్నా మనమే కారణం, అర్థమయిందా అక్కా".

"మనిద్దరి జీవితాలు తాడులేని బొంగరాల నర్మదా!"

తాడులేని బొంగరంకాదు, తెగిన గాలిపటాలు. వీటి అన్నిటికీ మన మనస్థత్వమే కారణం అక్కా. మనకెప్పుడూ ఏదో ఆధారం కావాలనే ధ్యేయమే మన పతనానికి కారణాలు.

# 15

నర్మద కథ చివరిభాగం విన్నప్పటినుండీ కాంచనకు కడుపులో దేవినట్లయింది. ఎందుకుచేరాం ఇచ్చట ఇద్దరు అభాగినులం అనివిస్తుపోయింది. ఆలోచనా సాగరంలో మున్కలు

వేయటం మరీ ఎక్కువైంది. ఈ దేశంలో స్త్రీ, పురుష క్రౌర్య చక్రపుటిరుసులమధ్య అణగారి పోవాల్సిందేనా! అని తహ తహ లాడింది.

మరునాడు సాయంత్రం నర్మద డ్యూటీనుండి తిరిగి వచ్చింది. కాంచన యోగక్షేమాలు కనుక్కున్నది. ఆమెకు ఆహార పానీయాలను సమకూర్చింది. ఆమె ముఖంచూచి భయపడ్డది. ఆ ముఖంలో ఆవేదన విలయతాండవం చేస్తున్నది. అలాంటి స్థితిలో ఎక్కువసేపువుంటే ఆమె మెదడులో రక్తనాళాలు బ్రద్దలయి పోతాయేమోననే భయం పట్టుకుంది నర్మదకు. ఆ తీవ్రతను వెంటనే తగ్గించాలని నిర్ణయించింది నర్మద. తన విషాదగాధను మరొకరితో చెప్తే కాంచనబాధ కొంతతగ్గుతుందని, ఆమె ఆరోగ్యానికి ప్రమాదం అప్పటికైనా తగ్గిపోతుందని నర్మద ఆశించింది.

"అక్కా! అమ్మణ్ణి వచ్చిపోయిన తరువాత జరిగిన నీకథ చెప్పవూ" అనునయించింది నర్మద.

ఉలిక్కిపడింది కాంచన, వెంటనే ఈలోకంలోనికి వచ్చింది.

"అమ్మా! నాకథ వింటే నీకు కన్నీళ్లు కూడా మిగలవు తల్లీ! అంతా ఘోరకలి; దుర్మార్గం; విషాదపూరితం. నీవు నాకథవినలేవు, అడగొద్దు".

"అక్కా నేనూ కష్టాలు పడ్డదాన్నే. పైగా ధైర్యస్థురాలిననే అహంభావం నాకు ఇంకా ఉన్నదమ్మా. నన్ను గురించి నాకు భయంలేదు. ఇక నీ సంగతంటావా బాధనుతోటివారితో చెప్పు కుంటే అది సగమవుతుందక్కా. చెప్పవూ" ప్రార్థించింది నర్మద.

కాంచన కథను ప్రారంభించింది శూన్యంలోనికి చూస్తూ.

"ఒకరోజు యుగంధర్ ఎంతో లాలనగా "కాంచీ కాంచీ! మైడియర్ డార్లింగ్" అని పిలిచాడు. మళ్ళీ ఈ ద్విపాద పశువుకు నాతో అవసరం కల్గినట్లుందనుకున్నాను.

"కాంచనా! నిన్నొక సహాయాన్ని అర్థిస్తున్నా. నాకోర్కె కాదనవనే నమ్మకం నాకుంది. సరేనని మాటఇస్తావుగదా"

ఎన్నడూలేని ప్రేమను ఒలకపోస్తూ దేబ్యం మొహంతో నిలబడ్డాడు యుగంధర్ నాఎదుట.

"అదేదో విషయం తెలియాలిగదండీ!" నన్నేదో సుడి గుండంలో తొయ్యబోతున్నాడనే అనుమానం కలిగి అడిగా.

"అది చాలా చిన్న విషయం. ఒక సంవత్సరంలో తీరి పోతుంది"

"సంవత్సర కాలంపట్టేది అంత చిన్నవిషయం ఎలా అవుతుందండీ! అసలు అదేమిటో అర్థంకాలా, మీ మనసులో విషయాన్ని గ్రహించేవిద్య నాకు రాదండీ" వేటగాడి వలలో చిక్కుకోబోతున్న కుందేలు పిల్లలా గజగజ వణికి పొయ్యానప్పుడు.

"రామాపురం ఎస్టేటు జమిందారుగారికి పిల్లలు లేరంట. నీ అందచందాలకు మెచ్చి వారివంశానికి వారసుణ్ణి నీవల్ల పొందాలని కబురుపెట్టారు. తగిన వరుమానం పుచ్చుకున్నా. కారు వాకిలికి దూరంగావుంది. వెంటనే నీవు వెళ్ళితీరాలి. పిల్ల

పుట్టగానే పంపేస్తారు. అంతదాకా నీ పిల్లల్ని జాగ్రత్తగా కాపాడి నీకప్పగిస్తా. ఖంగారు పడకు. ఇటు నాజేబు నిండింది....

"ఎంత ఘోరకృత్యానికి పాల్పడ్డాడు! కిరాతకుడు" నానోట మాటరాలా. కుప్పగా కూలిపొయ్యా ఈ మాటవినగానే.

"లే! లే! అర్ధరాత్రిలోగా వారింటికి చేరాలి నువ్వు. రెక్క పట్టుకు గుంజాడు. నన్ను కబళించబొయ్యే రాబందులా మీదిమీది కొస్తున్నాడు. "నన్ను కాస్త ఆలోచించుకోనియ్యరా?" అంతా మీ ఇష్టమేనా? నా శరీరంమీద నాకులేని సర్వహక్కులూ మీకెవరి చ్చారని నేనడుగు తున్నాను. ఇన్నాళ్ళు మీపాద దాసిగా, జీవచ్ఛవంలా జీవిస్తున్నా. ఇప్పుడు మరో సుడిగుండంలో పడ దోస్తున్నారా? పిల్లల్ని చూచుకొని వాళ్ళ భవిష్యత్తుకోసం జీవిస్తున్న నన్ను ఇలా........"

"ఇది నా ఆజ్ఞ! పోతావా? లేదా? నీకు నీపిల్లలు కావాలో? నీమానం కావాలో తేల్చుకో నేనెంతకైనా తెగిస్తా." ఆ విశాలమైన చాతి అడుగునవున్న గుప్పెడు గుండెలో ఇంత కర్కశత్వం వుందా? అని గిలగిల్లాడానప్పుడు. "ఆలోచించే వ్యవధిలేదు. నాకు కావల్సింది డబ్బు. అదిలేనివాడు డుబ్బుకు కొరగాడు. మర్యాదగా వింటావా? లేదా" గుడ్లురుముతూ ఉగ్రరూపం దాలుస్తున్నాడు యుగంధర్.

"కంచే చేనుమేస్తే కాదనేవారెవ్వరండీ! ఏనాడూ ఏమీ అర్థించలా. నన్ను బలిపశువుగా పంపకండి? అన్నాను. హృదయ

ఏదారకంగా ఏడుస్తూ కాళ్ళపైబడి బ్రతిమాలాను. చేతులెత్తి నా బిడ్డలకు నాకు ఎడబాటు తీసుకురావద్దని ప్రార్థించాను.

"నా మాట జవదాటావో! నీ కవలల్ని విదేశాల కమ్ముతా. ఆ నల్లదాన్ని బానిసగా అమ్ముతా. నిన్ను అమ్మణ్ణి నడిపే పడుపు గృహంలో పడేస్తా. నీవు నీపిల్లలూ సర్వనాశనమౌతారు. వింటున్నావా? అర్థమయిందా!"

నిశ్చేష్టురాలనయినాను. గజగజ వణికి పోయాను. నోట మాటరాలా. తిన్నా తినకున్నా, కొట్టినా తిట్టినా మూగజీవంలా పిల్లలకోసం బ్రతుకుతున్నాను ఇన్నాళ్ళు.

"కదలవేం! వాళ్ళు ముందుగానే నామాట నమ్మి 3 లక్షలు ఇచ్చారు. పుచ్చుకున్నా. ఇక వెనుక చూపులేదు పద పద".

"ఆ! ఎంత పని జరిగింది! నామీద పిడుగు పడ్డట్టయింది"

"డబ్బుతో మాన మర్యాదల్ని మనిషిప్రాణాల్ని కొనగలరు నీచులు. వాటిని మీబోటి కర్కశులు, సంఘవిద్రోహులు అమ్మి డబ్బు చేసుకోగలరు. మీకు సర్వస్వమూ డబ్బే. మానవత్వం, హృదయం, దయాదాక్షిణ్యం లేని కిరాతకులు మీరు."

"ఏమే ధర్మపన్నాలు నాకు నేర్పుతావా?"

పవిత్రత అంటే వినలేదా? పరపురుషుడితో సంగమించమని భర్త ఆజ్ఞాపిస్తే తిరస్కరించడం భారతనారీ ఆదర్శంకాదని మీ తాత స్త్రీ ధర్మాన్ని నేర్పలేదా?"

"మీబోటి కుసంస్కారుల భాష్యమది. కలకంఠి కంటకన్నీ రాలికితే ఆ ఇంట లక్ష్మీనిలవదని ఆర్యులన్నారు కదా. ముష్టెత్తు కునైనా బ్రతుకుదాం. ఎందుకిలాంటి నీచపు, పనికిమాలిన జీవితం గడపటం. ఇంతకన్నా గుక్కెడు విషం మీచేతిమీదుగా ఇవ్వరాదా?" దుఃఖంతోపాటు వణకు కూడా పుట్టుకొచ్చింది నాకు. బైట కారు హారన్ మోగుతోంది.

"నా సహనాన్ని పరీక్షిస్తున్నావా? జుట్టుపట్టుకులాగి కార్లో పడేస్తా. ఇదిగో ఒకమాట. అక్కడ నీవు వాళ్ళనేవిధంగా విసిగించరాదు. వ్యతిరేకించరాదు. ఆత్మహత్య చేసుకున్నా, తిరిగొచ్చినా ఇక్కడ నీపిల్లల భస్మం కూడా చూడలేవు. ఇది తిరుగులేని మాట. జాగ్రత్త! లే! లే! పద! పద! ఆలస్యం చెయ్యకు పరువుపోతుంది." కూలబడ్డదాన్ని రెక్కబట్టుకులాగాడు.

"హా! నా దౌర్భాగ్యమా! ప్రపంచంలో ఎచ్చటైనా ఇంతటి పాపకృత్యం జరుగుతుందా! నన్నెందుకిలా సర్వనాశనం చేస్తున్నట్లు. అసలు నేవింటున్నది నిజమా!" గుండెలు వేగంగా కొట్టుకుంటున్నాయి. ఆలోచనల్తో కొట్టుకుపోతున్న నాకేమీ పాలు పోలా. "పెనంమీంచి పొయ్యిలో పడ్డట్టయింది నాపని". అటు వెళ్ళినా ఇటు వెళ్ళినా మానభంగమే నాగతి. అటైతే వృత్తిలో దిగాలి. ఇటైతే ఒక ధనవంతుడి కుటుంబానికి వారసుణ్ణి నేకని ఇచ్చిరావాలి. చివరికి నన్నొక వ్యభిచారిని, లేక బిడ్డల్నికనే యంత్రాన్ని చేశాడు ఈ మూర్ఖుడు. ఏం చెయ్యాలి? ఎటు పోవాలి? ఏదీదారి? ముందుకు పోతే నుయ్యి, వెనక్కుపోతే గొయ్యి. నాకు శరణ్యమేమిటి? నా జీవిత పరమావధి ఏది? పిల్లల కోసం సర్వసంగ పరిత్యాగమా? నాకోసం ప్రాణత్యాగమా?"

"ముందుకా వెనక్కా స్థంబించి పొయ్యా."

"ఊ! నడు కదలవేం?" నాచీర కొంగుపట్టి లాగాడు. బైట కారు హారన్ మోగ్రింది పెద్దగా.

"తప్పదా? నాప్రాణ సమానమైన మానం బలికావల్సిందేనా?

"ఆ! అంతే! అటై తేకారెక్కు, ఇటై తే లంజల కొంపకుపో. క్షణంలో కదలాలి. అటో, ఇటో."

"ఎలాగూ శీలం దక్కదు. చస్తే పిల్లలు దిక్కుమాలిన వారౌతారు. వ్యభిచారి జీవితం కంటే వారసుణ్ణి కనిస్తే ఒక సంవత్సరములో పిల్లల్తో కలిసివుండొచ్చు. వారైనా సుఖపడతారు నా బిడ్డలకోసం ఈ త్యాగం చేస్తా. ఇక నేను! నేనెలాగు జీవచ్ఛవంలా బ్రతుకుతున్నా. నాకలలేనాడో కల్లలయినై."

కారు హారన్ పెద్దగా అదే పనిగా మోగ్రుతోంది.

"లంజా! కదలవేం?" ఒక బరువైన హస్తం ఫోర్సుగా నా మెడపై బడ్డది.

అమాయకంగా, మాయామర్మాలెరుగక నిద్రిస్తున్న నా బిడ్డల్నొకసారి చూచా. నా కన్నీటి బిందువులు వారి తలలపై పడినై. నాపాదాలు తొట్రుపడుతున్నై. మనస్సు బరువెక్కింది. గాఢనిద్రలోవున్న పిల్లల్ని నిమురుతూ, "నా పేగులో పేగు, నెత్తురులో నెత్తురు వారు మయామర్మాలెరుగని అమాయక

జీవులు. నా కడుపున పుట్టి ఏ ముద్దు ముచ్చటకు నోచుకోని చిన్నారులు." అని వాపోయినాను.

వారిని పదేపదే వెనక్కి తిరిగి చూస్తూ ముందడుగు వేసాను. కాళ్ళు తడబడినై. కళ్ళుబైర్లు కమ్మినై. భూమి క్రిందికి కృంగుతున్నట్లయి గుమ్మానికి తలానించి నిలబడ్డాను.

దారితెన్నూ తెలియని నన్ను ముందుకునెట్టి దారి చూపించాడు యుగంధర్. బండి ఎక్కించి కూర్చుంది చెంద్రి. ముందుసీట్లో కూర్చున్నాడు ధర్మయ్య. వధ్యస్థానానికి లాక్కెడుతున్న బలిపశువులాచేసి నన్ను లాక్కెళ్ళారు వాళ్లు. కారు బుయ్‌మంటూ కదలిపోయిందా నిశీధిలో.

తూరుపు తెలవారుతోంది. లోకంలో ఎన్ని ఘోరాలు జరిగినా, ఎన్ని హత్యలు, మానభంగాలు జరుగుతున్నా మార్తాండుడుదయించక మానడుకదా!.

కారు పోర్టికోలో ఆగిన శబ్దమయింది. వెంటనే కాల్‌బెల్ మోగింది. నౌకరొచ్చి తలుపు తీశాడు. ధర్మయ్య కర్టెను తొలగించి "తెచ్చానమ్మా" తలవంచి నమస్కరించాడు. చెంద్రి లోనికొచ్చి నిలబడ్డది. ఇద్దరి ముఖాలు కళావిహీనంగా వున్నై. శ్వాససైతం బిగపట్టి శిలలా గడపలో నిలబడ్డ నామనస్సు పరి పరి విధాలపోయింది. "మాటకై చంద్రమతి నమ్మాడు హరిశ్చంద్రుడు. పరువుకై సీతనడివిపాలుచేశాడు రాముడు. నలుడునిర్దాక్షిణ్యంగా నట్టడవిలో దమయంతిని విడిచాడు. కాని ఇలా పైశాచికత్వానికి

బలిచేసే భర్తలుంటారా? భూమి బ్రద్దలైనా దిగబడి పోదునే! ఈ గడప దాటక తప్పదా!" చెమటలు క్రమ్ముతున్నాయి. గుండె టకటక శబ్దమౌతొంది. కుప్పలా కూలిపోతున్నానప్పుడు. నా బిడ్డలు. నా ఆశాకిరణాలు 'అమ్మా'! అంటూ దీనంగాచూస్తూ కళ్ళల్లో మెదిలారు నాకప్పుడు.

"ఆమెను లోనికి రమ్మన్నానని చెప్పు చంద్రీ!" ఒక ఆడగొంతుక అధికార పూర్వకంగా ఆజ్ఞాపించింది.

"రామ్మా" కళావిహీనమైన నాముఖంపై పుచూస్తూ నాచెయ్యి పుచ్చుకొని గడపదాటించింది చెంద్రి.

ఆ భవనం కావ్యాల్లో కవులువర్ణించే ఇంద్రభవనంలావుంది. గోడలన్నీ చలువరాళ్ళతో కట్టబడివున్నై. ఆ రాళ్ళల్లో రంగు రంగుల చిత్రాలు చెక్కబడి చాలా ఆకర్షణీయంగా వున్నై. కిటికీలకు గుమ్మాలకు రంగురంగుల తెరలు వ్రేలాడుతున్నై. విదేశాల నుండి తెప్పించిన గాజునగిషీ దీపాలగుత్తులు ఎంతో గొప్ప పనితనాన్ని చాటుతున్నై. కుర్చీలు, బల్లలు, స్టీలుటేబుల్సు తళతళ మెరిసిపోతున్నై. లక్షలు ఖరీదుచేసే తివాచీ అందంగా పరచివుంది. గాజు కళ్ళతో రెండు పెద్దపులులు మీదికి దూకే పోజుల్లోవున్నై. అవి సజీవాలా అన్నట్లు నన్ను భయపెట్టినై. హాలంతా పెద్ద హిందీ సినిమా సెట్టింగులా అమర్చబడిఉంది.

"నీ పేరేమిటమ్మా?" మేలి ముసుగులో తలొంచుకు నిలబడ్డ నన్ను అడిగింది రాణీ మయూరి.

"కాంచన" సమాధానం చెప్పాను.

"అబ్బా! దివినుండి భువికి దిగివచ్చిన అప్సరసలావుంది. ఏతల్లి కన్నదో? కాంచనట నిజంగా బంగారుకాంచన విగ్రహమే!" అప్రియత్నంగా ఆమె నోటివెంట వెలువడ్డాయి.

నానుండి దృష్టిని మరల్చుకోలేక పోయింది మయూరి. నన్ను తదేక దృష్టితో చూచింది. నాకళ్ళవైపు అదే పనిగా చూచింది. నేనూ ఆమెను పరిశీలించా. ఆమె అనేకానేక భావాలతో సతమతమవుతున్నట్లు తోచింది నాకు. "సాటి స్త్రీకి అన్యాయం చేస్తున్నాననే దుష్టభావం, డబ్బిచ్చి కొనుక్కున్నాను ఈ స్త్రీని", అనే అహం, "తనకంటే ఈమె అందగత్తియే" అనే ఈసు అన్నీ ఆమె మనస్సులో ముప్పిరికొన్నయ్యా అనిపించింది నాకు. చివరకు ఆమె ధనమదాంధత ఆమె కన్నులను కప్పినట్లుంది.

"చెంద్రీ! ఆమెను ఆ రూములోవుంచు. భోజనం, స్నానం అన్నీ జాగ్రత్తగా చూచుకో. సాయంత్రం డాక్టరమ్మకు చూపించిరా" ఆజ్ఞా పూర్వకంగా ఆదేశించింది మయూరి. నాకప్పటికి నెల తప్పిందో లేదో తెలియాలని ఆమె భావమై వుండొచ్చు.

"ఆ రాత్రి నాగదిలోనికి బహదూర్ అడుగులు తడబడుతూ వచ్చాడు. ముందుకు అడుగు వేశాడు. వణికిపోయాడు. తను చేయబూనిన దుర్మార్గం అతణ్ణి అప్రతిభుని చేసింది. కంపించి పోయాడు. నాలో అతనికి ఏమి కన్పించిందో ఏమో వెనుకంజ వేశాడు

నా అందం, మానం, మంచితనం అనుభవించబోతున్న బహదూర్‌కు పవిత్రమైన గంగా కలశంలో మురుగును కలుపుతున్నట్లు శరీరం గగుర్పొడిచి అతని ఆపాదమస్తకం కంపించింది. గుండె దడదడలాడింది. ఎంతో మందిని అనుభవించాడట, వందలు, వేలు సీసాలు ఖాళీచేశాడట, ద్రోహం తనపెట్టినవార్ని కాలరాచాడట. వ్యతిరేకుల్ని చంపించేవాడని, దయాదాక్షిణ్యాలు ఎరుగనివాడని, చంద్రి, ధర్మయ్యా చెప్పుకోగావిన్నాను. అతనికా రోజు ఏదో మహాఘోరం చేస్తున్నట్లు అతని అంతరాత్మ ఘోషిస్తుందని గ్రహించా. అతనిలో ఏదో చెప్పలేని భయ భ్రాంతులుకల్గుతున్నై. మేరువు తల్లక్రిందయిందా? సముద్రాలింకిపోతున్నవా? భూమి నీరై పోదుకదా! ప్రజ్వరిల్లుతున్న అగ్ని హోత్రంలా కనిపించానేమో! వెనుకంజ వేశాడు.

రెండో రోజు రాత్రి రాజా మళ్ళీ నాపడకగదిలోనికి వచ్చాడు. నాకు దగ్గరగా వచ్చాడు. నేనుముఖం ఎత్తి తీక్షణంగా చూచా అతని కళ్ళల్లోకి. నా చూపులు అతని పంస్కార పు లోతులపై దెబ్బకొట్టి, దెబ్బతిన్న లేడిలా వెనుదిరిగి పరుగెత్తాడు. నన్ను స్పృశించ లేక పొయ్యాడు. గండం గడిచిందిప్పటికని ధైర్యం తెచ్చుకున్నా.

మూడవ రోజు రాత్రి ప్రక్కమీద పడుకొని నా దుస్థితి, నా పిల్లలగూర్చి ఆలోచిస్తూ సూన్యంలోకి చూస్తూ ఉన్నాను. ఇంతలో గుప్పున సారాయి కంపు. కలియుజూస్తిని కదా వాకిట్లో అడుగు పెడుతున్న రాజా! ఈసారి అతనినడకలో తడబడటం లేదు. కళ్ళలో భయం లేదు. జంకు గొంకు లేవు.

అయిపోయింది. సర్వనాశనమయిపోయింది అని వణికిపోయాను. స్పృహ కోల్పోయాను. అంతే తర్వాత మెలకువ వచ్చేటప్పటికి అస్తవ్యస్తంగా ఉన్న నాదుస్తులూ, అనాచ్ఛాదితంగా ఉన్న నా శరీరము సాక్ష్యమిచ్చాయి నాకు జరిగిన ఘోరాపచారానికి.

నాకు సెల తప్పింది. అంతే నన్ను మేనాలో ఎక్కించి మరోభవనంలోనికి తరలింపించింది మయూరి. ధర్మయ్య, చెంద్రి వాళ్ళిద్దరూ నాకు కాపలా. వారేనాకు సహాయకారులు, ఇతరతా.

# 16

ధర్మయ్య ఆ జమీందారుకు నమ్మినబంటు మూడు తరాలుగా ధర్మయ్య కుటుంబం రాజావారి సేవచేస్తున్నది. చంద్రి, రాణీ గారి పర్సనల్ దాసి. ఆమెవెంట పుట్టింటి నుంచి వచ్చింది. రాణికి తలలో నాలుక. తాము ఎంతో మహాఘోరానికి సాయం చేసామనే భావం వారిరువురిని బాధిస్తున్నట్లుంది. నన్ను ఎంతోఆప్యాయంగా, గౌరవంగా చూచుకునేవారు.

ఒక రోజు ధర్మయ్య తాత తనని క్షమించమని నన్ను కోరాడు. తను చేసిన పనికి నిష్కృతి లేదని పశ్చాత్తాప పడ్డాడు.

'ఎందుకీ ఘోరం ఇలా జరగాల్సి వచ్చిందని?' తాతను అడిగాను. అతడు ఇలా చెప్పాడు.

షికారి, జమీందారు రాజ బహదూర్ పాపారాయుడి ఎస్టేటు మేనేజరు. షికారి తండ్రి, తాత కూడా, పాపారాయుడి తండ్రి,

తాతల దగ్గర దివాన్‌గా పనిచేశారు. మూడు తరాలుగా రాయుడి ఎస్టేటులో వుండటంవల్ల ఆ కుటుంబంపై షికారీకి అపారమైన అభిమానం. ఆ దంపతుల శ్రేయస్సుకోరే వారిలో అతను ముఖ్యుడు.

సర్దార్ వీరభోగరాయుడిభార్య మయూరి. సన్నగా పొడుగ్గా తీర్చిదిద్దిన శిల్పంలా వుంటుంది. నడకలో ఠీవి, మాటల్లో హుందాతనంవున్నై. హోదాకుతగ్గ దర్జా, దర్పం ఆమెలోచోటుచేసుకున్నై. తండ్రి నరసాపురంఎస్టేటు జమీందారు, సర్దార్ నరశింహారాయుడు. మయూరి అతనికి ఒక్కగా నొక్కకూతురు. మహారాణిలా పెంచుకున్నాడు. పెద్ద పెద్ద ఎస్టేటువారంతా నరశింహారాయుడికి 'పిల్లనిమ్మని' రాయబారాలంపేవారు. లక్షల సంపద కధికారిణి; అందం, చదువు, సంపద అన్నీవున్నై. ఎవరాశించరు? ఎందరో ఆశించి ఆశాభంగం పొందారు.

వీరభోగరాయుడు, మయూరి ఒకే కాలేజీలో చదివారు. వారి స్నేహం పెరిగి పెరిగి చివరికి ప్రణయంగా మారింది. ఇరుపక్షాల పెద్దలు వివాహాని కంగీకరించారు. ప్రేమించి పెండ్లాడిన వారిద్దరు రెండు ఎస్టేట్లకు వారసులు, వారకి ఏ కొరత లేదు. వంటవాళ్లు, పనివాళ్ళు, దాసదాసీజనం. బంధువులు. హితులు స్నేహితులకు కొదవలేదు; పండ్లతోటలు, ద్రాక్షతోటలు, వంటపొలాలు పుష్కలంగా పండుతై. ఆఖరికి లక్షలు విలువగల మంచి గంధపుచెట్ల తోటకూడా వుంది. వజ్రాలు, వైఢూర్యాలు: మరకత మాణిక్యాలకు కొదవలేదు. ఇన్నీవున్నై. కానీ సభ్యత, సంస్కారంవారికున్నయ్యా? అంటే అది వేరే సంగతి; అది

ఎవరూకొనలేనిది; ఎచ్చట అమ్మబడనిది. రాయుడుకి ఏకపత్నీత్వం పై పెద్దగా విశ్వాసం లేదు.

భార్యాభర్తలకు అన్యోన్య అనురాగముంది. ముఖ్యంగా మయూరిని తన ప్రాణప్రదంగా చూచేవాడు రాయుడు. ఆమె నొక మహాఆరాధ్యదైవంగా, తన సర్వస్వంగా చూచుకునేవాడు.

ఇన్ని వున్నా మయూరి మనస్సులో అశాంతిచోటు చేసు కుంది. ఎప్పుడు ఏదో తీరని వెలితి లోలో బాధపెడుతూ వుండేది. కారణం:........

పెండ్లయిన రెండేళ్ళకే మయూరి మేడ ఎక్కుతూ పడింది. రక్తస్రావం పది రోజులైనా తగ్గలా. డాక్టరకు చూపితే "సివియర్ బ్లీడింగు- యూటరస్‌కు పెద్దహేమరేజి అయింది. ఆపరేషన్‌చేసి గర్భసంచిని తీసెయ్యాలి. లేనిచో కాంప్లికేషన్స్ వచ్చి ప్రాణా పాయం కావచ్చు" డాక్టరు వార్ని హడలుగొట్టింది. గతిలేక పట్నంపోయి ఆపరేషన్ చేయించుకుంది. కాని ఎవ్వరికీ ఈ విషయం చెప్పలా. ఆస్థి పోతుందని రహస్యంగా దాచారు. రెండుసార్లు గర్భస్రావం జరిగినట్లు. హాస్పటల్లో వుంచినట్లుగా ప్రచారంచేయించు కున్నారు. రామేశ్వరంలో నాగప్రతిష్ట, వారణాశిలో వంశాభివృద్ధి యాగం, సమారాధనలు, సంతర్పణలు చేస్తూ తమకుఅనతికాలంలో పిల్లలు పుడుతారని జ్యోతిష్కులు చెప్పి నట్లు అందరితో చెప్పుతుండేవారు. కాని లోలోపల పిల్లల మీద వ్యామోహం, వారికొరకై ఆరాటం పెరుగుతూనేవున్నై వారికి. ఇలా పది సంవత్సరాలు గడిచినై.

షికారీ శిస్తుపనులు పూర్తిచేసి వచ్చి దివాణంలో జమ కట్టాడు. సాయంత్రం చల్లని వేళ తోటలోవచార్లు చేస్తున్న జమీందార్‌కు "నమస్కార్ బాబూజీ!"

"కూర్చోండి! దివాన్‌జీ!

"టూర్ బాగా జరిగిందా! పైకం బాగా వసూలయిందా?"

"అంతా దివ్యంగా జరిగింది". 38 గ్రామాల్లో మొత్తం 48 లక్షల రూపాయలు వసూలయింది సార్!

పిచ్చాపాటి చెప్తున్నట్లు చెప్పి "ఇంకా 16 గ్రామాలు వెళ్ళాలి. కానీ ముఖ్య విషయం"........

"మీరు ఎందుకుతిరిగొచ్చారు? ఏదో ముఖ్యసంఘటన జరిగినట్లుంది." చెప్పబోతూ సందేహిస్తున్నారు.

"అది చాలా చాలా"........

" పర్వాలేదు చెప్పండి మీ, నామధ్య ఇంతవరకు భేదభావం ఏనాడూ రాలేదు. మా శ్రేయోభిలాషులు, మీరు."

"అది మీ స్వవిషయం సార్! మీకొక సలహా చెప్పాలని" మాట చెప్పలేక పొడి దగ్గు దగ్గాడు షికారి.

"మీరే సలహా చెప్పినా నేనన్యథా తలచను. అది నా స్వవిషయం కాని, మరోటికాని, అదినచ్చితే పాటిస్తా. కాకపోతే....

"మన జమీన్‌లో, ఒక తాలూకాలో, ఒక ఆవరణలో 6 సం॥ల ఇద్దరు కవలల్ని చూచా. వారిపేర్లు లత, లావణ్య. ఆ రెండూ రెండు మణిదీపాలు. రాజభవనాల్లో, మహల్స్‌లో ఉండాల్సిన పిల్లలు. మణి మాణిక్యాలు సైతం వారిముందు బలాదూర్. నా 50 సం॥రాల జీవిత కాలంలో అంతటి తేజస్సుకల పిల్లల్ని చూడలేదంటే నమ్మండి వారిని పల్కరించాను కూడా.

* * *

"మీపేరేమిటమ్మా!" షికారి పిల్లల్ని తదేకంగా చూస్తూ అడిగాడు ఆరోజు టాంగా చెడినప్పుడు కాంచన ఇంటిముందాగాడు. ఆ సమయంలో ఆ పిల్లల్ని చూడటం తటస్థించింది.

"నా పేరు లత, మాచెల్లి పేరు లావణ్య" అన్నప్పుడు సన్నని, తెల్లని ముత్యాల్లాంటి పలువరస చూడటానికెంతో ఆహ్లాదంగా వుంది.

"మీ ఇద్దరు అక్క చెల్లెండ్రా?"

"కవల పిల్లలం"

"మీ అమ్మా నాన్న ఇంట్లో వున్నారా?"

"మానాన్న ఎప్పుడూ బైటే వుంటాడండీ"

"చదువు కుంటున్నారా?"

"అవునని తలూపారు."

"ఏ స్కూల్లోనమ్మా?"

మాకు అవన్నీ తెలియవని చెప్పారు.

"చాక్లెట్లు, బొమ్మలు కొనిస్తా వస్తారా!"

అమ్మో! "మా అమ్మ ఏమీ పుచ్చుకోనీదండీ. ఎక్కడికీ వెళ్ళనీదండి." వాళ్ళు ముద్దులొలుకుతూ చెప్తుంటే ఆనాడు నా మెదడులో అనేక భావాలు పొర్లిసై. తృటిలో నామేదస్సులో బ్రహ్మాండమైన ఆలోచన తట్టింది. అ ఆపురూప సౌందర్యరాసులను మీకభ్యంతరం లేకపోతే ........

క్షణమాలోచించాడు రాయుడు.

"అర్ధమయింది దివాన్‌జీ! మేమీ విషయం జమీందారిజీతో సంప్రదిస్తా." ఆలోచించి నిర్ణయిద్దాం. "శలవా సాబ్‌జీ!" అంటూ తిరుగుముఖం పట్టాడు షికారి.

* * *

చంద్రి నావద్ద దిగాలుపడి కూచుంది ఒక రోజు. ఎందుకలా ఉన్నావని అడిగాను. వెంటనే నా రెండు కాళ్ళు పెనవేసుకొని "నేను మీకు ద్రోహంచేశానమ్మా. దేవుడునన్ను క్షమించడమ్మా. పార్వతిలాంటి మీమీద పాపం జరిగిపోయిందమ్మా. నేను నరకానికి పోతానమ్మా" అంటూ వణికి పోయింది.

"చంద్రి! ఇందులో నీ పాపచింతన ఏమున్నది? కట్టుకున్న భర్తే అన్యాయం చేశాడు. కంచే చేనుమేసింది. ఇది నా దురదృష్టం" అన్నాను. చంద్రి తేరుకుంది.

"చంద్రీ! ఇదంతా ఎందుకు ఇలా జరగాల్సి వచ్చింది". చెప్పమన్నాను. చంద్రి తనకు తెలిసిన కథ అంటే తను కన్నదీ, విన్నదీ ఇలా చెప్పింది.

రాణీ మయూరిగారి అంతః పురంలో ఒక ఉద్యాన వన మున్నది.

ఆ తోటలో నొక పున్నాగ చెట్టుంది. ఆ చెట్టుకొమ్మ మీదొక చిన్న గూడు కట్టిందొక సిసింద్రి పిట్ట. ఆపిట్ట కొక ప్రియుడు. ఆ జంట క్రొత్తగా జోడు కట్టినై, గూడు పెద్దదిగా మార్పు చేసినై. గూట్లో వున్నా, బైటికెళ్ళినా జంట విడిచేవికావు. దొరికిన ఆహారం చెరిసగం తినేవి. ఏ పండుకాని, గింజలుకాని ఒక్కటే తినటం వాటి నైజంకాదు. పక్షిజాతిలోనే వుందా ఔదార్యం. పక్షుల ప్రేమ మానవులకుండదు. జంటలో ఒకటి చస్తే రెండోది దాని చుట్టూ తిరిగి రోదించి రోదించి, ఆహార పానీయాలు మాని ప్రాణం అచ్చటే విడుస్తుంది. కానీ మరోపక్షితో జతకట్టదు. అలాగే పశువు బిడ్డను ప్రాణప్రదంగా పెంచుకుంటుంది. దాని పిల్ల ఎడ బాటైనా, చచ్చినా కృంగి కృశించి చస్తుంది. పశువుకు పిల్లా, పక్షికి జంటా ప్రాణప్రదం. మరి మానవుడికో?.... ధనమూలం మిదం జగత్.

* * *

రాణీగారు తన తోటలో నొక చలువరాతి తిన్నెపై కూర్చుని రోజూ ఆ సిసింద్రి పిట్టల జంట అన్యోన్యానురాగానికి ముగ్ధురాల య్యేది. ఆ పిట్ట నాలుగు గుడ్లను పెట్టిందా గూటిలో. తదాది

దాని మనస్సంతా ఆ గూటిలోని గుడ్ల మీదే లగ్నమై పోయింది. వాటిని పొదిగింది. నాలుగూ కిచకిచమంటూ తల్లి ఆహారం తేవటం చూచి అరిచేవి. ఆ జంట గింజ గట్రా తమ ముక్కుతో తేవటం, పిల్లల నోట్లోవేయటం, శత్రువులనుండి పిల్లల్ని రక్షించుకోవటం ఇదే పనిలో నిమగ్నమై వుండేవి. అలా తమ ఆహార నిద్రలుమాని వాటిదే లోకంగా బ్రతికేవి. ఆ పిల్ల పక్షులు రెక్కలు రాగానే 'బుయ్ బుయ్ మంటూ' ఎగిరి పొయ్యేవి. మళ్ళీ గుడ్లను పొదిగిపిల్లల్ని చేయటం. తదేకదృష్టితోచూస్తూవుండే సమయంలో, ఒకనాడామెకు దుఃఖం పొంగి పొరలి కట్టలు తెగింది.

"ఎవరో చెప్పుకో" వెనుకనుండి కళ్ళుమూశారు రాజాగారు. కంటి నీరు తగిలింది. అతని సంతోషమల్లా క్షణంలో మారిపోయి ఖిన్నుడైనాడు. ఆమె కభిముఖుడై ఆమె ముఖాన్ని పరిశీలించి చూచాడు. చెంపలు కన్నీటి చారలతోవున్నై. ముఖం తెల్లగా పాలిపోయివుంది. చెప్పలేని వ్యధతో కన్నీరు మున్నీరుగా ఏడుస్తోందని గ్రహించాడు.

"దుఃఖిస్తున్నావా? నా రాణీ"

..................................

"నావల్ల నీకేమైనా కష్టంకల్గిందా?"

"మౌనమే సమాధానమైనది."

"నీబాధ నాతోకాక మరెవ్వరితోవిన్నవిస్తావు రాణీ!" చెప్పవా?

"నోరుండి మూగదాని నయ్యానండీ!"

చెప్పు మయూరి! "ప్రపంచంలో నీవేదికోరినా తెచ్చి నీకాళ్ళ ముందుంచుతా" బ్రతిమాలుతూ బుగ్గపట్టి బుజ్జగించాడు.

"అది తీరని కోరిక"

"కోరికలెప్పుడూ తీరనివి కావు. మనస్సుంటే మా ర్గ ముంటుంది." తీర్చగలననే ధీమాతో గర్వంగా అన్నా డు రాయుడు.

"ఎవరివల్లా, దేనివల్ల తీరనివి కొన్నివుంటై"

"నేను బ్రతికుండగా నీకేలోపం రాదు రాణీ! బాధపడకు చెప్పు" తల నిమురుతూ మళ్ళీ అడిగాడు.

"బోసి నోటితో, తప్పటడుగులు వేసే పిల్ల లీ ఇంట్లో తిరిగే యోగ్యత లేదుకదాని నా బాధ. అమ్మా! అని పిలిపించుకోవాలనే ఆరాటంతోనే కుమిలిపోతున్నానండీ."

"ఓస్! పిచ్చిదానా! దానికింత విచారించాలా! కంటేనే పిల్లలా! పెంచుకుంటే పోలా!" ఒక జోక్ విసిరాడు.

"పురుషులకు మీకు తెలియని విషయ మొకటుంది. సహ జంగా స్త్రీ కోరేది మాతృత్వం. దానికోసం తపిస్తుంది. కుళ్ళి కృసిస్తుంది. తన జీవితంలో తల్లిగాని స్త్రీ అది పెద్దలోటుగా పరితపిస్తుంది. మాతృత్వవాంఛ ప్రకృతి సిద్ధమైనది. అనిర్వచ నీయ ఆనందానుభూతిని ప్రసాదిస్తుంది. దానికి హెచ్చుతగ్గులూ, బీద, సాదా తేడాలుండవు."

"అతి చక్కని ఒక ఆడపిల్ల, ఒక మగబిడ్డను చేరదీద్దాం వాళ్ళు నిన్ను అమ్మా అంటారు "సరేనా?"

"ఎవరిని? అనాధనలనా!"

"అనాధలో, సనాధలో వారిముఖాలమీద వ్రాసివుంటుందా? వారు పిల్లలు కారా? మనం వారిని చేరతియ్యటంలో వుంటుంది. ఆ సంగతి నాకొదిలెయ్యి. నేను చూచుకుంటా."

అయిష్టంగానే మొగంపెట్టారు రాణిగారు.

కంటేనే పిల్లలా? పెంచితే పిల్లలుకారా? పెంచిన ప్రేమ కన్న ప్రేమకన్నా దొడ్డది సుమా?"

మొగం చిట్లించి కనుబొమ్మలు ముడిచింది మయూరి.

"మాట్లాడవేం మయూరి?" నీకిష్టమైతే నాకభ్యంతరంలేదు.

"అంతటి ఉదారహృదయం నాకులేదు. రెండు ఎస్టేట్లకు వారసుడయ్యేవాడు, వీధివపొయ్యే ఏ వీరన్నకో, దారినపొయ్యే ఏ దానయ్యకో ఈ జమీందారీనిచ్చి సహించలేను. అసలు మన రక్తం కలవనివారు మన బిడ్డలౌతారా? అందుకే రక్తసంబంధం వుండాలంటారు."

వీరభోగరాయుడు ఆమెతో షికారిచూచిన పిల్లల గురించి వివరించాడు.

పరాయివాళ్ళను నా బిడ్డలుగా ఆలించి పాలించలేను; పైగా వాళ్ళు మీనెత్తినెక్కి ఆడుతుంటే నే సహించలేను. తన అసహ్యాన్ని వ్యక్తం చేశారు రాణీగారు.

"మరి మన రక్తంతో పుట్టటమెలా సాధ్యమౌతుంది" నన్ను కాస్త ఆలోచించుకోనివ్వండి. నేనే నిర్ణయానికి రాలేక పోతున్నా. ఇది చాలా చిక్కు సమస్య. దీనికి తొందరపాటు పనికిరాదు."

"ఏది ఏమైనా ఈ విషయంలో నీనిర్ణయమే తుది తీర్పు."

"నా మాట తప్పక వింటారా".

"నీ వాక్కు వేదవాక్కుగా, నీ ఆజ్ఞనుగ్రీవాజ్ఞగా నెరవేరుస్తా. నిన్ను తృప్తిపరచడమే నా జీవిత ధ్యేయం. నీవు ఏం చెప్పినా, విషమైనా తాగ్రిగుతా".

ఏదో నెపం మీద స్కూలుకెళ్ళి ఆఫీసుకు లత లావణ్యలను పిలిచించి చూశారు రాజాగారు, రాణీగారు. ఆ సౌందర్యరాసులను చూచి విభ్రాంతి చెందారు తమ నివాసంలో అలాంటి బిడ్డలు తిరగాలనే వాంఛ మిక్కుటమైంది వారికి. కానీ రక్త సంబంధం లేని వారికి పెంపుడు తల్లి దండ్రులపై ప్రేమాను బంధాలుండవని మయూరి భావన.

"రోజూ ఆ విషయమే ఆలోచిస్తున్నావా, మయూరి? ఈ విషయంలో నీ ఇష్టమే నా ఇష్టం నీ వెలా శలవిస్తే........"

సమాధానం చెప్పలా రాణీగారు. ఇది తన జీవితంతో ముడి పడిన సమస్య గదా!

నిద్రాహారాలుమాని మథనపడ్డారు రాణీగారు. ఏంచెయ్యాలి, నాకిక పిల్లలు పుట్టే యోగ్యతలేదు. అయినా మాతృత్వ వాంఛ రోజురోజుకు ప్రబలుతోంది. ఆ తెల్లవార్లూ కన్నీరు మున్నీరుగా ఏడ్చారు రాణీగారు. ఆ పిల్లలే కండ్లలో మెదులు తున్నారు. కాని వాళ్ళని తన బిడ్డలుగా, ఎస్టేటు వారసులుగా ఆహ్వానించ లేక పోతున్నారు.

"వాళ్లు అమ్మా అంటే మాత్రం నే తల్లినౌతానా? వాళ్ళు నాపిల్లలౌతారా? అంతా కృత్రిమంగానే వుంటుంది. మరి వేరే మార్గమేముంది? పరి పరి విధాల పోతోందామె మనస్సు, చివరి కొక అసాధారణ నిర్ణయాని కొచ్చిందామె.

"చాలా దీర్ఘాలోచనలో వున్నారు దేవిగారు "హంస తూలికా తల్పంపై నిద్రపట్టక నిట్టూర్పులిస్తున్న రాణీగారిని సాద రంలో పల్కరించాడు భర్త.

"నేనొక నిర్ణయానికొచ్చా. ఆ రోజు నా మాట ఏదైనా సరే వింటానని శపథంచేశారు కదా!" ధృడ నిశ్చయంతో అడిగింది.

"ఆనాడే కాదు ఏనాడైనా అదే మాట మీద నిలుస్తా. తన సత్యసంధతను ప్రకటించు కున్నాడు."

అమె ముఖ కవళికలు మారి వినూత్నకాంతులు వెల్లి విరిశాయి.

"అబ్బా అంటూ ఆనందంతో ఆమెను బిగియార కౌగిలిం చుకొని ఉక్కిరి బిక్కిరి చేశారు.

"మన రెండు ఎస్టేట్లకు, మన వంశానికి వారసుడు, మన కాక పుత్రుడు పుట్ట బోతున్నాడండీ? పట్టలేని ఆనందోత్సాహాలతో భర్తమెడ చుట్టేసుకొని చెప్పారు రాణీగారు.

యమ షాక్ తిన్నారు రాజాగారు.

"ఏమిటలా నిర్ఘాంతపోయి చూస్తారు?" భూమి తలక్రిందులైనా కావచ్చు. సముద్రాలింకవచ్చు కానీ "నభూతోనభవిష్యతి!" పూర్తిగా గర్భసంచి తొలగించబడ్డ నీ కడుపున పిల్లలెలాపుడతారు?

"మీరు కన్న తండ్రి అయితే నే తల్లిని కాలేనా?"

"ఈమెకేమైనా మతి చలిస్తోందా?" తొట్రుపాటు పడ్డారు రాజాగారు.

"ఇంత పెద్ద మగాళ్ళు, అంత పెద్ద జమీందార్లు ఇంత మాత్రం ఈ చిక్కు సమస్యకు తీర్పు చెప్పలేక పోతున్నారు. ఎగతాళిచేస్తూ నవ్వారు ఆమె.

మౌన ముద్ర వహించి అయోమయావస్థలోకి పోయారు. రాజాగారు.

"నేనీ ఉదయమే షికారీతో ఆ పిల్లల తల్లి దండ్రుల విషయాలన్నీ సేకరించా" చాలా సీరియస్‌గా ముఖం పెట్టి అన్నారామె.

"పిల్లల్ని అమ్ముతారో? లేక దత్తతకిస్తారో కనుక్కొమని వుంటావు."

"కాదు ఆపిల్లల తల్లి ఎంత అందమైనదో? తండ్రి మాన మర్యాదలు కలవాడా? ధనమూలం మిదం జగత్ అనే వాడా? తెల్సుకొచ్చి చెప్పమన్నా."

సందర్భాన్ని పూర్తిగా అవగాహన చేసుకోలేక పొయ్యాడతను.

"అతను వేశ్యాగృహాన్ని నడిపి బ్రోకరట. భార్యను నానాభాధలు పెడతాడనీ, ఆమె మానాభిమానాలుకల మహా సాధ్వియనీ, ఆమె సౌహార్దతను అతడు హరించి తన మదాంధతకు ఆహుతిచేయుగల కసాయివాడని చెప్పాడు.

"మనకు కావాల్సింది పిల్లలు! తండ్రి ధన పిపాసి అయితే ఎంతైనా వెచ్చించి కొందాం కదా?"

"కొన్న పిల్లలు కన్న పిల్లలౌతారా?"

"కనటం దుస్సాధ్యమైనప్పుడు?"

"కాదు. కనటం సాధ్యమే"

"కలగన్నారా?" పెద్ద షాక్‌తో నోరు తెరిచాడు రాయుడు. నా సలహావింటే, నా నిర్ణయుం తెలిస్తే అల్లా తల్లక్రిందులైతెల్లబోరు.

ఎందుకలా టెన్షన్‌లో పెడుతున్నావో? చెప్పరాదా మరి.

"మహా సౌందర్యరాసియైన ఆ పిల్లల తల్లిని పిలిపిద్దాం."

"ఆ! పిలిపించి?"

"ఆమె అందం, మీదర్జా, దర్పం, ఠీవి కలిస్తే"

"............................"

"అంటే మీ ఇద్దరి సంపర్కంతో పుట్టే బిడ్డ ఈ ఇంటిజ్యోతి, నా కంటి వెలుగు" తీర్పు చెప్పింది అమ్మగారు "ఇది చాలా సాహసకార్యం. దీనికి ఆడదిఇష్టపడాలి. దాని భర్త ఆమె నొప్పించ గలగాలి. ఈఆలోచన రాజా వారికి నచ్చింది ఒక రకంగా.

"కాని, టెష్టు ట్యూబు బేబీలను తయారు చేస్తున్నారు కదా!"

"ఇండియా ఇంకా అంత పురోగమించలా. పోనీ నాగర్భంలో పిండాన్ని పెంచుకోలేని దౌర్భాగ్యం నాది. పూర్తిగా గర్భసంచి, ఓవరీస్‌తోసహా తీసేశారు గదా!" ముఖం చిన్నబుచ్చుకున్నారు రాణీగారు.

"గతించిన నష్టానికి విచారించకు రాణీ!" నీవేది కోరితే అది కొండమీది కోతినైనాతెచ్చి నీకాళ్ళ ముందుంచుతా. ఆ ఆడదీ, దాని మగడూ నాకొక లెఖ్ఖా, జమా!" డబ్బుతో సర్వాన్నీ కొన గలమనే అహంకారం! ధీమాతో అన్నారు రాజాగారు" ఇదంతా చెప్పి చంద్రి మౌనం వహించింది.

"నాపై జరిగిన అత్యాచారానికి ఇంతకథ వెనకాలఉన్నదన్న మాట" అన్నాను నేను చంద్రితో.

# 17

"అలా అర్ధాంతరంగా ఆగిపొయ్యావేం అక్కా!"

ఆపిలుపుతో తృళ్ళిపడి నాజ్ఞాపకాలను కట్టిపెట్టి "ఏం చెప్పేది తల్లీ"! తర్వాత నాగాధ తారాస్థాయికి చేరిందమ్మా!
అదే అదే........

నాకు రాజాగారివల్ల గర్భం అయిందనే రహస్యాన్ని ధర్మయ్య, చంద్రి, షికారి, రాజా దంపతులకు తప్ప మరెవ్వరికీ తెలియకుండా దాచారు. డాక్టరమ్మతో వేరే కధ చెప్పారు. రాణీ మయూరి గర్భం దాల్చిందని బంధు మిత్రులకు తెలియ జేశారు. విందులు, వేడుకలు. జరిపించారు. వాతా...

"ఆ! పిలిపించి?"

"ఆమె అందం, మీదర్జా, దర్పం, ఠీవి కలిస్తే"

"............................"

"అంటే మీ ఇద్దరి సంపర్కంతో పుట్టే బిడ్డ ఈ ఇంటిజ్యోతి, నా కంటి వెలుగు" తీర్పు చెప్పింది అమ్మగారు "ఇది చాలా సాహసకార్యం. దీనికి ఆడదిఇష్టపడాలి. దాని భర్త ఆమె నొప్పించ గలగాలి. ఈఆలోచన రాజా వారికి నచ్చింది ఒక రకంగా.

" కాని, టెష్టు ట్యూబు బేబీలను తయారు చేస్తున్నారు కదా!"

"ఇండియా ఇంకా అంత పురోగమించలా. పోనీ నాగర్భంలో పిండాన్ని పెంచుకోలేని దౌర్భాగ్యం నాది. పూర్తిగా గర్భసంచి, ఓవరిస్‌తోసహా తీసేశారు గదా!" ముఖం చిన్నబుచ్చుకున్నారు రాణీగారు.

"గతించిన నష్టానికి విచారించకు రాణీ!" నీవేది కోరితే అది కొండమీది కోతినైనాతెచ్చి నీకాళ్ళ ముందుంచుతా. ఆ ఆడదీ, దాని మగడూ నాకొక లెఖ్ఖా, జమా!" డబ్బుతో సర్వాన్నీ కొన గలమనే అహంకారం! ధీమాతో అన్నారు రాజాగారు" ఇదంతా చెప్పి చంద్రి మౌనం వహించింది.

"నాపై జరిగిన అత్యాచారానికి ఇంతకథ వెనకాల ఉన్నదన్న మాట" అన్నాను నేను చంద్రితో.

# 17

"అలా అర్ధాంతరంగా అగిపొయ్యావేం అక్కా!"

ఆపిలుపుతో తృళ్ళిపడి నాజ్ఞాపకాలను కట్టిపెట్టి "ఏం చెప్పేది తల్లీ"! తర్వాత నాగాధ తారాస్థాయికి చేరిందమ్మా!
అదే అదే........

నాకు రాజాగారివల్ల గర్భం అయిందనే రహస్యాన్ని ధర్మయ్య, చంద్రి, షికారి, రాజా దంపతులకు తప్ప మరెవ్వరికీ తెలియకుండా దాచారు. డాక్టరమ్మతో వేరే కధ చెప్పారు. రాణీ మయూరి గర్భం దాల్చిందని బంధు మిత్రులకు తెలియ జేశారు. విందులు, వేడుకలు. జరిపించారు. వాతావరణం మారటం అవసరమని డాక్టర్లు రాణీగారిని దూరతీరాలకు తీసుకు వెళ్ళారు.

నన్ను ఇంచుమించుగా ఎవరికీ తెలియనిచోట గృహ నిర్బంధంలో ఉంచారు. ఇలా నవమాసాలు గడిచినై. తర్వాత నాకధ నీకు తెలుసుకదమ్మా నర్మదా!

"22 సంవత్సరాలకే నూరేళ్ళ కష్టాలనుభవించావమ్మా! ఈ బాధలు చెప్పలేక, మ్రింగలేక నాహృదయమంతా భగభగ మండు తోంది నర్మదా! ఇది నాకధ. ఇంతకన్నా దౌర్భాగ్యులు ఈ పృధ్విలో వున్నారంటావా తల్లీ" దుఃఖాన్ని ఆపుకోలేక బావురని ఏడ్చింది కాంచన. వెక్కి వెక్కి ఏడ్చింది నర్మద.

ఇద్దరం పడరాని కష్టాలు పడ్డవారమే అనుకుంటూ ఇద్దరూ కౌగలించుకొని దుఃఖాశ్రువులు జలజలా రాల్చారు. అలా ఎంత సేపున్నారో!

"భర్త నామమాత్రే వశిష్ఠుడు, అతి నికృష్టుడు, వట్టి లోఫర్ నీ భర్త. అలాంటి పైశాచికత్వానికి పాల్పడితే ఆ ఇంట్లో నీవొక బానిసగా ఎందుకున్నావు? అక్కా! నీకు వ్యక్తిత్వం లేదా? సముద్రం చెలియలికట్ట దాటితే ప్రపంచాన్నే ముంచుతుంది. అలాగే ఒకరు హద్దుదాటితే రెండోవారు ప్రతిఘటించాలి." నర్మద చాల వుద్రేకంగా అంది.

"శాంతి అహింసల వాతావరణంలో పెరిగానుకదా! దయకు నిధియైన మాతాత మానవత్వపు విలువలతో పాఠాలు చెప్పి నన్నొక శాంతి స్వరూపిణిగా మల్చిచాడు నర్మదా!"

"వెనుకటికొక యోగీశ్వరుడు ఒక పాముకు నీవెవ్వరినీ కరవకుమీ! దయగా జీవించి, కీర్తి సంపాదించమని బోధించాడు? ఇక పాము కరవదుగదా అని తలోకరాయి దానిమీద విసిరారట. మళ్ళా ఆయోగివచ్చి "బుస్సు" అను వాళ్ళే పోతారని సలహా ఇచ్చాడట. అలా తిరుగుబాటు చెయ్యకుంటే మన జీవితాలకు విముక్తి లేదక్కా!" కాంచన కంఠికి మంటికి ఏకధారగా ఏడుస్తోంది.

"నీతిని, సత్యాన్ని, మానవత్వాన్ని మంటగలిపి డబ్బుకు కక్కుర్తిపడి, కక్కినకూటికాశించే ఆ ఖలునిపై నీకు ప్రతీకార వాంఛ లేదా? అక్కా?"

"దుర్మార్గ ప్రవృత్తిని మార్చాలిగాని..........."

"ఎలుకతోక తెచ్చి యెందాకవుతికినా నలుపే, అన్నట్లు దుష్టుల్ని మార్చలేం. వారుపాషాణంతో సమానం. మన మాన, ప్రాణాలతో చెలగాటా లాడతారు వాళ్ళు."

"ఇదొక విషసర్కిల్ నర్మదా! అంతతేలిగ్గా మన ప్రవృత్తిని మార్చుకోలేం!"

"అయితే అనుభవించక్కా! నీలో జవసత్వాలున్నంతవరకూ కృంగి కృసించిపో! నీవు మార్గదర్శివి కాలేవక్కా"!

"నాకు త్యాగంలోవున్న ఆనందం ప్రతీకారంలోలేదమ్మా!"

"పరిస్థితులే నిన్ను ప్రకోపింపజేస్తాయి అక్కా!" చిరు కోపంతో సమాధానమిచ్చింది నర్మద.

మనుషుల్లో నీఅంత మంచి మనుషులరుదు నర్మదా! నీకిప్పటికే చాలా రుణపడి వున్నానమ్మా!" మానవత్వం మూర్తీభ వించిన లోతుల్లోంచి ఆమెకు కృతజ్ఞత చెప్తోంది కాంచన.

"ఇక్కడ రుణాలు తీర్చటాలు అనే ప్రసక్తి లేదు. అందరం మానవులమే. సేవలోవున్న ఆనందం, తృప్తి అనిర్వచనీయం అక్కా".

"సహనానికి మారుపేరు నీవక్కా! ఇంత క్షమ భూదేవికి సైతం వుండదు. ఇప్పటికైనా అన్నమాట నిల్పుకొని నిన్నూ

నీ పిల్లల్నీ గౌరవిస్తాడా, సరేసరే. అతని మనస్సు మారకనిన్ను మళ్ళీనరక యాతనలో పెడితే అతని పాపానికి ప్రాయశ్చిత్తం.... ........ ఏమిటి తెల్సా సజీవదహనం" పళ్ళు పటపట కొరికింది నర్మద.

"అంత మాటనకు నర్మదా"! మొదటినుండి సమస్యలతో రాజీపడట మేతప్ప ఎదిరించడం, తిరుగుబాటు ప్రసక్తి నాబుర్రలో వుండదమ్మా."

"సమాజంలో సగభాగం స్త్రీలు కదా! మరివారు శారీరక మానసిక దాస్యంలోవుంటే దేశానికి ప్రగతి లేదక్కా! మనబంధాల నుండి విముక్తిని మనమే సాధించాలి. అవసరమొస్తే తిరుగు బాటు ద్వారానైనా; అంతేగాని హారతి కర్పూరంలా హరించి పోబోకు అక్కా." వంచిన తల ఎత్తలేదు కాంచన.

"నా హితోపదేశం నీకు రుచించలేదులే. కానీ ఏనాడో నీ సహనశక్తి నశించి నీవే తిరగబడక తప్పదక్కా."

"నాజీవితకథ చెప్పాగదా? అందులో నాతప్పువుందా? లేదు. మరి కుమార్ దుష్టుడు, పరమనీచుడు కదా! అప్పుడు నేనెదురు తిరిగి అతన్ని వదలిపెట్టి విడాకులు పొందాను. అది దోషమని అనగలవా? మరి నీ విషయం కూడా అంతే." సలహా ఇచ్చింది నర్మద.

సమాధానం ఇవ్వలా కాంచన.

సాయంత్రానికి ప్రయాణమయింది కాంచన.

"వెళ్ళి పోతున్నావా అక్కా?" నర్మద స్వరం గాద్గదికమైంది.

"భూదేవిలాంటి క్షమ, తల్లిలాంటి వాత్సల్యం, ధైర్య సాహసాలు కల నిన్ను నా జీవితంలో మర్చిపోలేనమ్మా!" కాంచన కృతజ్ఞత కళ్ళతో చూపింది. నర్మద మాట్లాడ లేక పోయింది.

"మనుషుల్లో నీ అంత మంచి మనుషులుంటే సమాజమే బాగుపడుతుంది అన్నది" కాంచన.

"నీకూ నాకూ ఏనాటి అనుబంధమో, ఇలా కలిశాం. మళ్ళీ విడిపోతున్నాం. నీభవిష్యత్తు సుఖంగా వుండాలని కోరుతున్నాను అక్కా! కానీ నాదొక మనవి. ఏ పరిస్థితిలోనూ ఆత్మాభిమానాన్ని చంపుకోకు" హెచ్చరించింది నర్మద.

"కొన్ని దశాబ్దాల సాన్నిహిత్యానికీ, మమతకు దూరమౌ తున్నానమ్మా!" కౌగలించుకొని ఏడుస్తుంది కాంచన.

"పరిస్థితులను కూలిస్తే తిరిగి కలుద్దామక్కా" ధైర్యం చెప్పి కన్నీటితో వీడ్కోలిచ్చింది నర్మద.

"ఆఖరిసారి నర్మద మొఖంచూస్తూ అసంతృప్తితో, వెలితితో, హృదయంలో బాధతో బైటికొచ్చి ప్రయాణం సాగించింది కాంచన.

# 18

సాంధ్ర చీకటులు అప్పుడే అలముకుంటున్నై. తానేదో విషాద సంఘటనలో చిక్కుకోబోతున్నట్లు మనస్సెందుకో కీడును

శంకిస్తోంది. పిల్లలను చేరాలనే ఆదుర్దాతో గబగబ ఉరుకులు, పరుగులుగా నడుస్తోంది. దారి పొడవునా కుక్కలు, నక్కల అరుపులు విషాదసూచకంగా వినిపిస్తోన్నై. కాంచన కెందుకో దుఃఖంతో పాటుగా వణుకు పుట్టుకోస్తోంది. తన పెన్నిధులను చేరుకోబోతున్న తనకు ఆనందానికి బదులు.......

పిల్లలపై అపార వాత్సల్యంతో చిరుచీకటి సమయంలో ఇల్లు చేరింది కాంచన. గేటు నెట్టి లోనికి అడుగు పెట్టింది. క్షీణ కాంతిలో వెలుగుతున్న లైటు దృగ్గోచరమైంది. వాకిలి పరికించి చూచింది. ఇంట్లో ఏసందడి లేదు. మనుష్య ఆకారాలు కన్పించలా. మరో అడుగు ముందుకేసింది? సన్నని మూల్గు విన్పించింది. మెట్లెక్కింది. దీర్ఘ ఉఛ్వాస నిశ్వాసాలు వినిపిస్తున్నై. వాకిలి దగ్గరకి చేరగానే పెద్ద పెద్ద ఎక్కిళ్ళు వినిపిస్తున్నై. లోలోన దిగ మిగ్రింగుతూన్న ఏడ్పు అది. అది తన ప్రేమనిధి నీలిమ కంఠం. కాంచనకు దడ పుట్టింది. శరీరమంతా చల్లబడింది.

"నీలీ! నీలీ! నేనమ్మా! అమ్మను" అంటూ ఓరవాకిలిగా వున్న తలుపును ఒక్క ఊపుతోనెట్టి లోనికి పరుగెత్తింది. దీపం లేదు. ఇల్లంతా చీకటిగా వుంది. కటిక చీకటిపై బోర్లాపడి ఏడుస్తోంది నీలిమ. అది మామూలు దుఃఖం కాదు. హృదయ విదారక రోదన. అదొక ఆర్తనాదం.

"అమ్మా! నీలీ! నేనొచ్చానమ్మా! నేనమ్మా! అమ్మను" తన బిడ్డను చీకట్లో తవుడుకుంది. శరీరమంతా నిమిరింది. తలపై ముద్దుపెట్టుకోబోయింది. అవ్యాజానురాగంతో ఒంటి మీద,

చేతులమీద దెబ్బలు వాతలు తేలుతున్నై. కాంచన దిగ్భ్రాంతి చెందింది. నిశ్చేష్టురాలయింది.

"ఏమయిందమ్మా! ఎందుకేడుస్తున్నావు?"

"అమ్మా" పెద్దగా అరిచింది; అది అరుపు గాదు గావుకేక. నీలిమ ఆ పిలుపు గుండెను పిండేలా వుంది. అది పిలుపుకాదు; భయంకరమైన ఆర్తనాదం. నరాల్ని దహించేశోకం.

"నీలిమా! ఏమ్మా! ఏంజరిగిందమ్మా! ఎలావున్నారమ్మా" అంటూ లేవనెత్తి కౌగిలించుకో బోయింది కాంచన. చేతికి తడి తగిలింది. అది నెత్తురుగా గుర్తించిందా చీకట్లో సైతం.

"ఏమ్మా! ఎవరు కొట్టారూ? చెల్లాయి లేరి" చీకటిని తవుడు కుంటూ వెళ్ళి దీపం వెలిగించి తెచ్చింది తల్లి. పిల్లను అపాద మస్తకం చూచుకొంది. కౌగిలించుకొని బావురుమంది కాంచన. తెప్పరిల్లి

"నీలీ? నేనొచ్చాగా, ఏడవకమ్మా." కొన్ని క్షణాలు ఇద్దరి నోట మాటలు రాలేదు. "ఏం చెప్పాలి? ఎలా చెప్పాలి. తను ఆనాటి అర్ధరాత్రి నిశీధిసమయంలో పిల్లల్ని దిక్కుమాలిన వాళ్ళను చేసి ఎందుకు వెళ్ళినట్లు? ఎచ్చటకు వెళ్ళినట్లు? కాంచన బాధ పడింది.

'నాన్న ప్రవర్తన గురించి ముఖ్యంగా చెల్లెళ్ళ అదృశ్యం గురించి అమ్మకెలా చెప్పాలి? చెప్తే ఆమెగుండె పగిలి ప్రాణం

పోతే? అమ్మలేని తన బ్రతుకేంగాను. ఈ సంవత్సరం పడ్డపాట్లు ఎన్నెన్నో?, లోలో మధనపడుతోంది నీలిమ.

"అమ్మా! మమ్మల్ని వదలి ఎక్కడికెళ్ళావమ్మా! నేను మాత్రం కొనవూపిరితో ఉన్నానమ్మా" అంది నీలిమ ఇద్దరి మధ్యా మౌనాన్ని చేధిస్తూ.

కాంచనపై పిడుగు పడ్డట్టయింది. ఏదో జరగరాని ఘోరం జరిగినట్లు అర్థమయింది. తన ముద్దుబిడ్డలిద్దరు లత, లావణ్య లేమైనారు?

"చెల్లాయిలేమైనారమ్మా!" ఏదో దుర్వార్త వినబోతున్నట్లు మొగంపెట్టి అడిగింది కాంచన.

"ఏం చెప్పేదమ్మా! విని సహించగలవా?"

"చెప్పమ్మా! చెప్పు. నేనింకా మీకోసమే బ్రతికివున్నానమ్మా!" నా కంటూ ఏమీ లేదు. మిమ్మల్ని కంటిరెప్పలా కాపాడుకుంటా. నేనొచ్చాగా. ఇంకెక్కడికీ పోను. చెప్పవా?" బ్రతిమాలింది కాంచన.

"నువ్వు కాపాడుకునేందుకేం మిగలలేదమ్మా" నీలిమ కళ్ళు బాష్పాలతో నిండిపోయినై. జుట్టుచిందరవందరగావుంది. ప్రాణాలు కళ్ళల్లో మాత్రమున్నై.

నీలి మొగంచూచి కాంచన నీరైపోయి "అలాశుష్కించి ప్రాణాపాయ స్థితిలో వుంటానికేమయిందమ్మా!" నిట్టూరుస్తూ తల్లి తన చిన్నికూతుర్ని అడిగింది.

"నీవు వెళ్ళాక నా బ్రతుకు కాకి బ్రతుకయిందమ్మా! నాన్న నన్ను చిత్రహింస పెట్టని రోజు లేదు. వెట్టిచాకిరి చేయించని క్షణమూలేదు." నీలి గొంతు పూడిపోయింది. తల్లి ప్రాణం తల్లడిల్లి పోయింది.

"లత, లావణ్యల కథ విని భరించగలవా అమ్మా!"

"ముక్కు పచ్చలారని నా ముద్దుబిడ్డవు. ఎంతో పరిపక్వ అనుభవమున్నదానిలా అడుగుతున్నావు? ఎలానేర్చుకున్నావమ్మా, ఇంత విజ్ఞానం!"

"అమ్మా, పరిస్థితులే మానవుడికి ప్రజ్ఞాపాటవాలిస్తాయి. నీవు వెళ్లాక నా బ్రతుకు బండలయింది." దుఃఖాన్ని ఆపుకుంటూ "లతా, లావణ్యలు అదృశ్యమైనారమ్మా! మనకు దక్కలేదు."

"నీలీ!" పెద్దగా గావుకేక పెట్టి పడిపోయింది కాంచన.

"అమ్మా! అమ్మా! పెద్దగా పిలుస్తోంది నీలి. అమ్మ చనిపోతుందేమోనని భయపడ్డ నీలి చేష్టలుడిగినయి.

అలా ఎంతసేపున్నారో!

కాంచనకు స్పృహవచ్చింది. కాస్త తెప్పరిల్లి దాహమని సౌంజ్ఞచేసింది.

నీలి అమ్మని కౌగలించుకొని ఇంకా ఏడుస్తూనేవుంది.

నీలి చెప్పబోయే దుర్వార్త వినటానికి కాంచన గజగజ లాడి పోతోంది. తన గుండె నెవరో పిండుతున్నట్లుంది. తన బ్రతుకు చివరిదశ కొచ్చినట్లుంది.

"అసలేం జరిగిందమ్మా! వాళ్ళనీ, నిన్ను చూడాలని వేయి కళ్ళతో తిరిగొచ్చానమ్మా" కాంచన కంఠం రుద్ధమైపోయింది.

"జరిగింది చెప్తా వినమ్మా!" నెమ్మది నెమ్మదిగా చెప్ప సాగింది నీలిమ.

"ఈ రోజూ సాయంత్రం 4 గంటలకు ఒక వ్యక్తివచ్చి "ఫోను కాలొచ్చింది సార్! మీరు అర్జంటుగా రావాలి." అని నాన్నను పిలిచాడు.

"వారిద్దరి మధ్య సంభాషణ ఇలా సాగిందమ్మా"

"హల్లో? నేను యుగంధర్ను. ఎవరండీ మీరు?

"నేను శేఖర్ను. అమ్మణ్ణి కంపెనీ మనిషినండీ! మంచి బేరం వచ్చింది. వెంటనే మీరు వచ్చి మాట్లాడమని అమ్మణ్ణిగారు చెప్పమన్నారు."

"ఆ! ఆ! ఇప్పుడర్థమయింది. తృటిలోవచ్చి వాల్తా"

నాన్న ఒక గంటలో తిరిగొచ్చాడు గడ్డాలున్న విదేశస్తుల్ని, అమ్మణ్ణిని వెంటబెట్టుకొని. వాళ్ళ మధ్యసాగిన బేరసారాలు 2 గంటలు పట్టిందమ్మా!

"పిల్లకు లక్షకు తగ్గదు. ఇంతకు ముందు ఎన్ని బేరా లొచ్చినా ఇవ్వలే" నాన్న ఘట్టిగా వాదిస్తున్నాడు.

వాకిలి వరండాలో నాన్న, అమ్మణ్ణి ఒక వక్క, ఆ కాబూలీ వాలాలు రెండో వక్క కూర్చున్నారు. నేను కిటికీ సందుల్లోంచి చూచానమ్మా! అది నాన్న కంఠధ్వని, అర్ధంకాలా. అంతా కలియ చూచా.

"ఎన్ని బేరాలొచ్చాయో మీకు తెలియదు. మన స్నేహం కొద్దీ"............ అమ్మణ్ణి వాళ్ళతో వాదిస్తోంది.

"ఇద్దరికీ లక్ష ఇస్తాం" మొదటివాడు హెచ్చరిస్తున్నాడు.

"ఇంకా నాలుగేళ్ళు సాకాలి ఈ పిల్లల్ని దానికేం చేస్తా వయ్యా" అన్నాడు రెండోవాడు.

"అందుకే ధర తగ్గింది" అమ్మణ్ణి బేరాన్ని సాగదీస్తోంది.

"నా పిల్లల అందంతో సరితూగగల వారీపృధ్విలో వున్నా రటయ్యా! ఇంకో రెండేళ్ళు పెంచితే నా ఇల్లంతా డబ్బే" నాన్న అంటున్నాడు.

"బంగారుగుడ్ల బాతులు, మీ అదృష్టం పండింది. మీ ఇల్లంతా బంగారమే. బంగారంలాంటి పిల్లలు కావాలన్నా నీకు లభిస్తారటయ్యా?" అమ్మణ్ణి నాన్న మాట బలపరుస్తున్నది.

"మా యజమాని ఎన్నడూ ఏ పిల్లనూ లక్షకు కొనలే దండీ.... గడ్డపాయన గట్టిగా అన్నాడు.

"పైకం ఇప్పుడే ఇస్తాం ఆఖరుమాట చెప్పండి"

"ఇద్దరికీ లక్షన్నర. చివరమాట చెప్తున్నా. మీ ఇష్టమైతే డబ్బు ఇచ్చి పిల్లల్ని పట్టుకెళ్ళండి. లేకపోతే మా దేవిడీ వుండనేవుంది" అమ్మణ్ణి అన్నది ఇదే ఖరారు అన్నట్లు.

"అంత తొందరెందుకోయ్. ఇంకో సంవత్సరం సాకుదాం. నేనివ్వ" నని నాన్న అంటుంటే.

"వడ్డీ చూచుకోవోయ్. అదిగాక రెండేళ్ళ ఖర్చు ఆలోచించావా" రహస్యంగా అమ్మణ్ణి నాన్నతో అంటున్నది.

"అప్పటికి ధరలు పెరుగుతై! పిల్లలింకా మిరుమిట్లు గొలుపుతూ వుంటారు. చేతికందే ఫలాలు, మూడు లక్షలైనా రావచ్చు".

"కాదయ్యా మీ ఆవిడొస్తే పెద్దగోలవుతుంది. ఈ లోగా పూర్తి చేద్దాం. ఏదో విధంగా సెటిల్ చెయ్యి. రెండో కంటి వాడికి తెలియరాదు. తెల్సిందా" తొందపెట్టింది అమ్మణ్ణి.

"మా ఆడదానికి 3 లక్షల బేరం క్షణంలో కుదిరింది. ఇప్పుడిద్దరికీ ఇంత తక్కువా" యుగంధర్ అసంతృప్తి వెల్లడించాడు.

"కాదోయ్ వాడు కోటీశ్వరుడు వాడికి లెఖ్ఖేమిటి? ఇంతకూ వాడికి కొడుకుపుడితే మళ్ళీవడ్డీ అడుగు. ఆ 3 లక్షల్లో అప్పుడే చాలా ఖర్చయింది." అమ్మణ్ణి నాన్నవైపు కొంటెగా చూచింది.

"జాయింటు అకౌంటులో దాచాంకదా" నాపేరుకొట్టేశావాఏం? పాలముంచినా నీట ముంచినా నీవే! సర్వం నీ కర్పిస్తున్నా" అన్నాడు నాన్న.

"నే మాత్రం నిన్ను 20 సం॥లుగా నమ్ముకున్నా. ఇద్దరం కలిసి ఎన్ని కొంపలు కూల్చాం, ఎందరిని తార్పించాం, ఎందర్ని అమ్మాం, ఎన్ని లక్షలు గడించాం. నిన్ను కాదని ఏమైనా చేశానా" అమ్మణ్ణి ఎత్తి పొడిచింది.

"సరే నీ ఇష్టప్రకారం బేరం ఖాయంచేసి పైకం పుచ్చుకో ముందుగా" డబ్బు దొంగనోట్లయితే ఎలా?

"ఏం మనిషివయ్యా! ఇన్నేళ్ళుగా వ్యాపారం చేస్తున్నాం, ఎవడన్నా ద్రోహం తలపెడితే ప్రాణాలతో వదుల్తానా? వాళ్ళు నాకాడికి ఎన్నిసార్లొచ్చారు. ఎందరు పిల్లన్ని అమ్మాను, భలే వాడివి. నీ మాట వింటుంటే నామతి పోతోంది. పదపద వాళ్ళే మనుకుంటారో! బేరంపోతే పెద్ద చిక్కు" కిటికీ ప్రక్కనుండి నేను అంతా విన్నానమ్మా.

"లతా, లావణ్యలు దేవిపిన్ని కూతురు చిన్నాతో ఆడు కుంటున్నారు. నాన్న వెళ్ళి వాళ్ళని తెచ్చాడు.

"మనం సినిమాకు పోదాం పదండి" వాకిట్లోంచే వాళ్ళను పంపుతున్నాడు.

"చెల్లిని కూడా తెస్తానని లోపలికొచ్చింది లత."

“చెల్లీ! చెల్లీ! నీలీ! నువ్వు రావా! నాన్న ఇవ్వాళ మనల్ని సినిమాకు తీసుకెడతాడట” గెంతుతూ సంతోషంగా వస్తోంది లావణం.

“నేను లోపల్నించి గబగబా బైటకొచ్చి వీల్లేదు. మీరు పోవద్దు. మిమ్మల్ని వాళ్ళకు అమ్ముతున్నారు. అమ్మను 3 లక్షలకు అమ్మారు” అని అరిచాను.

లతా లావణ్యలకు నామాటలు అర్థంకాలా. నాఆదుర్దా, భయం చూచి గాభరు పడ్డారు వాళ్లు. నేను వాళ్ళని లోపలికి లాక్కొచ్చి వివరంగా చెప్తున్నా. ఇంతలో నాన్న దూకుడుగా నామీదికొచ్చి నారెక్కను గుంజి లతనుండి విడిపించాడు. లావణ్య పరిగెత్తు కొచ్చి నన్నుకావిటేసుకుంది లేడి పిల్లలా.

“ఇంతతో అమ్మణ్ణి ముఖం చిట్లించి కోపంతో.”

“దిక్కుమాలినదానా! మీ అమ్మ నిన్ను వాళ్ళపై నిఘా పెట్టిందంటే! నీఅమ్మోరంకుదైతే నీవొక బజారు దానివయ్యే ట్లున్నావు! మొత్తంమీద మీ అమ్మ జాణైతే నీవొక సెరజాణవే! తడిగుడ్డలతో గొంతులుకోసే వంశమే మీది.” అంటూ నా జుట్టు పట్టుకుగుంజి నెత్తిన మొట్టింది.

“నీవూ! నాన్న కలిసి మాఅమ్మను అమ్మారు. ఇప్పుడు నా అక్కల్ని అమ్ముతున్నారు. మా వుసురు తగుల్తుంది మీకు. ఇప్పటికైనా మమ్మల్ని విడిచిపెట్టండి. ముష్టెత్తుకునైనా బ్రతుకుతాం. అని ఆవేశంతో అరిచానమ్మా!”

"గుడ్డొచ్చి పిల్లనెక్కిరించిందట. ఏమే! కాకీ! నీకిక్కడెవరే అండ! దొంగముండ! అమ్మణ్ణిని ఎదిరించే తాహతూ, ధైర్యం నీకెవరిచ్చారే! చెప్పుకో నీతాతతో" అని నాన్న డొక్కలో తన్నాడు నన్ను. నేనప్పుపు గిలగిలా కొట్టుకుంటున్నాను.

"ఏమే! లంజా! నల్లముండా, నీవు నీతులు చెప్పేదానివా! నిన్ను చంపినా దిక్కెవ్వరే జోడీ!" రెక్కపట్టి క్రింద పడేసి ఈడ్చిందమ్మా! అమ్మణ్ణి నన్ను. వెంటనే నాన్న పట్టరాని కోపంతో మూలనున్న కర్రతో చితక బాదాడునన్ను. "నేను అమ్మో, బాబో అని అరుస్తుంటే, నాన్న నన్నన్నా భరిస్తా, అమ్మలాంటి అమ్మణ్ణిని తిడతావంటే లంజా! నీకెన్ని గుండెలే దిక్కుమాలినదానా! కాకిలాగా పుట్టింది చాలక నాకు సలహాలివ్వ గలదానివా నువ్వు. చావు! చావు! ఇక ఈ ఇంటి శని విరగడై పోతుంది" కొడ్తుంటే; చెల్లీ! చెల్లీ! అని లతా, లావణ్య ఇద్దరూ బెంబేలెత్తుతుండగా ఇద్దర్నీ ఇద్దరూ లాక్కెళ్ళి పొయ్యారమ్మా! ఇక మనకు లేరమ్మా! అక్కయ్యలు.

తన కథ చెప్తూ చెప్తూ షాక్ తిన్నదానిలా ఆగిపోయింది నీలిమ. నిర్విణ్ణురాలయింది కాంచన. ఎవరికోసం తను తన సర్వస్వం త్యాగంచేసి పడరానిపాట్లు పడ్డదో, చెయ్యరాని పని చేసిందో, తన నిండు జీవితాన్ని బలిచేసిందో; ఏ బిడ్డల కొరకు తన జీవితాన్ని హారతి కర్పూరంలా హరింపజేసుకుందో ఆబిడ్డల్ని ఈనాడు తనకు దక్కకుండా చేశాడు ఆ కిరాతకుడు. వాడే; వాడు తనకు భర్తట. వాడి వాగ్దానమేమిటి? చేసిందేమిటి? నమ్మక

ద్రోహి నిప్పులు క్రక్కుతోంది కాంచన. "అలుగుటయే ఎరుంగని" అన్నట్లు.

పళ్లు పట పట కొరుకుతోంది; అది అపరకాళికా రూపం. అనొచ్చు. అమ్మను చూచిన నీలిమ గడగడలాడింది. ఆ సమయంలో

"చచ్చావా లేదా? లంజా" అరుపులు కేకలతో తలుపు నెట్టు కొచ్చాడు తండ్రి యుగంధర్.

"అమ్మా! అమ్మా! అంటూ నీలిమ తల్లిని కావిటేసుకుంది. గజగజలాడుతూ.

"ఈ లంజ ఎప్పుడొచ్చింది. ఒసే పతితా! అక్కడే చస్తా వనుకున్నా ఎన్ని గుండెలే నీకిఇంట్లో అడుగుపెట్టటానికి. తలచెడ్డా బ్రతకొచ్చుగాని, శీలం చెడ్డ ఆడది ఊరుకీ, కాటికిరోసి బ్రతుకు తుందే, నీకిక్కడ స్థానం లేదుపో! చావు పతితా! భ్రష్టా! మరచిపొయ్యా! ఎలాగూ చెడ్డావు, వ్యభిచరించావు. ఇకనిన్ను మా దుకాణానికి పంపుతా కాస్తో కూస్తో నా చెయ్యి తడుస్తుంది. ఇంతదాకా వృత్తికి పంపుదామనుకుంటూనే 10 సంవత్సరాలు గడిచిపోయినై.

ఇంతలో గొప్ప బేరం వచ్చింది. ఇపుడు మళ్ళా మంచి సమయం వచ్చింది! లే! ఇంకా ఇంకా అందాలరాసుల్ని కనిస్తా వని కొన్నాళ్ళు, నాకొరకు కొన్నాళ్ళు ఆగాను. నీలాంటి కులటతో కాపురంచేసే విశాలహృదయం నాకు లేదు. పద దింపొస్తా! లేక

పోతే మెడబెట్టి గెంటి అమ్మణ్ణికి అప్పజెప్తా. లే! లే! మీది మీది కొస్తున్నాడు ధర్.

తాచుపాములా లేచింది కాంచన.

"ఆగు! నన్నంటకు నీచుడా. చెయ్యదించు. నీ మొహం చూస్తేనే మహాపాతకాలొస్తాయి. నీలాంటి కృతఘ్నుల్ని ఈభూమి భరించలేదు. నీ పాపం పండేరోజు వచ్చింది."

"ఓసి లంజా! నీకు ఈ పాఠాలు నేర్పించింది ఏ రంకు మగడే? 'రంకు నేర్చినమ్మ బొంకు నేర్చిందట." మొగుళ్ళతో మరిగి....

"ఏ గూటి పిట్ట ఆ వలుకులు వలుకుతుంది అలాగే నీనోట మరో మాట, ఆఖరికి ఒక్క మంచిమాట వస్తుందా? అసలు నా పిల్లన్ని ఏంచేశావు? వాళ్ళనితెచ్చి నా కిస్తావా లేదా? ఉద్రేకంగా అన్నది కాంచన.

"నా పెళ్లాం, పిల్లలూ నా అస్తి, కొట్టే హక్కు, చంపేహక్కు, అమ్మే హక్కు సర్వహక్కులు నావే. నోరుమూసుకొని బైటికినడు"

"విశ్వాసహీనుడా! దళారి జీవితం నీది, తల్లిదండ్రులప్రేమ, భార్యాభర్తల మమత ఎరుగని కసాయి వాడివి నీవు. నీకళ్ళకు కామెర్లు కమ్మినై"

"ఆ! ఏమిటీవాగుడు. ఎవరు నేర్పారీధోరణి! నోరెత్తే ధైర్యం కూడానా నీ బ్రతుక్కి. భ్రష్టా! కులటతో కులికే పాపినికాను నేను"

"ఎవరురా భ్రష్ట? ఎవరురా పతిత? చెప్పు? నామానాన్ని మూడు లక్షల కమ్మిన నీవు భ్రష్టుడివి కావా? నన్ను నా బిడ్డల్ని దుర్వృత్తిలోకి పంపమని సలహా ఇచ్చిన నీప్రియురాలు అమ్మణ్ణి పతిత కాదా? నాచేత తన భర్తవల్ల బిడ్డను కనిపించిన జమీందారిణి మయూరి పతితకాదా? అన్యాయంగా నన్ను నీకంటగట్టిన నా సవతి తల్లి కామిని పతిత కాదా? ఒక స్త్రీకి ఎంత అన్యాయం జరిగినా ఆమెకు రక్షణ, న్యాయం ఇవ్వలేని ఈ సమాజం పతితకాదా? ఎవరు పతిత కాదో చెప్పరా?" నన్నుపతిత అ న టా ని కి నీకు ఎన్ని గుండెలురా? నీచుడా! నీబోటి తుచ్ఛుడీ ప్రపంచంలో పూర్వం పుట్టలేదు. ఇక ముందు పుట్టబోడు. నీపాపానికి ప్రాయశ్చిత్తం లేదు.

కర్కోటకుడా! ఖలుడా! "తలయందు విషము పాముకు, తోకలో విషము తేలుకుంటే" నీఆపాదమస్తకం వి ష పూ రి తం; నాలాంటి అభాగినుల కన్నీళ్ళతో జలకాలాడే భ్రష్టుడా? నీబోటి విషనాగుల్ని ఇక ఈ నారీలోకం సహించలేదురా! ఇన్నాళ్లు మా జీవితాల్తో చెలగాటా లాడిన నీబోంట్లకు మురికిచావే శరణ్యం. నీసాంగత్యం అంటే పాముకు పాలుపోసినట్లేరా! నీనైచ్యం పరా కాష్ఠ చెందిందిరా. దాన్ని వర్ణించడానికి తెలుగుభాషలో పదం లేదురా! తుచ్ఛపురుగా! కుహనా సంస్కారి! ఇప్పుడు చెప్పరా! నేపతితనా? నేపతితనా?" ఎవరు పతితో చెప్పరా!

"రా అంటావంటే లంజాముండా! నన్ను, నీ మొగుణ్ణి ఆగమని ప్రశ్నించే తాహత నీకుందా? కులట. నీవూ, పిల్లలు నా ఆస్తి, మీపై నాకు సర్వాధికారాలున్నై. అని చెప్పాగదా!

మీకు నోరెత్తే అధికారం లేదు. మిమ్మల్ని చంపినా, అమ్మినా, తార్చినా............

"సముద్రమంత దుఃఖాన్ని మ్రింగాను. కొండంత అపవాదు భరించాను నా బిడ్డలకోసం. నేనూ నీలాంటి చీము, నెత్తురూ గల వ్యక్తినని గ్రహించలేని కృతఘ్నుడివి నువ్వు. ఆ కుక్కకన్నా విశ్వాసంవుంది కానీ........" రౌద్రాకారం దాల్చింది కాంచన.

హడలి పొయ్యాడు ధర్. తృటిలో తెప్పరిల్లి "నోర్మూయ్ ప్రాణం తీస్తా, జాగ్రత్త" కాంచన చెంప చెళ్ళుమంది. జుట్టు పట్టుకొని మెడ వంచి చావబాదాడు. చెయ్యి పట్టుకొని కరిచాడు. సివంగిలా ఆమెమీదికి లంఘిస్తున్న తండ్రి చెయ్యి పట్టుకుంది నీలి. ఆ పిల్లనొక తన్ను తన్నాడు ధర్. గిల గిల కొట్టుకుంటోంది నీలిమ.

"నమ్మకద్రోహి! నీకంటె ఆ పాషాణమే నయం. నా కళ్ళ ముందే నా బిడ్డనిలా చిత్రహింసలు పెడతావా? నిన్ను నిలువునా చీల్చినా పాపం లేదు" రౌద్రం మూర్తీభవించింది ఆమెలో.

యెదా గుండె పడిచచ్చినై ధర్‌కి. నోటిమాట పడిపోయింది. కాంచన దేహం కోపంతో వణికిపోయింది. ముఖం ఎర్రగా జేవురించింది. కనుబొమ్మలు రోషంతో ముడిపడినాయి. భూదేవిలాంటి ఆమె క్షమ, ఓర్పు, భస్మీపటలం అయినాయి.

"ఎవరి పరిధిలో వారుండాలి. ఒకర్నొకరు గౌరవించాలి. హద్దుమీరిన వారిని క్షమించడం నేరమక్కా!" నర్మద మాటలు

ప్రతిధ్వనించాయి. 'వజ్రేన వజ్ర నిహతి' అన్నట్లు రాతిని రాతితోనే కొట్టాలిగాని పుష్పంతోకాదని తేల్చుకుంది కాంచన.

ఆవేశంతో వంటింట్లోకి పరుగెత్తింది. కత్తిపీట తెచ్చింది. నూరు ఏనుగుల బలంతో ధర్‌సెత్తిన ఒక్క వేటు వేసింది.

"చావు! చావు" అంటూ చచ్చేదాకా పొడిచింది, కొట్టింది, రక్కింది. క్రిందపడి గిలగిల కొట్టుకుంటూవుంటే చూచి తలపై ఒక్కతన్ను తన్నింది.

యుగంధర్ దేహంలో చలనం ఆగిపోయింది. కాని కాంచన కసి తీరలా. అతని శవంపై నృత్యం చేస్తున్నది. పరిసర జ్ఞానం ఆమెలో నశించింది. అతని రక్తంలో చేతులు తడుపుకుంటున్నది. భీకరంగా కేకలు పెడుతున్నది.

"ఎవరురా పతిత" అనే వాక్యాన్ని పునశ్చరణచేస్తూ భీకర కరాళ నృత్యం సాగిస్తున్నది. ఈ దృశ్యాన్ని చూచి చిన్నపిల్ల నీలిమ భయపడి మూలకు వెళ్ళి దాక్కుంది.

"ఆపు నీ ఆవేశం" అనే పొలికేక వినబడింది. దాంతో ఈ లోకంలోకి వచ్చింది కాంచన. పదఘట్టన ఆపి చూచింది ఎవరా అని. ఎదురుగా బీనాదేవి.

"నీ కర్తవ్యం ఇంకా పూర్తికాలా. నీ పిల్లల్ని అమ్మిన అమ్మణ్ణి ఇంకా బ్రతికేవుంది. దాని అంతు చూడొద్దా?" అందిదేవి.

"అదుగో అమ్మణ్ణి" అని గావుకేక పెట్టింది కాంచన.

"యుగంధర్! యుగంధర్ కాంచన వచ్చిందటగా. దాన్ని కంపెనీకి పంపు." అంటూ అమ్మణ్ణి ఇంట్లో ప్రవేశించింది. అమ్మణ్ణిని చూడగానే కాంచనకు కోపం కట్టలు తెంచుకుంది.

ఎగిరి గంతేసి కొప్పుపట్టుకొని మెడవంచి కత్తిపీటతో ఒక్క వేటు వేసింది. అంతా తృటిలో జరిగిపోయింది. అంతే అమ్మణ్ణి వ్యాపారం స్తంభించిపోయింది. రెండు శవాలను ఒక చోటికి ఈడ్చింది బీనాదేవి. ఇంతలో

"అక్కా! ఎలా గున్నావు అక్కా! పిల్లలు బాగున్నారా? నీవు వెళ్ళాక నాకక్కడ కాళ్ళు నిలవలా. నీగతి ఏమవుతుందోనని బస్సులో పడివచ్చా. వాళ్లు నీ పిల్లలు, భద్రంగా ఉన్నారా?" అంటూ నర్మదలోనికివచ్చి బీభత్స దృశ్యాన్ని చూచింది. తన్మయు రాలైంది.

"వెలిగిన జ్యోతివి అక్కా, నీవు!" ఒక్క ఉదుటున కాంచనను కౌగలించుకుంది. ఇదంతా చూస్తున్న బీనాదేవికి కర్తవ్యం స్ఫురించింది. తామంతా అక్కడ ఉండటం క్షేమంకాదని తెలుసుకున్నది. తతమ్మావారిని హెచ్చరించింది.

తన బిడ్డ స్వప్నను వెంటబెట్టుకొని బీనాదేవి, నీలిమ చేయి పట్టుకొని కాంచన, నర్మద వెంటరాగా అందరూ ఆ నిశీధిలో కలిసిపోయ్యారు.



# ఉపసంహారం

"మనుషులంతా పాపులు" వారికి నిష్కృతి కావాలంటే దైవ కటాక్షం కావాలని ఒకవర్గం అంటే; మనుషులందరూ మంచి వాళ్ళే. పరిస్థితులే వారిని చెడుగా చేస్తున్నవని మరొక తెగ వాదిస్తున్నది. రెండూ పొరపాటే; ప్రతి మనిషిలో మంచి చెడు రెండూ ఉంటాయి. ఒక్కొక్క పరిస్థితిలో ఏదో ఒకటి ప్రకోపిస్తుందని మూడోమతం అంటున్నది. ప్రవృత్తులు అలవాట్లుగా మారడానికి చాలావరకు పరిస్థితులే కారణ భూతాలు. కాగా సంస్కారియైన మానవుడు తనలోని దుష్టవాసనలను అదుపులో ఉంచుకుంటాడు. కుసంస్కారివాటిని పోషించుకుంటాడు. సంస్కారం శిక్షణవల్ల వస్తుంది. విద్యవల్ల వస్తుంది. కాని పాండిత్యమున్న ప్రతివాడూ సంస్కారి కానవసరం లేదు. వివేచన, సహనం కలవాడే సంస్కారికాగా సహనానికి పరిధిఅంటూ ఉన్నదా? సహనంపేరుతో దుర్మార్గాన్ని ఎల్లకాలం ఎల్లవేళల సహించాల్సిందేనా? అలా సహిస్తే అన్యాయం పెచ్చుపెరగదా? పరోక్షంగా అన్యాయాన్ని పోషించినట్లు కాదా? హింసా ప్రవృత్తితో, పాశవిక మనస్తత్వంతో ప్రవర్తించే మనిషితో ఎలా వ్యవహరించాలి? అతనిని తుదముట్టించాలా? లేక అతనిలో హృదయ పరివర్తన తేవాలా? హృదయ పరివర్తనకు ప్రయత్నించే ప్రక్రియలో సంస్కారులు ఆహుతి అయిపోవాలా? అయితే మారతారా పశుప్రాయులు? మనిషికోమాట, గొడ్డుకోదెబ్బ అన్నారు కదా!

దుష్టవాసనలున్న ప్రతివాణ్ణీ తుదముట్టించ ప్రయత్నించినా, పశుప్రాయుడికి హృదయ పరివర్తనం కలుగజేయాలని కలలు గన్నా, రెండూ తప్పే. అవతల మనిషి మనుగడకే ముప్పుతెచ్చే మనుషులను, పరాయివాడి సుఖానికి అనుక్షణం అడ్డురావడమే తనకర్తవ్యంగా భావించే మనుషులను సమాజం అదుపులోనికి తీసుకురావాలి. వారి దుష్ట చర్యలకు అవకాశం లేకుండా వారిని నిర్వీర్యులను చేయాలి. దుర్మార్గానికి ఒడిగట్టడానికి వీలులేకుండా వారిని దానికి అశక్తులను చేయాలి. దీనికి పవిత్రమైన కోపం అవసరమౌతుంది. దుర్మార్గాన్ని ద్వేషించి నిరసించే మనస్తత్వం అలవడాలి ప్రజానీకానికి. తరతరాలుగా భారతనారీజాతి అనుభవిస్తున్న అన్యాయాలను తొలగించుకోవాలి. బానిసమనస్తత్వాన్ని పారద్రోలగల్గాలి. తిరుగుబాటు మనస్తత్వాన్ని అలవరచుకోగల్గాలి. స్వేచ్ఛావాయువులను పీల్చగలగాలి నారీలోకం. అందుకు అనువైన సమాజాన్ని నిర్మించుకోవాలి. దానికి సంఘటిత కార్యక్రమం ఎంతేని అవసరం. ఏ ఒక్క స్త్రీ తానుగా అన్ని అన్యాయాలను ఎదుర్కోలేదు. సమిష్టి ప్రయత్నం అవశ్య కర్తవ్యం. అందరూ కలిసి రాలేదని మిన్నకుండటం క్షంతవ్యం కాదు. కనుక వ్యష్టి - సమిష్టి ప్రయత్నాల మేలుకలయిక అవశ్యం అభిలషణీయం.



# సమాధానం

ఈ నవల ఆసాంతం చదివిన తరువాత అనేకులకు అనేకానేక సందేహాలు వస్తాయి. వాటి స్వభావం ఆయా చదువరుల మనస్తత్వాన్ని బట్టి, సంప్రదాయాన్ని బట్టి నిర్ణయ మవుతుంది.

'ఆడది మగాణ్ణి కత్తిపీటతో తలమీద మోదుతుందా? ఎంత అసహజం! ఎంత అసందర్భం! రచయితకు మతిభ్రమించిందా?' వేయవలసిన ప్రశ్నే. అందరూ మామూలుగా వేసే ప్రశ్నే. స్త్రీ స్వభావం ఏమిటి? అనేది మీమాంసలోకి దిగింది. రెండు రకాలుగా సమాధానాలు చెప్తున్నది ఈనాటి సమాజం. "స్త్రీ దేవతామూర్తి; ప్రణయమూర్తి; ప్రేమ స్వరూపిణి; అనురాగ రసాధి దేవత; ఆమె ఎన్నడూ ఎవరినీ ద్వేషించదు; ఎవరికీ కష్టాన్ని, నష్టాన్ని కాంక్షించదు: అంతగా తను ఇబ్బందిలో పడినా ఆత్మ బలిదానం చేసుకుంటుంది; కాని ఇతరులకు బాధ కలిగించదు." ఈ ధోరణి హిందూ సమాజ పరిరక్షకులది. అబ్బా! ఎంత మహోదాత్తస్థానాన్ని మహిళకు ఇచ్చింది హిందూ ధర్మం! విస్తుపోతాడు అమాయకుడు. పురాణాలు చదువుతాడు పాపం! మనస్సు వికలమవుతుంది. కాళికాదేవి రూపంలో రాక్షస నిర్మూలనం చేసింది ఆదిశక్తి. నరకాసురుణ్ణి వధించింది సత్యభామ. ఇతిహాసాలు తిలకిస్తాడు. దుర్యోధనాదుల సంహారం జరిగేవరకూ కొప్పు ముడవనని ప్రతిజ్ఞ చేసిన ద్రౌపది దృగ్గోచర మవుతుంది. ఈ పురాణాలను, ఇతిహాసాలను ప్రస్తుతించే ఈ సనాతన హిందువులే ఇలా వాదిస్తున్నారేమిటి! అంటే దీంట్లో ఒక తిరకాసు ఉంది. దేవతలకు ఒక నీతినీ, మానవమాత్రులకు మరొక నీతినీ నిర్దేశిస్తున్నది హిందూ సమాజం. అయితే

దేవతలను ఆరాధ్యులుగా ఎందుకు గౌరవిస్తున్నట్లు? దీనికి నిరుత్తరుడౌతాడు సనాతన సంప్రదాయ సంరక్షణకర్త. "స్త్రీకి సహనం సహజ ఆభరణం. ఆమె ఓర్పు గణనీయం: ఆమె ఓపిక ప్రశంసనీయం. ఎన్ని కష్టాలనయినా ఆమె భరిస్తుంది." ఇది మరో రకపు స్త్రీ స్వభావ నిర్దేశనం. ఇలా ఆలోచించేవారు వేసే ప్రశ్నలు ఇలా ఉంటాయి: "స్త్రీ మరో ప్రాణికి ఘాత కలుగ జేస్తుందా? ఇది ఏనాడూ ఎక్కడా జరుగదు. రచయిత తన విపరీత మనస్తత్వాన్ని స్త్రీ లోకానికి అంటగట్టున్నారు కారా?" ఈ వైఖరి వెనుకవున్న ధోరణిని మనం పరిశీలించాలి. స్త్రీ క్షమా దేవత అని ఆమెను అభివర్ణించి మామూలుగా విసుగు కల్పించే పనులను - అంటే పిల్లలను పెంచటం, ఇంట్లో వంటా వార్పు చేయడం, రోగులకు సేవ చేయుటం, బాలబాలికలకు విద్య నేర్పటం లాంటి విధులను ఆమెకు కేటాయించి సుఖపడటం నేర్చుకున్నది పురుష ప్రపంచం. ఆమె ఆయా వృత్తులనే చేపట్టాలి. సమాజం పని విభజనను న్యాయంగా చేసిందట! ఎవరికి చేతనయిన పనిని వారికి, ఎవరికి దేంట్లో ప్రావీణ్యత ఉంటే ఆ పనిని వారికి కేటాయించాలట! ఏ పని అయినా ఎలా చేతనవుతుంది? ఏ పనిలో నైనా ఎలా ప్రావీణ్యత వస్తుంది? చేస్తుంటే వస్తుంది. పురుషుడు ఈ పనులలో వేలు పెట్టకుండా, ఈ వృత్తులలో ప్రవేశించకుండా వీటిని స్త్రీలకు నిర్దేశించటంలో అంతరార్థం ఏమిటి? తను సుఖపడ టానికి స్త్రీని అణగార్చాలనే ఆకాంక్ష కాక మరేమీలేదు. ఇలా తర తరాలుగా మాటలుచెప్పి స్త్రీలనుకూడా ఇలా నమ్మించారు పురుష పుంగవులు. ఇదే వాస్తవమని భావించిన స్త్రీలోకం తనకు ఇచ్చిన కితాబులను విని పొంగిపోయింది. పురుషుడు ఎన్ని దుష్కృత్యాలు చేసినా, ఎన్ని పాపకార్యాలకు ఒడికట్టినా ఓరిమితో సహిం

చటం తన సహజ గుణమని విశ్వసించింది. కాని ఈ నిద్రలోనుండి ఆమెను అప్పుడప్పుడు మేల్కొలుపుతాయి పురుషుల అమానుష హింసాచర్యలు. ఆమె తనూ ఒక ప్రాణినని గ్రహిస్తుంది. మనుగడ కోసం పోరాటం సాగించే ప్రాణిధర్మాన్ని గమనిస్తుంది. ఆత్మ రక్షణార్థం తనకు ప్రాణప్రదమైన శీలరక్షణకోసం ఉద్యమిస్తుంది. అవసరమనుకుంటే, గత్యంతరం లేదని తోచినపుడు తనను రక్షించుకుంటుంది. ఆ ప్రయత్నంలో భాగంగా మరొకనికి ఘాత కలిగితే అది ఆమె బాధ్యతకాదు.

"అయితే స్త్రీ ప్రేమ స్వరూపిణి కాదా? ఆమెకు సహనం సహజధర్మం కాదా? చీటికీ మాటికీ ఆమె పురుషులవలెనే హింసకు పూనుకుంటుందా?" మళ్ళీ ప్రశ్నలు. మాతృత్వం స్త్రీకి ఉన్న విలక్షణశక్తి. నవమాసాలుమోసి మరోప్రాణికి జన్మనిస్తున్నమహిళ పురుషుడు చంపినంత తేలికగా మరోజీవిని సంహరించలేదు. ఇది వాస్తవమే. కాని ఇలా అన్నంత మాత్రాన స్త్రీకి ఎన్నడూ ద్వేషం కలగదనీ, ఓర్మి నశించదనీ అనుకోవటం పెద్ద పొరపాటు. స్త్రీపురుష నైజాలలో కొద్దిగా తరతమభేదాలు ఉండవచ్చును. కాని గుణాత్మక భేదాలు లేవు. ఇది గుర్తించనివాళ్ళు ఈ నవలలో జరిగిన హత్యాకాండకు దిగ్భ్రాంతి చెందుతారు.

మరో ప్రశ్న తరుముకు వస్తుంది. "ఏ ఆడదయినా తన భర్తను హత్యచేస్తుందా? ఎంత వైపరీత్యం? ఏమిటీ అపభ్రంశ చిత్రణ?" నవలను జాగ్రత్తగా చదివితే కాంచన ఎన్నడూ యుగంధర్‌ను పతిగా పరిగణించలేదు; భర్తగా భావించలేదు. కాపురం చేసిందికదా అని అంటారు కదూ! అవును; కాపురంచేసింది. గతిలేక, తనసంతానసంరక్షణకోసం అతనికితనశరీరాన్ని అప్పగించి

తన చాకిరీని అతనికి అర్పణచేసింది. మోసగించి తాళి కట్టినవాడు మగడౌతాడా? ఆమె ఆలి అవుతుందా?

ఒకవేళ యుగంధర్‌ను కాంచన తన ప్రాణనాధునిగా అంగీకరించిందనే భావిద్దాము. అయినా ఆమెను మరొక పురుషుని సాంగత్యానికి బెదిరించి పంపినపుడు, ఏ కుమార్తె రక్షణ కోసం అతని ఆ దుష్కృత్యానికి ఆమె తలఒగ్గిందో, వాగ్దానభంగం చేసి ధర్ ఆకుమార్తెలను అమ్మివేసినపుడు, అంతటితోఆగకఆమెతో తను కాపురం చేయుననని చెప్తూ ఆమెను 'కులటా!' అని సంబోధించినపుడు, ఆమెను పడుపు గృహానికి పంపేనిమిత్తం జుట్టుపట్టుకొని లాగుకొని పో ప్రయత్నించినపుడు, అడ్డం వచ్చిన ఆమె కుమార్తె నీలిమను కాలితో తన్నినపుడు, కాంచన పరిస్థితి ఎలా ఉంటుంది? అది అసామాన్య పరిస్థితికాదా? అపుడు ఆమె మనస్సు తీవ్ర ఉద్రేకానికిలోనుకాదా? ఆమె విపరీత స్థితిలోచిక్కుకోలేదా? 'కావచ్చును. కాని ఆమె పోలీసులను పిలవా'లంటుంది విమర్శక వితతి. 'ఆ పరిస్థితిలో అది సాధ్యమా' అని ఆలోచించదు ఆ వర్గం. ఎదురు తరగటం అసహజమట! మరేం చేయాలి? ఆమె చావాలి. తనుగా చచ్చిపోవాలి. లేక అతనిచేతిలో మరణించాలి. అప్పుడు హర్షిస్తుంది 'సభ్య సమాజం'. 'పాపం'! అని మొసలి కన్నీరు కార్చి హాయిగా నిద్రపోతుంది. ఆమె ఎదురు తిరిగితే శాసనం కూడా ఆమె చర్యను క్షమిస్తుంది. చావు తప్పించుకోటానికి, తన శీలాన్ని కాపాడుకోటానికి ఆమె ఆ దుష్టుణ్ణి హత్య చేసినా శిక్షాస్మృతి ఆమెను సహిస్తుంది; కాని సమాజం సమ్మతించదు. ఇక్కడే ఉంది మెలిక.

ఇంతా విని "ఇది ఇలా జరుగుతుందా"? అని ముక్కుమీద వేలేసుకుంటుంది సంప్రదాయ ప్రపంచం. జరిగిన సంఘటనలు ఉన్నాయి; జరుగుతుంది. కాగా ఎల్లవేళలా జరుగదు. ప్రత్యేక పరిస్థితుల్లో సంభవిస్తుంది.

బందిపోటు దొంగలలో, విప్లవకారులలో స్త్రీలు లేరా? ఆ ముఠాలు, వర్గాలు జరిపే హత్యాకాండలో స్త్రీలు పాల్గొనడం లేదా? పురుష స్వభావం, స్త్రీ నైజం గుణాత్మకంగా వేరు వేరని భావించడం తప్పు.

'కాంచన యుగంధర్‌ను చంపింది. అమ్మణ్ణిని హత మార్చింది. ధర్ శవంపై నృత్యం చేసింది. ఇంత భీభత్సానికి స్త్రీ ఒడికట్టుందా?" అనే సందేహం పొడ సూపవచ్చు. ఇటలీ ఫాసిస్టు హంతకుడు ముస్సోలినీని 'మిలన్' పట్టణ ప్రజలు చంపి అతని శవంపై స్త్రీ పురుషులు నృత్యం చేశారని గుర్తు చేసుకోవాలి. మానసికోద్రేకం తారాస్థాయికి చేరినపుడు పరిసరజ్ఞానం లోపిస్తుంది; బాహ్య స్మృతి అంతరిస్తుంది. ఒకే ఒక మనోభావం—అదే పగ, కసి—మనస్సునంతా ఆక్రమిస్తుంది. మరొకటి స్ఫురించదు. అదొక పిచ్చి; ఉన్మాద స్థితి. శృంగార రసంలో కూడా ఉన్మాదాన్ని, మరణాన్ని అవస్థలుగా అంగీకరించిన పండిత మ్మన్యులు కసిచేత ప్రకోపింపబడే ఉన్మాద స్థితిని గుర్తించటం అసాధ్యం కాదు.

మరొక్క విషయం. సహజం, సామాన్యం అనేవి విభిన్న పదాలు. సామాన్యంగా ఒక చెడ్డపనిని స్త్రీ చేయదు; కొన్ని

ప్రత్యేక పరిస్థితులలో సహజంగా ఆమె అందుకు పూనుకోవచ్చును. ఈ తేడాను గమనించటం అవశ్యం.

"కాంచన రెండు హత్యలు చేయవచ్చును. ధర్ శవంపై నృత్యం చేయవచ్చును. కాని ఆ భీభత్స దృశ్యాన్ని చూచి నర్మద తన్మయురాలైనదన్నారే! ఇది అసహజంకాదా?" ఇలాంటి విమర్శ రావటం పరిపాటే. నర్మద సంప్రదాయంపై తిరుగుబాటు చేసింది; భర్తకు విడాకులిచ్చింది. తిరుగుబాటు చేయాలని కాంచనకు బోధించింది. అలాంటి నర్మద ఈ దృశ్యాన్ని చూచింది. నర్మదచూపు వేరు; ఇతరుల చూపువేరు. కాంచనలో, ఆ సమయంలో ఏమి కన్పించింది? తిరుగుబాటు తత్వం దర్శనమిచ్చింది దెబ్బకు దెబ్బతీసే కార్యశూరత గోచరించింది. దానికి తన్మయురాలైంది నర్మద.

తిరుగుబాటుతత్వం ఒక్కొక్క స్థితిలో ఒక్కొక్క రూపం తాలుస్తుంది కార్యరంగంలో. ఒకచోట భర్తను చీవాట్లుపెట్టి తూలనాడటంగా రూపొందితే, మరొక సమయంలో మగనిని విడనాడడం జరుగుతుంది. మరొక సన్నివేశంలో అతనిపై సమాజానికి, ప్రభుత్వానికి ఫిర్యాదుచేసేదిగా తయారవుతుంది. ఇంకొకపరిస్థితిలో పతినామధారుని తుదముట్టిస్తుంది. ఇంతకూ చెప్పేదేమిటంటే, ఆయాపరిస్థితులప్రాబల్యానికీ, తిరుగుబాటుతత్వబహిర్గతరూపానికీ, అవినాభావ సంబంధమున్నదని. కొందరు కేవలం సంఘటనను మాత్రం గమనించగలితే మరికొందరు సూక్ష్మదృష్టితో దానివెనుక దాగివున్న మనస్తత్వాన్ని పరిగణలోనికి తీసుకోగలరు. నర్మద దృష్టి అలాంటి సునిశిత పరిశీలనాశక్తి కలదనేది విస్మరించరాని విషయం.

"ఇంతక్రూరచయిత భర్తలను చంపమని ప్రబోధిస్తున్నారా?" అనేది చివరిప్రశ్న. రచయిత చంపమనటంలేదు. ధర్ లాంటి పురుషుడు కాంచనలాంటికనకాంగిని అలాఅన్యాయంగా అక్రమంగా హింసిస్తుంటే, ఆమె-గత్యంతరంలేని పరిస్థితుల్లో - అతనినిచంపితే, ఆమెచర్య క్షంతవ్యం అవుతుందని మాత్రమే రచయిత ఉద్దేశం. కాంచన ఆలోచించి, కుట్రపన్ని, పథకంవేసి, ఆయుధసామాగ్రిని సిద్ధంచేసుకొని, మాటువేసి ధర్‌ను చంపలేదే? ఇంచుమించు ఉన్మాదస్థితిలో అలా ప్రవర్తించింది. కాంచన, బీనాదేవి, నర్మదలు తలా ఒక అన్యాయానికి గురి అయిన తరుణులు. తమ చిత్తవృత్తి ననుసరించి ఆయా పరిస్థితులలో వారు ఆయా ప్రవర్తనకులోనయి నారు; అంతే. హింసకూ, యాతనకూ లోనయిన వ్యక్తి ప్రవర్తించే తీరు, తరువాత తీరికగా ఆలోచించి సమాజం, పోలీసులు, కోర్టులు పనిచేసే పద్ధతి భిన్నంగా ఉంటాయి; ఉండాలికూడా. కాంచన, బీనాదేవి, నర్మదలను ఆ విషాద పరిస్థితులలో చిక్కపర... సామాజిక స్థితిగతులను గురించి ఆలోచించమనేదే రచయి... అభ్యర్థన. సహృదయులు అందుకు పూనుకోవాలనేదే ఆమె...

ఎం. వి. రామమ్మ

# మా వద్ద దొరికే గ్రంథాలు

| | | |
|---|---|---|
| ఆధునిక స్త్రీ : | మల్లాది సుబ్బమ్మ | 12.00 |
| ఫాసిజం : | ఎం. ఎన్. రాయ్ | 7.00 |
| విముక్తి ఉద్యమాలు: మహనీయులు : | మల్లాది సుబ్బమ్మ | 3.50 |
| నవ్యమానవ వాదం : | ఎం. ఎన్. రాయ్ | 6.00 |
| ఎం. ఎన్. రాయ్ : | కె. రాధాకృష్ణమూర్తి | 25.00 |
| మనం దేనికి బానిసలం ? : | మల్లాది సుబ్బమ్మ | 3.50 |
| హేతువాదం అంటే ? : | ఎం. వి. రామమూర్తి | 4.00 |
| [illegible]స్తికత్వం - నాస్తికత్వం : | రావిపూడి వెంకటాద్రి | 12.00 |
| [illegible]ల్లే పిల్లనుచంపితే ? : | మల్లాది సుబ్బమ్మ | 3.50 |
| [illegible]ర్జెన్సీలో జైలు అనుభవాలు : | ఎం. వి. రామమూర్తి | 3.00 |
| ఓ[illegible]! ముందుకు సాగిపో : | మల్లాది సుబ్బమ్మ | 4.00 |
| [illegible]మనీషి: ఎం. ఎన్. రాయ్ : | కొల్లా సుబ్బారావు | 8.00 |
| [illegible]తున్న సమాజంలో మహిళలు : | మల్లాది సుబ్బమ్మ | 4.00 |
| [illegible]నాగరికత : | ఎం. ఎన్. రాయ్ | 8.00 |
| [illegible]వ్యూహం : | మల్లాది సుబ్బమ్మ | 6.00 |
| [illegible]కల్ హ్యూమనిజం : | ఎం. ఎన్. రాయ్ | 1.00 |
| [illegible]గిన జ్యోతి : | మల్లాది సుబ్బమ్మ | 12.00 |
| [illegible]ధి మార్గం : | కె. రాధాకృష్ణమూర్తి | 12.00 |
| [illegible]పూజ : | మూకంది లాల్ | 1.00 |

వికాసం, 9, ఎం. జి. హెచ్. కాలనీ, మెహిదీపట్నం
హైదరాబాద్ - 500028.